

భారతి, మార్చి '51

“సంతాల్ దంపతులు”

శ్రీ యస్. కృష్ణారావు



వికృతి
ఫాల్గునము

# భారతి

సంపుటము 28
సంచిక 3

# రజని



శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

భర నమిత నీల శాఖాగ్ర భాగ సరణి
స్ఖలిత చరణార్ధ విధుత పక్షపుటము లయి
పులుగు లెట్టులో చెట్లపై మొనలయందు
నొందుచున్నవి నిలుకడ వందలాది.

అరగా ల్మోపున జాతి వెండియు సమాయత్తమ్ములై, యార్చుచుఁ
గను లల్లార్చుచు, నగ్రశాఖలపయిం గాలూది యె ట్టెట్టులో,
పరివేష్టించి సహస్రసంఖ్యల బకవ్రాతంబు లా తింత్రిణీ
తరురాజమ్మును జేసివేసినవి శ్వేతద్వీపముఁ సంధ్యలఁ.

పరువిడి పద్మినీహితుడు పశ్చిమ దిగ్వనితాను రక్తితో
నరుగకమున్నె, కొన్న విమలార్ఘ్య జలమ్ములతోడ, జీవితే
శ్వరుని పదమ్ములం గడుగసాగె దలోదరి, ఉల్లసత్ స్మితాం
కురములతోడ మాఱుపలుకుల్ కులికించుచు, నవ్వ వానికిఁ.

తామర సంచిలో మధునిధానము నుంచి, బిగించి కట్టి, ఆ
పై మొన సీలువేసి అళివల్లభు పేరిటినల్ల లక్కతో,
తామరయింట దాచి నిభృతంబుగ జీకటి బంట్లకాపునం
దామరసాప్తు డేగె నిశి దా బారుగూరికి, బోక తప్పమిన్.

పొసగనున్న వియోగపు వెస దలంచి,
హితునిపాటును గమనించి, యెద గృశించి,
మక్కులందు గణ్గ్రాసములు దుసికిలి
జాలినార్చుచు, జక్కవల్ చదలబాఱె.

మొగుడు పద్మినీమణిఁగని తొగమిటారి
పక్కనన్ నవ్వె రేకులపల్లు మెఱయ;
ఆ కులుకు నవ్వు వెన్నెల లతిశయించి,
పొలముఁజం బాల తరగల పొరలు గురిసె.

అనుగు మగండు కాలవశుడై చరమాంబుధి గూల బద్మినుల్
వనరి విషమ్ము ద్రావి మెయి బాయగ బోయిరి, చంద్రుపేర్మి జ
ల్లని యమృతమ్ముగా నది చలంబున బ్రాణము లూడ్వదయ్యె; గ
ల్గును నిధనమ్మొటుల్ వ్యథలు కొల్లగ బైబడనున్న వేళలన్?

వలపులు గ్రుమ్మరించి వలెవాటుగ వేసిన చల్వ శాలువా
పొలిపము మంజు కుంజవర పుంజములం జిరరంజితమ్ముగా
నలరుచు, సాగి, పుష్పవతులౌ లతకూనలపైని పైకొనెన్
నలి మలమూనిలుండు; మదినమ్మగ వచ్చునె ద్రిమ్మరీం ద్రుడన్?

కాలకృషీవలుండు ఘన కౌముదిపేరిటి పైరు పెంపగా
జేలకు దట్టపుం బురద చీకటి నీళులు వెట్టి తారకా
మాలిక లన్న విత్తులు సుమాళమునన్ వెదజల్లె, నవ్వియున్
జాలున మోసులెత్తె నవచంద్రకళాంకుర సంజ్ఞితమ్ములై.

మునుకొని అప్పు తెచ్చుకొని మూలధనమ్మును చంద్రునొద్ద, ఏ
చినుకున గల్తి కన్పడని చిక్కని వెన్నెల పాలకొట్టు పె
ట్టెను విను వీధిలోన బ్రకటించి మహాప్రతిభన్ నిశావ్రజాం
గన; అవి త్రాగియే బలుపు గాంచిరి తెన్ను చకోరబాలకుల్

అమృతమయమైక మూర్తివి , విహాయసభూమికి శేఖరుండ, వు
త్తముండవు, రాత్రి నెన్నొసట గందపుబొట్టువు చందురుండ, కూ
రిమి స్పృశియింపుమయ్య, ప్రసరింపగజేసి, మదీయవల్లభుఁ
బ్రమదమునఁ స్పృశించిన కరమ్ముల తోడన నన్ను సైతముఁ.

చలువలరేని చేయి సుధ జల్లుచు జల్లగ సోకిసోక జొ
బ్బిలి, గిలిగింత వాఱి, కనువిప్పిన కల్వల నవ్వు పుప్పొడుల్
వలచు సరోవరోదకములం గనిపించుచు నున్న, వార్తితో
వలకుల జక్రవాకములు పైపయి బొటిన చాఱలిప్పుడుఁ.

తల లోదిగి తమ్మిపూవులు నలిగిపోవు;
బెగడి రాయంచజంటలు నెగిరిపోవు;
నేరుపున నెవ్వడోయుంచె నూర్పి, చెఱువు
నందు నుత్తానితమ్ముగ నాకసమును.

రాత్రి యన భయంకర కాళరాత్రి సూవె,
పగలు పొసరుచు వేలుపా! పశ్చిమాద్రి
బడక, పవళుల కవళికల్ పరగ గూర్పు
మయ్య! నిశి పోవు పోకడ అలతి గాదు.

చల్లగ చల్లగా బఱపి చాచి కరమ్ములు, తాక వచ్చు జా
బిల్లిని ముందు ముందు గని, వే మొగ్గముల్ ముకుళించి, పద్మినీ
హల్లక గంధు లెల్ల రోదుసై ముడుగంబడి, శీల సంపదం
జెల్లగ నీక కాచికొని, చెప్పిరి త త్సరసీమతల్లికిఁ.

అల్లన జేయిసాచి తము నంటగ వచ్చు హిమాంశు నంశువుల్
చెల్ల శపించి భృంగరవళిఁ, వెనుకాడమినిం గళంకి వా
డుల్లము క్రుంగి, పద్మిని, వనోదరమందు మునింగె, గూతులుం
ద్రెళ్ళిరి సొంపు దక్క; అవధీరణ సైతురె మానినీమణుల్?

కలువలరేని వెన్నెలల గాటపు నవ్వుల తాక సోకి, క
న్నుల తెలివాలురేకు లొక నొవ్వన మవ్వము దూలి రాలిపో,
నిలువున మేనితీవ కడు నీరసమై పస దేఱె, పద్మినుల్
కలగి కృశించి రాత్రి బరకాంతుల కొదురొకొ పతివ్రతల్ ?

వెలది వియోగదుఃఖ పరివేదన గీతము లాలకించి, నిశ్చలములుగా నిలంబడి, విచారము మేరలు మీఱి, నిండుకన్నుల జలబిందువుల్ దొరల, నోళులలో నెమరుల్ దొలంగి, ఆవులు విలపించుచున్నవి తవుల్పడి ముంగిట గాలిలంకెలన్.

రజని గూడిమాడి రుచించి రాజుమెఱసె;
రాజు వెన్నెల కౌఁగిట రజని యలరె;
తన్మహానంద చిత్కళాతన్మయత్వ
మున జగత్ క్షీరవారాశి పొంగి పొరలె.

చలువదుస్తులు కయిసేసి చందురుండు
కులుకు కిలకిల నవ్వుల కలువసాని
మిన్నయిలుసేర రాత్రి, తుమ్మెద తలారి
మదనరాజున కెఱిగించె మఱిమఱి నది.



# కవి - విమర్శకుడు

# కీ॥ శే॥ శ్రీ రామలింగారెడ్డిగారు



శ్రీ జి. సాంబశివరావు



"ఆంధ్ర విశ్వవిద్యాలయాధ్యక్షుడు, కవి, రాజకీయవేత్తయు, విమర్శకుడు, వక్త"

ఈవిధంగా తెలుగు మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు డా. కట్టమంచి రామలింగారెడ్డిగారిని అభినుతించి వున్నారు. రెడ్డిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయాధ్యక్షుడు. కవి, రాజకీయవేత్త, విమర్శకుడు. వక్త. ఇన్ని మహాలక్షణాలు ఆయనలో ఒదిగి తెలుగు జాతిలో ఆవిర్భవిల్లి, తెలుగు ప్రజానీకాన్ని చక్కని బాటల్లో దిద్దిన మహా పురుషులలో ఆయనగూడా వకరై, తెలుగు ప్రశస్తిని దిగ్దిగంతముల వ్యాపింప చేసినారు. అందువల్ల ఆయన తెలుగుజాతికి చిరస్మరణీయుడు.

ఆంధ్ర విశ్వవిద్యాలయాధ్యక్షుడుగా ఆయన సాధించిన ఘనకార్యాలు దేశవిదితములైనవి. మాటలు తిన్నగా నేర్వని ఒక పసిదానిని పోషించుటవంటిది, ఆయన నిర్వహించిన ఈ మహా కార్యభారము. ఇప్పటికి ఈ విశ్వవిద్యాలయం దేశీయములైన అన్ని విశ్వవిద్యాలయాలతోను తులతూగ గల్గుతున్నదంటే, అందుకు డా॥ రెడ్డిగారి నిర్విరామకృషే కారణం అని చెప్పాలి. దేశంలో శాస్త్రవాసనలు చాలా కొదువగా వుండేవి కాబట్టి, ఆయన ముఖ్యంగా ఈ విద్యాపీఠంలో అట్టి శాస్త్ర విజ్ఞానాభివృద్ధికి దోహదములైన పీఠములను ప్రోదిచేసి కృతకృత్యులైనారు. అదీగాక, రెడ్డిగారు స్వయంగా ఆర్థిక శాస్త్రాన్ని (*Political Economy*) ఆదిలో తెనిగించడం గూడా గమనించదగిన విషయం. ఆ గ్రంథాన్ని విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారు ప్రకటించి వున్నారు. దీనినిబట్టి చూస్తే, వీరికి పాశ్చాత్యభావ ప్రపంచం

పట్ల గౌరవమే గాక, అధునా తన శాస్త్రవిషయాల పట్లగల ఆసక్తి, వాటికి తెలుగుదేశంలో వ్యాప్తిని కల్గించ వలెననే నిష్ఠ ఎంతగా వున్నదీ వ్యక్తం అవుతూ వుంటాయి.

కవిగా రామలింగా రెడ్డిగారు వ్రాసిన గ్రంథములు ఒకటి రెండు కన్న ఎక్కువ లేవు. అట్టి ఒకటి రెండు గ్రంథాలలో ముఖ్యంగా పేర్కొనదగింది "ముసలమ్మ మరణం" అన్న కావ్యము.

"ముసలమ్మ మరణం"లోని ఇతివృత్తం రాయవాచకంలోది. ఒక కన్య ప్రజా రక్షణార్థం, తన ప్రాణాన్ని బలివ్వడం ఆ ఇతివృత్తంలోని విషయం. ఆ సంఘటన హృదయవిదారకమూ; కరుణామయము. అయినా, దివ్యము. దేశంలో కవిత్వం ప్రేమ మయం, పురాణౌన్నత్య వర్ణనామయం అయి పోయిన రోజుల్లో జగద్ధితము, దేశహితైకము, ప్రజా రక్షణాగత బుద్ధిచేత ఆత్మబలిదానమునకు దిగగల్గి నంతటి త్యాగ సంపన్నము, అయిన ఒకానొక పునీత స్త్రీవ్యక్తియొక్క దివ్యగాథను కావ్యంగా ఆలపించాలన్న పరేంగితజ్ఞానం రెడ్డిగారికి వుండటం విశిష్టం.

వీరు కావ్యానికి ఇతి వృత్తంగా గ్రహించిన కథలో ఆ తెలుగు పడుచు 'జగద్ధితం, కోసం, "ఆంధ్రజనావళి మోదమును బోరయుట కోసం", "స్వంత లాభాన్ని కొంత మాత్రమే" కాక, అంతా మానుకొని "గట్టి మేలు తలపెట్టింది". ఆ తల పెట్టిన గాథను డా॥ రెడ్డిగారు కావ్యంగా సంతరించి, అధునాతనుడైన గురజాడకవి పల్కిన ఆశయాన్ని కావ్యవిషయంలో పొదుగుతూ, పురాతనులైన నన్నయ తిక్కనల కవితా మార్గంలో దాన్ని రచించి, ఇటు వీరికి, అటు వారికి మధ్య వారధివలె ఆ కావ్యం నిలబడగల ప్రతిభ చూపించుకున్నారు.

డా॥ రెడ్డిగారి రాజకీయ సిద్ధాంతాలలో పేర్కొనదగింది ఇండియాను నాన్ ఫెడరేషన్ గా అంటే, స్విట్జరుల్యాండులాగా నిర్మించడం అవసర మున్నది.

భారతదేశంలో ఎన్నో రాష్ట్రాలు వున్నాయి. ఇవి ఇప్పుడు రాష్ట్రాలుగాని ఒకప్పుడు దేశాలు. ఏ దేశానికి ఆ దేశం స్వతంత్రంగా వుంటూ, స్వతంత్ర మైనసభ్యతను, స్వతంత్రమైన సంస్కృతిని, స్వతంత్ర మైన జీవితవిధానాన్ని అనుభవిస్తూ వచ్చాయి, ఆ తరువాత ఈ దేశంమీద ఎన్నో దండయాత్రలు విదేశీయులు చేసినవి జరిగాయి. కాని, ఆ స్వతంత్ర భావపు పచ్చి ఆరలేదు. ఆ గొప్పతనపు ముద్ర సడల లేదు. రవీంద్రకవి అంతటివాడు సోనార్ బాంగ్లా అంటూ తన వంగదేశాన్ని కీర్తించుకున్నాడు. ఏ ప్రాంతానికి ఆ ప్రాంతానికి ప్రత్యేకమైన భాష, ప్రత్యేకమైనచరిత్ర ప్రత్యేకమైన సంప్రదాయం వుంటూనే వున్నాయి. అందువల్ల వీటిని ఒక్క త్రాటిమీదకు, ఆ ప్రత్యేక లక్షణాల నన్నిటిని అట్లాగే వుంచి, తీసుకురావాలంటే, నాన్ ఫెడరేషన్ పద్ధతి ఒక్కటే సవ్యమైన మార్గంగా ఆయనకు కన్పించింది. ఆ కన్పించిన విషయాన్ని ఆయన ప్రపంచించాడు.

రాజకీయ విషయాలలో వున్న ఈ వివేచనా శక్తిని, ఆ రాజకీయ విషయాల పరిధులకే ఒదిగించక కావ్యవిమర్శనకుగూడా ఆయన పట్టించడం తెలుగు వారి భాగ్యం అనక తప్పదు. కవిత్వంలో గురజాడ అప్పరాయ కవి ఎంతటి విప్లవాన్ని తెచ్చాడో, భాష విషయంలో గిడుగు రామమూర్తిపంతులు ఎంతటి విప్లవ భావాన్ని సుదిగూర్చుకున్నాడో, కవిత్వ విమర్శ విషయంలో డా॥ రెడ్డిగారు అంతటి విప్లవాన్నీ తెచ్చారు; అంతటి విప్లవభావాన్ని సుదిగూర్చు కున్నారు.

డా॥ రెడ్డిగారు 'ఆంధ్ర కవిత్వ తత్వ విచారాన్ని' ప్రకటించకముందు తెలుగు కవిత్వ విమర్శ ఎట్లా వుండేదో చూస్తే, ఈ విషయం బాగా బోధపడుతుంది. ఆయన ఈ పుస్తకాన్ని ప్రకటించక ముందు కవుల చరిత్ర, కవి జీవితాలు, ఆంధ్ర వాఙ్మయచరిత్ర, శతకకవుల చరిత్ర మొదలైన కొన్ని గ్రంథాలు వెలువడ్డాయేమో గాని, ఈ గ్రంథాలలోని విమర్శనాపద్ధతికిన్నీ, డా॥ రెడ్డిగారి విమర్శనాపద్ధతి కిన్నీ హస్తి మశకాంతరం భేదం వుంది. రెడ్డిగారి మాటలలో; "నా ప్రధానోద్దేశము విమర్శన గాని చరిత్ర పరిశోధనము కాదు......ఒక విద్వాంసుడు గొప్ప గ్రంథమున కొక దానికి విమర్శన ప్రాయమైన పీఠకను వ్రాయుచు నా గ్రంథమును ప్రశంసించుటకై యిందు పదునెనిమిది విషయములైన వర్ణనము లున్నవి

యని దృష్టాంతములతో చూపియున్నాడు. ఇది దోషము కాదు గాని, పొరపాటునకు వీలిచ్చెడి పద్ధతి......కావున విమర్శనము చేయుటలో కథ, పాత్రములు, ప్రకృతి విశేషములు, వర్ణనలు నివి యన్నియు పరస్పర మైత్రిగలిగి, విరుపులులేని యేకాకృతిగానున్నవా అన్న విచారణ ప్రధానమని నా మనవి."

దీనినిబట్టి ఒక్క మహా విషయం వ్యక్తం అవుతున్నది. డా॥ రెడ్డి ఈవిధ విమర్శకు కడంగక ముందు దేశంలో విమర్శన పేరుతో చరిత్ర పరిశోధన సాగేది. ఒక వేళ విమర్శ అంటూ వున్నా, ఆ కవిత్వం ద్రాక్షాపాకంలోనో, కదళీ పాకంలోనో, నారికేళ పాకంలోనో వున్నట్లు చెప్పుకోవడమే తప్ప, కావ్యాన్ని విన్యసించడంలో కవిచూపిన ప్రతిభను వ్యక్తీకరించే ప్రయత్నం జరిగిన జాడలు అంతగా కనిపించవు. అదీకాక, ఈ విమర్శన అయినా ఏ గ్రంథానికో పీఠికగానే జరుగుతూ వుండేది కాని, దానికి ఒక ప్రత్యేక అస్తిత్వం లేదు. ఇక వున్న అస్తిత్వం అల్లా ఒక్క ఆలంకారిక గ్రంథాలకు. అవి సంస్కృత గ్రంథాలకు తర్జుమాలే గాని, స్వతంత్ర రచనలు కావు. అందువల్ల విమర్శ అన్నది అంతా, ఆ కాలంలో సంస్కృత, ఆలంకారిక శాస్త్రాల ఒరవళ్లలో జరిగేది. ఆ అలంకారిక లక్షణాలు పట్టినది కావ్యం; కానిది కాదు. ఈ విధంగా స్వతంత్ర రచనలే గాక, స్వతంత్ర విమర్శన గూడా చచ్చిపోయింది. తెలుగు దేశంలో ఆ చచ్చిన విమర్శకు ప్రాణంపోసినవాడు డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు అనడంలో అతిశయోక్తి ఏమీ లేదు.

విమర్శనా పథంలో డా॥ రెడ్డిగారెంతటి స్వాతంత్ర్యాన్ని ప్రకటించినారో, తెలుసుకోగల విషయాలు మరికొన్ని వున్నాయి. కవిత్వ తత్వ విచారంలో అందుకు బీజాలు కన్పిస్తాయి. ఆ గ్రంథంలో ఒకచోట ఆయన, "వీరచరితము కొన్ని ముఖ్యాంశములలో రామాయణ భారతాదులను తీసిపోదు సరిగదా, వాటికి ఈడైనదని నా అభిప్రాయము. ఈ తరగతికి చెందినవే బాలనాగమ్మకథ, బొబ్బిలిరాజు కథ, రాజా దేశింగు చరిత్రము మొదలగు ప్రజా సమ్మతములగు కృతులు' అని వ్రాసివున్నారు. ఈమాటలు అప్పుడు అనగల్గుట ఇప్పటి యంత తేలిక కాదు. అందుకు సాహసము ఎంతో వుండాలి. అది డా॥ రెడ్డిగారిలో కొల్లలుగా వుంది. అందువలననే ఆయన ఏవంవిధ ప్రజా కవిత్వాన్ని సూక్ష్మంగా పరామర్శించి, వానికి భారత రామాయణాదులతో సమాన స్థానాన్ని ఇచ్చారు. కావ్యాల రీతినో, మహర్షుల చందముననో నిర్వికారస్థితినుండువారు పద్యముల వ్రాయనేర్తురు గాని, కవులనుట యసంభవమని అనగల్గారు. ప్రజా జీవితంతో సన్నిహిత సంబంధం కలవారు మాత్రమే అచ్చమైన కవిత్వాన్ని పండించగలరని సిద్ధాంతీకరించడం గూడా జరిగింది.

అదీకాక, డా॥ రెడ్డిగారు విమర్శకుడుగా బయలు దేరు నాటికి పూర్వం తెలుగు కవిత్వమాగాణం ఒకవిధంగా నిర్వికారంగా వుండిపోయింది. ఆతరువాత పాశ్చాత్య దేశాల భావాలు వ్యాప్తిలోకి వచ్చి, కొత్త జిలుగులు తీసుకురావడం ప్రారంభించాయి. ఈ ప్రారంభం నీచమానవుల ప్రారంభం కారాదని, జాతీయజీవనంతో భాగస్వామియై, నిద్రాణమైయున్న ప్రతిభను ఉద్దీప్తం చేయగల్గాలని ఆయన ఆశించారు. "మనకు వున్న సంస్కృతి యేమో వున్నది; కవితా సంప్రదాయములు వున్నవి. అయితే, మనస్సును ఉజ్జీవింపజేసే కొత్తభావాలు మాత్రం లేవు. ఇప్పుడు అవి పాశ్చాత్య సభ్యత పేరుగా వస్తున్నాయి. వాటిని మన సంస్కృతితో జతజేసి, జాతీయముద్ర చావకుండా చూసుకుంటూ ముందుకు పోదాం" అని ఆయన ఇచ్చిన సందేశం. "ముసలమ్మ మరణం" కావ్యం ఈవిషయాన్ని రూపిస్తున్నది. ఇట్టి కవికి, విమర్శకునకు మన జోహారులు.

"రెడ్డీ! నీ కవితా విమర్శన విధాశ్రీలే కథాకవ్యాప్తి వే
రొడ్డెన్ మార్గము పూర్వ లాక్షణికు లుద్యోగంబు సద్యోగమై
యొడ్డారించిన నీ వచోలతికలం దుయ్యాలజంపాలలై
యుడ్డీనాకృతులైరి సూరన కవీంద్రోక్తి ప్రబంధాంగనల్"

(శ్రీ విశ్వనాథ సత్యనారాయణ)

# శృంగార ప్రవల్హిక



శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

[ఉపోద్ఘాతం:— ఈ రచన కేవలం కార్ట్సు టిప్పూక్ సిగరెట్టువంటిది. అది సర్వకాల సర్వావస్థలయందు ఏకముఖాగ్ర ఆస్వాదనీయం. ఇదీ అంతే. కావున దీన్ని పై నుంచి క్రిందకే చదువవలెను గాని క్రిందనుంచి పైకి (ఎట్టి అవస్థలోనైన సరే) చదువ వలనుపడదు.

కాని ఈ ఆంక్ష సంపాదకమహామహులకు, కంపోసిటర్ మహామనీషులకు ఏ మాత్రం వర్తించదు.

ఇట్లు
ఉపోద్ఘాతకుడు.]

అది గభీరమూర్తి అదొక శ్యామలాంగి
అది విశుద్ధ మదీయ పర్యంకవర్తి
ప్రవిమలానంద దాని సంస్పర్శనమ్ము
సర్వగాత్రాఖిలాంగ సంస్పందనమ్ము
కంఠాశ్లేషము పొంది, అ
కుంఠితచుంబనము చేసి కులుకున్, నిద్రా
లుంఠనక్రియ నే మేల్కాం
చం, తింగున అవనతముఖి చాటున దాగున్.
అది సమార్జిత అభిసారికాఖ్య కీర్తి
అది విభావరీమధ్య విహారవర్తి
అది పరిష్వంగఖేలనావిధి విభాసి
అది మదీయార్ద్ర మాధుర్య మధు పిపాసి.
అది నఖక్షత కేళీహ హ్వాంతరంగి;
తాను దశనక్షతాల ఉద్దండురాలు.
ఆ గృహేతరవర్తి నే నైననాడు;
ఆ ప్రవాసి ఉపోష్యకృశాంగమూర్తి.

*   *   *

అసలు అది యెవ్వరో అంచు హాడలకండి,
అది అదేకాని యింకోటి అవదులెండి;
కోత లాపి సంస్కృతపు గగ్గోలు మాని
చల్లగా అంటినా, అదే, సల్లిలెండి!

—

# శ్రీ అరవిందులు



శ్రీ వేలూరి శివరామశాస్త్రి

## 2

శ్రీ అరవిందుల తపస్తేజము గీతా వ్యాఖ్యానముగను, *Essays on Githa*- భాగవత జీవనమునను- *Life Divine*-మహాయోగముగను - *Synthesis of- Yoga*-మూడు తోవల ప్రవహించెను. అందు మన మిపుడు భాగవత జీవనము గంగా ఘట్టములోనికి దిగుదము.

'ప్రపంచమునం దెల్లెడలను చిచ్ఛక్తి ప్రచ్ఛన్నముగా నున్నది అటు లయ్యును అది సక్రియము. అది అతీంద్రియ మగు ప్రకృతి రహస్యము.' కాని, సృష్టికి చిచ్ఛక్తి మూల మను సంగతిని మనస్సు సాజముగా ఒప్పదు. ఏల? మానవులకు దాని గనుగొనగలిగిన సహజ దృష్టిగాని, దివ్యదృష్టిగాని లేదు. కొన్ని కొన్ని చోటుల కార్యమునుబట్టి కారణమును కనగొనగలిగిన అవకాశమే యున్నది. మానవుడీ తర్కబుద్ధితో ప్రపంచము గాని, తన్ను గాని పరిశీలించి, చైతన్య మని యొకటి యున్నదని కనగొనలేడు. మానవునిలో గల చిదాభాసునియొక్క దృష్టి ప్రసరింపజేసితి మేని అది ఒక వెలుగు-చీకటుల వింతయాటగా కనుపట్టును. ఇక ప్రపంచముదెస జూతమా అది యంతయు చావు బుట్టువుల పునరావృత్తి. సృష్టికి అనంత మగు చిచ్ఛక్తియే - *Infinite conciousness force* మూల మగునేని అది రాలలోను, రప్పలలోను, అణువులలోను, పరమాణువులలోను, మరి యెల్లెడలను కనబడి తీరవలెను. అది మనకు కనబడకపోగా ఈ ప్రపంచమునకు అనంతమగు ఒకానొక అచేతనము-*Infinite Nescience*- లేక బ్రహ్మాండములను మింగు నొకానొక శూన్యము మూలమనియు, అనగా ఈ సృష్టికి పూర్వము సూర్యుడుగాని, చంద్రుడుగాని, నీరుగాని, నిప్పుగాని, గాలి గాని, ధూళిగాని లేదనియు, జడ ప్రపంచంబీజ మీ అచేతన-శూన్యముతో నారంభమై, శబ్దస్పర్శ రూప రసగంధ వికారమగు బ్రహ్మాండ పద్మముగా వికసించె ననియు తోచును ఈ స్థూల ప్రపంచ మిటు లావిర్భవించుటకు ఎన్ని కోట్లకోట్ల యేండ్లు పట్టెనో, అటు పిమ్మట ఎంత కాలాంతరమున ఈ స్థూల మాధారముగా ప్రాణము, జీవకణము, జీవదేహము మొలకెత్తెనో, ఎంతెంత కాలము కడచనిన పిదప ఈ జీవదేహ మాధారముగా మానస చేతన స్ఫురించెనో ఎవరు చెప్పగలరు? ప్రకృత పరిణామ ప్రక్రియ, లేక, యీ యారోహణక్రమము ఇచటనే ఆగక బలపడి యింకను క్రొత్తక్రొత్త భూమికలకు ప్రాకునట్లు దారిలో నున్నయటుల చూపట్టును. కావున ఏ దినుసుతో ఈ ప్రపంచ మారంభ మాయెనో, ఆ దినుసు మనకు కనబడకున్నను, తెలియకున్నను సద్వస్తువే కావలయును గదా. అదియే అనంతశాఖలతోడను, ఉపశాఖలతోడను దేశకాలములగూడా గర్భీకరించుకొని యీ బ్రహ్మాండమునకును, ఇట్టి బ్రహ్మాండ సహస్రసహస్రములకును మూలము కాదా? ఇట్టి అభిప్రాయముతో దానిని సత్తని అనినను అసత్తని అనినను తేడా లేదు, విచిత్రమగు నీ ప్రపంచమునకు అసత్తే (సద్ + భిన్నమే) కారణ మని నమ్మించగల సంబారముతో గూడ మానవ మనస్సు సంఘటితము కాలేదు.

ఈ ప్రపంచమునకు దేశము కారణమని కొందరును, కాలము కారణమని కొందరును, నిత్యము నువిరివియగుచుండు పదార్థము కారణమని మరికొందరును చెప్పుదురు. కాని యీ మాటలే సిద్ధాంతము లని మన మనస్సు నమ్మజాలదు. అది యటుండె. జగద్రహస్యమును జెప్పు మతము లెట్టివయినను అవి యన్నియు నీ జగన్మూలము అవాఙ్మానసగోచర మనియు, అనిర్దేశ్య మనియు, అప్రమేయ మనియు అంగీకరించును. కావున, ఈ మూల తత్త్వము అనంత మగు సత్తుగాని, అనంతమగు అసత్తుగాని, నిత్యము వృద్ధి చెందు

చుండు పరిమేయ పదార్థముగానియగుచో నీ మాటిలో నెటులో ఒకటులు చెప్పదగిన విశేషము గాని, లక్షణముగాని లేదేని, అట్టి అవిశేషమునుండి, విలక్షణము నుండి నిర్గుణమునుండి విశిష్టమును, సలక్షణమును, గుణము గాని సగుణము నగు నీ ప్రపంచమెటు లుద్భవించెను?

జడవిజ్ఞాన మిటులు చెప్పును — 'ఈ ప్రపంచమునకు ఒక మహాశక్తి-*Energy*- కారణము. దాని స్వరూపము నేటికిని విశదముగా తెలియదు. అది ప్రత్యక్షము కాదు. కార్యమును బట్టి యిట్టి శక్తి యొకటి యున్నదని యూహింపవలెను.'

కొన్ని చిల్లర తత్త్వములుగూడ ఇంద్రియ గ్రాహ్యములు కావు. వానిని నిరూపించుటకు ప్రమాణము లేదు. ప్రమాణము లేకున్నను జడవిజ్ఞానము వీనిని పాటించును. కేవలము కల్పనా సాహాయ్యమే వీనికి ప్రామాణ్యము. కొండమీద పొగ లేచు చుండుట చూచి కొండలో నిప్పు కలదని ఊహింతుము. వంటింటగాని, మరియొకట గాని నిప్పును, పొగనుగూడా మన మెరుగుదుము. వీనిలో నిప్పును గాని, పొగను గాని లోగడ మన మెరుగమేని కొండలో నిప్పు కలదనియు, అది అగ్నిపర్వత మనియు మనకు తెలియదు. ప్రకృతమునందు హేతు వగు ప్రపంచమును మాత్రమే మన మెరుగుదుము. శక్తిని, *Energy*-ఎరుగము. ఎరుగకున్నను ప్రపంచమునకు 'ఏదో' కారణ మొకటి ఉండితీరవలయునుగనుక, కారణమగు 'ఏదో' అది 'శక్తి' యై యుండునని జడ విజ్ఞానము కల్పన చేయును. 'ఏదో' అనుదానికి 'శక్తి' అనునది ప్రత్యామ్నాయముగా కల్పన చేయబడెను గావున, దీని ప్రత్యామ్నాయకల్పన-*Representative fiction* అని అందురు. శక్తి-*Energy*- అనునది యీ తెగకు చేరిన తత్త్వము. శక్తి-*Energy*-ప్రపంచమునకు మూలము. దీనినుండియే జడాజడావిర్భూతి. జడమునుండి ప్రాణమును, ప్రాణమునుండి మనస్సును పరిణమించెను.

'అజ్ఞేయమును, అచేతనమును నగు నీ శక్తినుండి జ్ఞేయమును, చేతనోపేతము నగు నీ ప్రపంచ మెటులు పుట్టుకొని వచ్చుచున్నది?' అను శంక యీ సిద్ధాంతమునందును ఉండనే యున్నది. మిగిలిన మాట యటుండగా చైతన్యము పుట్టుకొని వచ్చుటయే పరమాశ్చర్యము. చేతన లేని ఒకానొక అంధ శక్తియే మూలతత్త్వ మగునేని, దీనినుండి వైధర్మ్యముకల చేతన నెటనుండి తెత్తుము? గ్రుడ్డి పరమాణువునుండిగాని, గ్రుడ్డి ఎలెక్ట్రానునుండిగాని ప్రకాశస్వభావమును, సహస్రముఖమును నగు ఎరుక ప్రవహించు ననుటకు జడవిజ్ఞానములో సమాధానము దొరకునా? జడాణువులవు, తటిదణువులయు తత్పరివారములయు, జీవకోశములయు, గ్రంథులయు, లాలాదులయు చేష్ట షేక్స్పియర్, ప్లేటో వంటివారల మెదడులను సునిశితము చేసి వారలచే హామ్లెట్, సింపోజియమ్, రిపబ్లిక్ వంటి ఉత్తమ గ్రంథములరచియింపజేయగల సామర్థ్యమునకు ప్రతిభువు కాగల దనుమాట విన్నదా కన్నదా, మది నమ్మదగ్గదా? కావున, జడవిజ్ఞానము ప్రపంచమునకు మూలతత్త్వమును గ్రహింపలేదని చెప్పినచో నది గడుగ్గాయిమాట కాదని అనవచ్చును. అవాఙ్మానసగోచర మగు నీ ప్రపంచ మూలరహస్యమును తెలిసికొనవలయుచో ఈ దారి దాటుట లగ్గు. జడవిజ్ఞాన మీమాంసల ప్రశ్నమునకే కాక, ఏతదంతర్గతములును, ఏతత్పృద్భవములు నగు పెక్కు సందియములను పోగొట్టజాలకున్నది.

సృష్టి మొదటి సోపానము మొదలుకొని నేటి చివర సోపానము వరకును స్తరము వెంబడి స్తరము లెటులావిర్భూత మాయెనో పరిశోధింపవలెను. జడవిజ్ఞాన మెడతెగక పరిశ్రమించి పరిశ్రమించి వివిధములగు జడ వికాసములలో కార్యోత్పాదకము లగు సంబంధములను, అదమనీయ మగు బాహ్యవికాసవేగమును నిరూపించుచున్న మాట నిక్కముకాని ఏతదంతర్నిహిత మగు తత్త్వము నది తెలిసికొనవలసియే యున్నది. ఈ యశ్వత్థము మొదట అలక్షణీయమగు నొకమహాశక్తి *An Indeterminate Energy*, ఉన్నదని మన మెరుగుదుము. ఈ మహాశక్తి భూమికపై లక్షణీయము లగు పెక్కు తత్త్వములు-*General determinates* మనకు కనబడుచున్నవి. లక్షణీయములగు ఆ తత్వములయు, శాఖా తత్వములయు, ఆధారమున విశిష్టలక్షణీయములగు, *Particular determinates*— పదార్థము లనంతముగా కానిపించుచున్నవి. ఒక తటిచ్ఛక్తి సాధర్మ్యం, వైధర్మ్యధరోభయశూన్యశక్తులతో ప్రకాశించి, అనుపదముననే తరంగములుగను, అణువులుగను మారిపోవుచున్నది. శక్తికృతమగు నొకానొక

బాష్పావస్థ వేరు వేరు బాష్పములను-*Gasses* పెక్కింటిని పుట్టించుచున్నది. ఘనీభవించిన ఒక శాక్తావస్థనుండి ఘాతత్త్వము పొటమరించి పలు తెరగులగు మన్నులుగను పెక్కు రకములగు రాలుగను, వింతవింత లోహములుగను వికాస మొందుచున్నది. ఈ రీతిగా సృష్టిలో స్తర స్తరమునందును ఒక స్తరనుండి పెక్కు స్తరములును, గుణహీనములగు నవస్థలనుండి గుణయుక్తములగు నవస్థలును ఉద్భవించుచున్నవి. ఉద్భిదములందును, అండజములందును, జారుజము లందును స్వేదజములందును, స్థావరములందును, జంగమముల యందును ఈ రీతియే మనకు కనబడును. కాని యీ సృష్టిలో ఒక స్తరమునుండి భిన్నధర్మములు కల వేరొక స్తరమెటు లుత్పన్న మగుచున్నదో వేరువేరు తెగలెటు లుద్భవించుచున్నవో మన తెలిసి కొవల. అవిశిష్టమగు నొక యవస్థనుండి విశిష్టమగు నొక యవస్థ విశిష్టావిశిష్ట మార్గములతో నెటులు బయలు దేరుచున్నదో యీ దేవరహస్యమును జడ విజ్ఞానకోణమునుండి యించుకేని గ్రహింపజాలము. ప్రతి స్తరమునందును ప్రతి క్షేత్రమునందును అసంఖ్యేయములగు నీ నానాత్వ వైచిత్రికి అవిచలమగు ఆఏకమే ప్రతిష్ఠ. దీనివలన ప్రకృతి మార్గ మిదియే యనుట నిశ్ప్రచము. కాని యిది యెటులు సంభవమగుచున్న దనునదియే అగోచరము. దేవ రహస్యము. మరల మాటాడిన బ్రహ్మరహస్యము, దీని వెను వెనుక బ్రహ్మాండమగు నొక మనస్సో, సృజనశీలమగు నొక ఆలోచనప్రవాహమో, ప్రచ్ఛన్నమగు నొక యిచ్ఛాశక్తియో ఉండియుండునుగాని వీనిలో నేదియు నీ లోకపద్మమునం దేరేకునందును పట్టుపడదు. దీనికి జడవిజ్ఞానము చెప్పు ఏ సమాధానమును మనలను సందేహవిముక్తుల నొనరించి సంతుష్టుల నొనరింపలేదు. సృష్టిలీల నంతయు ప్రహేళ మగు నొక మార్గమున నియంత్రణ మొనరించుచున్న పరమ రహస్యమునకు 'అంధశక్తి స్వైరఖేల'-*Dynamic chance*-యని బొడ్డుకోసి పేరు పెట్టుటయే తుది మాట యని యంగీకరించుటకు సహజముగనే మన మనసియ్యకొనదు. కుశల మగు నొక స్వైరాచారము గాని, కౌకచమ్మలు కల ఒకానొక శక్తిగాని యీ సృష్టిప్రవాహము నట్టడుగుననుండి జాత్యంధములగు ఆవర్తముల పోటుపోటులచే, ఘాతప్రతిఘాతములచే నీ విశ్వమును సృజించుచున్న దనుచో నిది యుక్తిసంగతము కాగలదా?—'అటులు కాదు; ఈ విశ్వమునం దెల్లెడలను కఠోర మగు యంత్రశాసన మొకటి చూపు నిష్ఠురమగు తర్జనీ తర్జనము నీ కనుల ప్రేలెడి నే. అట్టిచో నిందు స్వైరాచారమునకుగాని, అంధశక్తికిగాని ప్రసక్తి యేడ?' అని యడుగునెడల ఇట నిది గనునింపదగినది. సృష్టిప్రవాహములో రెండు పాయ లున్నవి. ఒక పాయలో సమస్తవిధులను, సమస్తనిషేధములను బాంధవశాత్రవములను ఏట గలిపి, ఆ పరాని వడితో కొండలను బదాబద లొనరించు స్ఫోటప్రయత్నము కనబడును. కొనలు, గోనలు గానక గిరగిర తిరుగు నీ సుడిగుండము నడుమ చూపు బరపుదు మేని, దీన నొక నియమముగాని, నీతి, గాని లే దనియు నిది యొక యంధశక్తి చేయు నుత్కట హేలీసక మనియు తోపకమానదు. మరియొక పాయ దెస తల తిప్పితి మేని, అందు జంత్రపు కట్టుబాటువంటి దిట్టమగు కట్టుబాటొకటి నిక్కచ్చిగా జరగిపోవుచున్నటులు కనబడుచుండుట వలన ఈ ప్రపంచము వెనుక ఎవడో ఒకానొక గొప్ప యేలిక అనపాడుచు చుండుట లేదుగదా యని యనిపించును. కావున అదృష్టవాదముగాని—*Theory of chance*—యంత్రశాసనముగాని—*Theory of Mechanical Nescessity*—సృష్టిరహస్యమును విడదీయు వ్యాఖ్యాన మెంతయును కాజాలదు. వేయి విధములగు నీ విశ్వలీల వెనుక అంధ మగు అచేతనము—*Nescience*—ఉన్న దనిగాని మరియొక రీతిగా ఈ విశ్వము నంతయు జాత్యంధ మగు నొకానొక యంత్రశాసనము నడపుచున్న దనిగాని చెప్పినయెడల మనసు శాంతి జెందునా? చేతన లేని యీ గుడ్డిశక్తి నుండిగాని, యీ యంత్రశాసనము నుండిగాని చైతన్య మెటు లుప్పతిల్లెనను శంక క్రమ్మర గ్రమ్మర తల యెత్తుచునే యుండదా? ఈ ప్రశ్నమునకు సరియగు సమాధానము వలయుచో వెలిచూపుల కీ ప్రపంచకారణ మొక అచేతన మని తోచినను లోచూపునకుమాత్ర మీ జడమునందే చేతన పేరుకొనిపోయి యున్న దనియు, అది అనంతమనియు దాని వికాసక్రమ సుసాధారణ బలోపేతమనియు తోపదా? కావున నేటి వైజ్ఞానికులు వెనుకటి మతము మార్చుకొని క్రొత్తరీతిగా జడమును పరిశీలింప బాటుపడుట కనుగొనుచున్నాము. ఇపుడు వారు జడములో చేతనము నాహ్వానించి దానిచే ఓ యని యనిపింపగలమని ఆసాసల పాలగుచున్నారు. 'జడము ఇక జడమే యని ఎంతో

కాలము మన మనుకొన' మని సుప్రసిద్ధ వైజ్ఞానికు డొకడు సంభావించుచున్నాడు. 'సదృశావస్థలో సదృశాచరణము జడవస్తువునకు స్వభావము'— *All phenomena behaves similarly under similar circumstanes* — అను పూర్వసిద్ధాంతమునకు భిన్నముగా 'తటిదణువులకు సదృశావస్థలో విదృశాచరణము కలదనియు, ఇవి ఇచ్ఛాశక్తి గల పదార్థము లనియు, జడము ప్రసుప్త మగు చేతన అనియు'—*Congealed Consciousness* మరియొక వైజ్ఞానికు డూహించుచున్నాడు. కాగా జడమని చేతన పొందిన సుప్తావస్థతో గూడు కట్టిన ఒకానొక పదార్థము. అనగా జడము నిశ్చేతనముగా పయిపయికి కనబడినను దీనిలో చేతన ప్రచ్ఛన్నముగా నున్నదని నేటి వైజ్ఞానిక మహామహోపాధ్యాయులు తలచుచున్నారు. వీరి యూహల నంగీకరింపనివారు లేకపోలేరుగాని ఆ యీ విషయము లన్నియు వినగా కనగా జడమునకును, చేతనకును, ఇంత కాలమునుండియు గల పగ పోయి చెలిమి కలుగు అడిగూలను పొన పొన కానిపించుచున్నది. ఈ రీతిగా నేటి వైజ్ఞానికుల సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనమువలన ఒక క్రొత్తదారి ఏర్పడిన మాట నిక్కువమే కాని యిది చీకటిలో వెలుగునకు వెతుకులాడు చందము. ఋషులు జడములో అనంతమగు చైతన్యమును కనుగొనిన వైఖరి యీ వైజ్ఞానికుల బాహ్యదృష్టి కెటులు పట్టపడును? జడమును విడగొట్టి వీర లూపనెంచిన సంవిత్ స్వరూప మజ్ఞేయము. అవచేతన కనురూపమగు నొకానొక ఛాయ వారికి దొరకవచ్చు నేమో కాని సరియగు దాని స్వరూపము జడవిద్యాలయాలమున కావలనే యుండునని తోచును. కావున నీ జడవిజ్ఞానుల ప్రయోగాగారమునుండి వెలువడి వేరొక దారి బట్టనిచో ఈ జగద్రహస్యమును కనుగొనగల మను నాస పేరాస.

## 3

నేడు ప్రపంచమున మనోవిజ్ఞానము — *Psychology*— అను ఒక శాస్త్రము పెరగినది. పెరుగుచును న్నది. అది బాహ్యవిషయములతో మనస్సునకు గల స్థూల సంబంధములను పరిశీలించును. అనగా దీని పరిశీలన మెంతసేపును విషయగతము—*Objective*, ఈ శాస్త్రము మనస్సునకు దేహయంత్రముతోడను విశేషించి స్నాయుమండలముతోడను అవినాభావసంబంధము కలదని నిరూపించును. శారీరక-మనోవిజ్ఞానమును—*Phisiological Psychology* వృత్త-మనోవిజ్ఞానమును—*Behaviouristic Psychology* — పై విషయములలో ధురంధరములు. జడ మగు మనస్సు—*Phyii-cal mind*—సమగ్రముగ దేహక్షేత్రమున చేసికొనుచు బోవు తటిత్ ఖేలను మన మిపుడు అతిమాత్రముగా వీని వలన నెరుగుచున్నాము. మనోదేహములు రెండును 'ఎవరికి వారే యమునాతీరే' అని తొల్లి మన మనుకొను చుంటిమి. ఇపుడీ శాస్త్రము ప్రసాదించిన వెలుగు వలన ఈ రెండును సన్నిహిత జ్ఞాతు లని మనకు తెలియుచున్నది. ఇంతియ కాక మనోవిజ్ఞానమునకును ప్రత్యక్ష శారీరకమునకును — *Phisiology*— గాఢ మైత్రి కలిగినటులు మనకు తెలియుచున్నది. అది యటుండె. ఇపుడు జడవిజ్ఞాన మొకవెపు ఆధ్యాత్మిక మగు తేజోమార్గము వెస మెలమెలగా నడుగులు వెట్టుచుండగా మరియొక వెపు మనోవిజ్ఞానము జడములో తా నెచట నున్నదో తన యూనికిని వెతకుకొనుచు బోవుచున్నది. ఇంత సిరిసంపద లున్నను ఆధునిక మనోవిజ్ఞాన మాంతరప్రపంచమునకు కడు దవ్వుగనే యున్నదని చెప్పక తప్పదు. ఇద్ది విషయ నిమగ్నమయి నంతవరకు దీనికి స్వస్వరూప మెరుగ గల శక్తి ఉప్పతిల్లదు. యజ్ఞదత్త, విష్ణుదత్తాదులతో గల సంబంధము వలన దేవదత్తునిలో జరగిన పరివర్తనమాత్రమును నిర్వచించినందువలనగాని, అతని వ్యుత్పత్తి నిమిత్తమును నిర్ణయించినందువలనగాని దేవదత్తచరిత్రము సమగ్రము కాదు. ప్రవృత్తి నిమిత్తము, దేవదత్తత్వమే దేవదత్తచరిత్రలో సారము. దీనికి పరాఙ్ముఖిత పనికిరాదు. ప్రత్యఙ్ముఖితతోడనే పని. అది యీ మనోవిజ్ఞానమున ఉండదు. మన స్తత్త్వము తెలియవలయు వారికి యోగమే అవలంబము.

ప్రత్యక్షానుభవము వలన జగన్మూల కారణము తెలియబడదు. అపరోక్షానుభవమువలన ఈ జగమునకు మూలము చేతన యని తెలియనగును. అది చిన్మయ మగు మహాశక్తి. విచిత్రశక్తిఖచితమును సర్వజ్ఞమును సర్వేశ్వరేశ్వరమును అగు దాని అభివ్యక్తియే యీ బ్రహ్మాండము. అనంత మగు ఆ చైతన్యమునందే, ఆ సత్తునందే యీ బ్రహ్మాండముల సృష్టి స్థితి లయముల తౌర్యత్రికము. ప్రకృతిలీలలలో మన కగపడు గణిత

శాస్త్రమా చిన్మయపురుషోదితమే. ఈ ప్రపంచమునందలి రూపసౌందర్యమంతయు, రసానందమంతయు అతని ఆనందచ్ఛాయయే. అతడు బ్రహ్మాండాతీతుడై *Extra Cosmic Divinity* బ్రహ్మాండయంత్రమునకు వెలుపట నుండి-*Dues ex machina*-ఈ ప్రపంచమును నడుపుచున్నచో ఈ ప్రపంచాతీతుని ప్రపంచములో వెతకుట వృథా. సృష్టియందలి పొరపొరలోను గణితశాస్త్రప్రక్రియలో కనబడు కచ్చితమగు నియమములబోలు నియమములు కనబడుచుండుటచే ఒకానొక సర్వజ్ఞుడు దీనికి కారణమని స్వీకరించుట యుక్తిసంగతము కాకపోదు. కావున నితడు విశ్వాతీతుడయినప్పటికిని విశ్వమయుడును కావచ్చును. అణువణువునందును ఆ మహాశక్తి ప్రచ్ఛన్నమయియుండవచ్చును. కావున అదియు ప్రత్యక్షానుభవమున కావలగను ఉండవచ్చును. విచారించి చూచినచో ఈ యూహయు యుక్తికి దూరమని చెప్పుటకు వీలు లేదు. ఐనను ఈ మతమునందును ఈ సందియము ఉండనేయుండును—ఈ బ్రహ్మాండలీల యంతయు చేతనాశక్తియే యగునేని దీనిలో నింత దుఃఖమేల కనబడగలదు? ఈ దుఃఖము, ఈ కష్టము, ఈ జర, ఈ మరణమిం దెందుకు? ఇది యంతయు చూచి—'ఓ భగవంతుడా నీ యిచ్ఛాశక్తి సంతయు నీ తలనే తాల్చి నీ దారిని నీవు లేచి పో; మనుష్యులను చంపకు' అని ఆక్రోశింపవలయునని తోచకుండునా? 'ఈ కనబడునదంతయు బ్రహ్మమే, అంతయు అతనిసృష్టియే' యని మాటిమాటి కనుట మనకు మాయాతేకాని ఎటులిది నిష్పన్నమాయెనో యీ రెంటి నడుమల గల హద్దుపద్దు లేవియో దొరకినచో జగద్వ్యాపారమును జగన్మూలమును తెలిసికొనగలమని ఆశ పెట్టుకొనుట వలన ఏమియు ప్రయోజనము లేదు. ఈ జగత్తులో గల అజ్ఞానమును, అభావమును దుఃఖమును ఒకానొక మహాభావము, ఒకానొక మహాజ్ఞానము, ఒకానొక మహానంద మావిష్కరించుచున్న దనుట యేటి యుక్తి?

ఇచట మాయావాదులు కొందరు 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' బ్రహ్మము నిక్కము జగత్తు కల్ల. జీవ జగత్తులు మాయాకల్పితములు. వీనికి సార్థకత లేదు. బ్రహ్మ మొకటియే పరమార్థసత్తు. అది నిర్విశేషము. నిర్గుణము. నిరాకారము. ఈ జగత్తు మిథ్య యని తెలిసి బ్రహ్మమునందే నిర్వికల్పసమాధి గొనుట పరమార్థము అని సాధారణముగా చెప్పుదురు. వీరి మతమున బ్రహ్మము నేతి నేతి బోధగృహీతము. అనగా బ్రహ్మము నేల కాదు, నీరు కాదు, నిప్పు కాదు, గాలి కాదు, మిన్ను కాదు అను నీ మొదలగు వేరిమి ఎరుకచే *comqlete negation of all realities*—తెలియదగినది. నిర్విశేషమగు ఆ తత్త్వమునకు—*A featureless absolute*-ఎట్టివికారమును అనగా మార్పును పొసగదు. కావున సవిశేషమగు నీ జగత్తు నిర్విశేషమగు వస్తువునుండి ఎటు లుద్భవించును? బ్రహ్మము 'ఏకమేవాద్వితీయమ్' రెండవది లేని ఒకటియే కావున నామరూపాత్మకమగు ప్రపంచ మెల్ల మిథ్య. జీవు డవిద్యకు లోనయి మిథ్యాప్రపంచమును నిక్కమని తలచుచున్నాడు. లోజూపుచే ఎరుక కలిగిననాడు మాయ తొలగును ప్రపంచ ముండదు. ఈ ప్రపంచ మొక కల. జీవుడు కలలో గాంచినదానిని నిక్కమని చూచును. మేలుకాంచినంతనే కల్ల యని తెలియును. ఆ చందముగనే మాయామోహితుడగు జీవుడు ప్రపంచమును నిక్కమని తలచును. మాయాపాశము తెగినంతనే మిథ్య యని తెలిసికొనగలడు.

మాయావాదులీ ప్రపంచమును మనకు మామూలుగా కలుగు భ్రాంతులతో జను కట్టుదురు. వానిలో రజ్జుసర్ప భ్రాంతి యొకటి. తాటిని జూచి పామని భ్రమయు వానికి తోడు అజ్ఞానముయొక్క ఆవరణశక్తిచే ఆవరింపబడుడు దానియే విక్షేపశక్తివలన పాముగా కానిపించును. ఇది భ్రాంతిమూలకము. ఈ యవస్థలో నున్నవానికి పాము ప్రత్యక్ష సత్యము. భ్రమ తొలగినంతనే అతడు తాటిని జూచును. ఈ చందమున అవిద్యావశుడగు జీవునకు సత్యవస్తు వావృతమయిపోవును. ఆ స్థలమున మిథ్యాప్రపంచము కనబడును. కాని ఎరుక కలిగినంతనే అవిద్య నశించుడు తొల్లి మిథ్యాప్రపంచము కనబడ్డచోట భూమ, లేక బ్రహ్మము కనబడును. అపుడు జీవజగత్తు లుండవు.

మరు మరీచిక మరియొక భ్రాంతి. ఎడారిలో ఎండవేళ నడచు తెరువరికి పొనపొన ఎండమావులు కానిపించును. ఆ యెడారిలోగాని దానికి దాపులగాని జలము లేకున్నను చెరువున్నటులు కనిపించును. ఆలిచిప్పను జూచి వెండిరేకని అనుకొనుటయు ఇట్టి భ్రాంతియే. కావున జీవ జగత్తులు మనకు ప్రత్యక్ష సత్యములుగా కనిపించినను ఇవి మాయా కల్పితము

లనియు, బ్రహ్మమే సత్య మనియు, ఆ బ్రహ్మమునం దివి యారోపితము లనియు మాయావాదుల యాశయము.

జీవజగత్తులు మాయాకల్పితములేనా? సృష్టి రహస్య మిదియేనా? ఈ ప్రపంచ మా యీశ్వరుని ఐశ్వర్యములలో ఒకానొక ఐశ్వర్యము కాదా? నేటి మన అవిద్య క్రమక్రమముగా ఆత్మజ్ఞానముదెస పురోగమించుట లేదా? మరియు జడము స్వాశ్రయమున పరిపూర్ణసచ్చిదానందాభివ్యక్తియే యీ సృష్టి కుద్దిష్టము కాదా? ఈ ప్రశ్నములకు సదుత్తరములు వలయునేని మాయావాదుల పై యుక్తులు పరీక్షణీయములు.

కలతో పోల్చినను ప్రపంచమును ఉహ్వాని ఊదివేయుటకు వీలు లేదు. ఏలన కలలోని వస్తువు లన్నియు ఉత్తివి కావు. లోజూపును దవ్వులకు బరప గలిగినచో స్వప్నములందు కలుగు వింతల కర్థనవమగు నొక సంగతియు, తాత్పర్యమును కానవచ్చును. కలలలో కలుగు నతీంద్రియస్పర్శల ననేకసమయములలో కల్లలని అనుకొనుట కలదుగాని అవి నిక్కములే. దాన ప్రపంచ మొక కల యని త్రోసి పారవేయుటకు వీలు లేదు.

రజ్జుసర్పదృష్టాంతము గూడ సరి యయినది కాదు. త్రాటిపై పాము లేకున్నను పామసలు మిథ్యావస్తువు కాదు. మాపు పడినచోట పాము లేక పోయినను పా మొక సత్యవస్తువు. మన మొకపుడు దాని నెరుగుదుము కావుననే సమయాది విశేషములవలనను భ్రమ పొందుదుము. అవిద్యాప్రభావమున జీవుడు బ్రహ్మముపై ప్రపంచము నారోపించి సత్యముగా గ్రహించునేని ఎచట నీ ప్రపంచమును మనము చూచుచున్నామో అచట నది లేకున్నను సత్య మగు ప్రపంచము ఎచటనో ఒకచోట పామువలె నుండితీరవలయును గదా. కావున దృష్టాంతదార్ష్టాంతికములకు తౌల్యము లేదు.

మరుమరీచికాదృష్టాంతముగూడ సరి కాదు. ఎచటనో ఒకచట, కడు దవ్వులనే యగు గాక చెరువులు కలవు. అవి కాల్పనికములు కావు. కావున ప్రపంచమును మిథ్య యని త్రోసివేయుటకు తగిన కారణము కనిపించదు.

ఈ తెగకు జెందిన మాయావాదులు కొందరు జీవజగత్తులు రెండును మిథ్య యగు నేని మాయ యెటులు సత్య మగును? జీవుడు మిథ్య యగుచో బంధ మెవరికి? మిథ్యావస్తువున కసలు బంధ మెటులు? మిథ్యాబంధమునుండి ముక్తి వడయుట కర్థ మేమి? ఇంతియకాక యీ ప్రపంచ మసత్య మను ననుభవము గూడ నేల మిథ్య కాదు? మరియు నీ మాయావస్తు వెటనుండి దిగెను? బ్రహ్మమునుండియే దిగెనచో నిది మిథ్య యగు టెటులు? మరియు నా మాయాప్రభావముచే కేవల మసత్యవస్తుదర్శన మెటులు తటస్థించును? కాన నీ మాయయు మిథ్య యగునేని జీవజగత్తు లీ మిథ్యా మాయా కల్పితములేని యీ మాయా శరీరమునందు మాయోపహత మగు మనస్సులో తురీయ మగు నా సత్తానుభూతియు మాయాకల్పిత మేల కాదు' అని యీ మొదలుగా శంకించుకొని అజాతవాదాది వాదములను వెలువరించిరి. వాని యాశయ మిది — 'ఈ ప్రపంచ మిదివరకు లేదు, నేడును లేదు, రేపును ఉండబోదు. ప్రపంచ మసలు సృజింపబడనే సృజింపబడలేదు.' ఈ మతమునందు 'కనిపించు నీ మిథ్యాప్రపంచము బ్రహ్మమునం దెటులారోపిత మాయె' నను శంకకే ఆస్కారము లేదు. 'బ్రహ్మముతో మాయ కెట్టి సంపర్కమును లేదు. మాయ బ్రహ్మమునుండి పుట్టలేదు. మాయ వేరే ఒక 'వస్తువు' అని చెప్పువా రున్నారు. వీరు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇది యెల్లయు బ్రహ్మము అని ఒక మూల చెప్పుచు మాయ బ్రహ్మమునుండి పుట్టలేదు, ఇది విడివస్తువు అని యను టెటులు సమంజసము? ఈ రీతి వాదమువలన అసలు సంగతి మూల కొదుగుటయ ఫలము. పై జెప్పబడిన మాయావాదులలో శంకర భగవత్పాదు లొకరు. వా రతిసూక్ష్మబుద్ధితో చేసిన సృష్టి రహస్య వ్యాఖ్యానము దార్శనిక ప్రపంచమున సుప్రసిద్ధము. వారిది విశిష్ట-మాయావాదము-*Qualified illusionism.*

శంకరుల వాదము జీవజగత్తులను రెంటిని ఊది వేయదు. శంకరులు వ్యావహారికసత్యము, పారమార్థిక సత్యము అను రెండు సత్యములను జెప్పి జీవజగత్తులకు వ్యావహారిక సత్యత్వ మంగీకరించిరి. కావున వారిమతమున జగత్తున కాంశికసత్యత్వము కలదు. కాని ఆత్మజ్ఞానము కలిగినంతనే జగత్ప్రవాహ మెండిపోవును. బ్రహ్మ మొకటియే సత్య మని తెలియును. 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మమును అను మాట నిక్క

మయినను జీవుడు మాయోపహతుడయినంతవఱకు తన స్వరూప మెరుగజాలడు. నామరూపాత్మక మగు నీ ప్రపంచ మతనికి సత్యము. మాయాపాశము తొలగగనే అతడు తురీయమున కలసిపోవును. మరి అచట ప్రపంచ మేమియు నుండదు. నేడీ దేశకాలముల హద్దులలో ఈ ప్రపంచము సత్యమయ్యు మాయాసీమ దాటగనే దీని కస్తిత్వ ముండదు. [భేదాభేదవిచారము పునాదిగా గల] వ్యావహారికదృష్టితో ఈ ప్రపంచమును జూచుచున్నాము కావున పైసాదృశ్యము మనకు ఇంచుకయు సాదృశ్యోపలబ్ధి కలుగదు. ఒక్క పరమార్థదృష్టిచేతనే మన మీ జీవజగత్తుల ప్రకృతస్వరూపములను చూడగలము. పలురకములగు కుండలయందును, నగలయందును మట్టియునికియు బంగారపు యునికియు ఏకమాత్రసత్యమయినటులు నామరూపాత్మక మగు నీ జగదంతరాళమున ఆ పరబ్రహ్మమే ఏకమాత్రసత్య మని తెలియగలము. ఈ ప్రపంచోద్భవప్రలయముల మూలమున ఈ నిర్విశేష నిర్గుణబ్రహ్మమే సత్యము సనాతనము. మాయనుండి పరిత్రాణము పడయుటయే చరమ లక్ష్యము. ఇది శంకరుల మతము. కాగా శంకరుల మతమున జీవజగత్తులకు అసత్య సత్యత్వము—*unreal reality*—కలదు. అనగా అవి మన యజ్ఞానమునకు సత్యములు. సరి యగు నేజ్ఞానమునకేని అసత్యములు—*real to our ignorance, unreal to any true knowledge*—శంకరుల వాదమున జగద్బ్రహ్మముల నడుమగల ఏకాంతవిరోధమే వ్యక్త మగును. శంకరులు సృష్టికి గల ప్రకృతోద్దేశమునుగాని సార్థకతాదులనుగాని స్పృశింపలేదు.

మాయావాదుల పై దృష్టిభంగి యంతయు పురాతన వేదాంత విచారధార నాశ్రయించుకొనియున్నదే కాని యిది ఒక అంశిక సత్యము. అది ఒకానొక భావమాత్రము. అది బ్రహ్మమును అభావాత్మకమగు బోధముచే గ్రహించి బ్రహ్మప్రపంచముల ఏకాంతవిరోధమును స్థాపింపబూనుకొనెను గాని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇది యెల్లయు బ్రహ్మమే. అనగా జీవజగత్తులు ఆ యీ బ్రహ్మస్వరూపమునుండి క్రమముగా అభివ్యక్తమాయెను—బ్రహ్మ మొక నిర్విశేష సత్తామాత్రమే కాదు. అది సంపూర్ణాభావాత్మకబోధచేతను, సంపూర్ణభావాత్మకబోధచేతను గ్రహింపదగినదే కాక యీ రెంటినిగూడ నతిశయించినది—*It is both a supreme negation and supreme affirmation, and transcends both*—

ఉపనిషత్తునందలి చతుష్పాద్బ్రహ్మవర్ణనమును గ్రహించినయెడల జీవనప్రవాహమును కొట్టివేయుటకు వీలు లేదు. మాయావాదులకు జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడును నిద్రయే. జీవుడీ మూడవస్థలయందును నిద్రితుడే. ఏలనగా ఈ యవస్థాత్రయమునందును అతనికి తత్త్వోపలబ్ధి లేదు. జాగ్రత్ స్వప్నములు నిద్రకంటెను ఎక్కువ దోసగులు. ఏమన ఈ రెండిటియందును అతడు తత్త్వమును వేరుగా చూచును. కాని యిట్టి వ్యాఖ్య యుక్తము కాదు. 'సర్వం హ్యేతద్ బ్రహ్మ, అయ మాత్మా బ్రహ్మ, సోఽయ మాత్మా చతుష్పాత్' ఇది యెల్లయు బ్రహ్మము. ఈ యాత్మ బ్రహ్మము, ఆ యీ యాత్మ చతుష్పాత్తు అని యీ యుపనిషత్తు మొదటనే చెప్పెను. దీనిని విశదబరచి చూచినచో మాయ కెచటను తావు దొరకదు. ఇందలి తృతీయపాద 'మన్నిటికిని కారణము'—*Contains the seeds of creation*—ఇచటి సుషుప్త్యాద్యవస్థలు ప్రతీకములు. నిద్రతో సామ్యము పెట్టుట భ్రమ. ఇది ధ్యానమగ్నుడును సమాధ్యవస్థితుడును అగు బ్రహ్మ అవస్థ. కాని నా'డిది యెల్లయు బ్రహ్మమే, ఈ యాత్మ బ్రహ్మము, ఆ యీ యాత్మ చతుష్పాత్తు' అను నీ మాటల కన్నిటికిని తాత్పర్యము పొసగదు. మరియు బ్రహ్మ మొక నిర్విశేషతత్త్వమై జగద్విరోధము సాధించును. ఏదో యొక ఆధ్యాత్మికాభిజ్ఞతలో ఈ రీతిగా భాసించినను బ్రహ్మచైతన్యమునం దిది యొక అంశికసత్యము. ఇదియే పరమసత్య మని గ్రహించుట భ్రమయే యగును. కేవలము 'ఇది కా దిది కాదులతో' బ్రహ్మమును వ్యక్తము చేయగాదు.

నిర్గుణ, నిర్విశేష, నిరాకార, తు, రాతురాది నామములబట్టి బ్రహ్మమునకు గుణము లేదని కాని ఏ యాకారము నతడు పొందలేడని గాని అర్థము చెప్పరాదు. గుణాకారాదులు బ్రహ్మమును సీమాబద్ధము జేయలేవనియే వీని తాత్పర్యము. అనంతగుణములను వ్యక్తము చేసినను బ్రహ్మచైతన్యమునందింకను అనంతగుణములకు సంభావ్యత కలదు. అతడెన్ని రూపము లెత్తినను ఇంకను ఎన్నియో రూపముల నెత్తగలడు,

ఏ గుణమును, ఏ రూపమును, ఏధర్మమును అతనిని రిక్తుని జేయలేవు. కావుననే నిర్విశేష నిర్గుణ నిరాకార నిరంజనాది పదము లతని అసామర్థ్యమునకు పరిచాయకములు కావు. మట్టితో ఎన్ని కుండలు చేసినను మరి యెన్నియో కుండలకు మట్టి యుండదా? బంగారముతో ఎన్ని నగ లయినవో, మరి బంగారమునకు కరవా? కుండలయు, నగలయు ఆకారములు మన్ను బంగారములలో అనంతసంభావ్యతారూపముగా నున్న చందమున అనంతగుణములును, అనంతరూపములును, అనంతధర్మములును బ్రహ్మచైతన్యమునందు సంభావ్యతారూపముగా నున్నవి. నిర్గుణ సగుణ సాకార నిరాకారాది పదములు మానసచేతనలో పరస్పరవిరుద్ధములయినను ఇవి పరమ సత్యమును కొలిత మున అవలి యీవలి నైపులు. బ్రహ్మవస్తువునందు వీనికి ప్రకృతవిరోధ మేమియు లేదు. ఈ చందముగనే ఏకానేకములయొడ మానసచేతనలో దోచు విరోధమును బ్రహ్మమున నారోపింపదగదు.

'పలు తెగల నగలలో బంగారమే ఒకే ఒక సత్య మయినటులు ఈ నామరూపాత్మక ప్రపంచమున ఈ బ్రహ్మమే ఒకే ఒక సత్యము.' అని యనుట కర్థ మేమి? బంగారము సత్యవస్తువగుచో నగ మిథ్యావస్తు వెటు లగును? వికాసవిలయములు కలిగినంతమాత్ర మున ఆకారముగూడ మిథ్య యనుటకు కారణము లేదు. 'అగ్ని ర్విస్ఫులింగః, అగ్ని రేవేతి'. నిప్పులు అగ్నియే కనుకనే ఆ బ్రహ్మచైతన్యమునుండి యేది పుట్టినను అది ఆ బ్రహ్మచైతన్యమునొక్కయే ఆంశిక సత్యము. అది అసత్యము కాజాలదు.

అచ్చ అద్వైతవాదమున బ్రహ్మమునుతప్ప వేరొక తత్త్వమును స్వీకరించుటకు వీలు లేదు. ప్రపంచమునం దెయ్యది దెయ్యది వికాస మందినను అద్దాన నద్దాన చేతనసత్త లేకుండ నుండదు. అది వికారము వడయక విచిత్రమగు నీ ప్రపంచమునందు వివర్తప్రవాహమునబడి లెక్కలేని రూపములతో వికసించుచున్నది. కనుకనే జీవజగత్తులు రెండును దానియొక్కయే ఆంశికాభివ్యక్తి. అనంత మగు నతని ఐశ్వర్యమునందలి ఒకానొక అంశమున కది పరిచాయకము. అదియే అద్వైతవాదమునందలి మూలతత్త్వము. ఈ చూపుతో చూచినచో లీలా జీవవ్యక్తి రహస్యము తెలుక యగును. యుగయుగాంతములనుండి ప్రవహించుచు వచ్చుచున్న వివర్తమునకు ఫలముగా ఇపుడు మనోమయుడగు మానవు డుద్భవించెను. ఈ ప్రవాహ మింతటితో ఆగిపోదు. అది ఆ యీ అనవరమును గ్రహించుటకు అనగా సాంతములో అనంతపరిపూర్ణాభివ్యక్తిని పొందుటకగ్రసర మగుచున్నది. నేడవిద్యవలన కలిగిన చిన్న చూపులో నీ ప్రపంచము మన కెటు లగపడుచున్నదో మానసచేతనలో మన మెంత సత్యస్పర్శ పడయుచున్నామో అదియే సమగ్రసత్యము కాదనుట నిర్వివాదము. మనస్సుచే ఆ విరాట్సత్యమును కనుగొనుటకు వీలు లేదు. ప్రత్యగ్దృష్టిచే ఆత్మజ్ఞాన మొదవి బ్రహ్మైక్యము కలుగుచో సృష్టిరహస్యము తెలియును. అపుడు జీవజగత్తులకు లోపము కలుగదు. కేవలము అహంతాసంపన్న మగు—*ego - centric*—సత్తకు లోపము కలుగును. మనము అవిద్యనుండి అజ్ఞానము నుండి ఆత్మజ్ఞానము, విశ్వజ్ఞానముల కెగ బ్రాకవలసియున్నాము. ఇది కల్పనావిలాసము కాదు. అవశ్యంభావి యగు సృష్టిపరిణామము. (పరిశిష్టము)

# కొక్కొండ వెంకటరత్నం పంతులు



శ్రీ నిడదవోలు వెంకటరావు

వేంకటరత్నము పంతులవారాధునాతనాంధ్ర భాషా సారస్వతప్రపంచమున నొక విశిష్ట వ్యక్తి. ఆంగ్లేయభాష రాజభాషయై, జీవనాధారమై, తెనుగువారి నిత్యజీవితముపైని, వాఙ్మయముపైని, యఖండప్రభావము చూపుచున్న దినములలో దేశ భాషా ప్రాధాన్యతను, ప్రత్యేక వ్యక్తిత్వమును, చాటి, యాంధ్రభాషా గౌరవమర్యాదలను నిలువబెట్టిన దీ మహానుభావుడే.

తన జీవితకాలములో నాంగ్లేయభాష నుపయోగింపక, మొదట యాంగ్ల పదములకు పారిభాషిక పదములను నిర్మించి వ్యాప్తిలోనికి దెచ్చిన దీ భాషావేత్త. పాశ్చాత్యదేశమున తొలుత తెనుగు కవితకు ప్రథమస్థానము గడించి, ఖండాంతర యశస్సు నార్జించిన దీ విద్వత్కవి. వచన, నవలా, నాటక, పత్రికా శాఖలయందు ప్రాథమికుడై ప్రాచీన సంప్రదాయములను నవయుగ వికాసమునకు తోడ్పడు నట్లు చేసిన దీ విశిష్ట సారస్వతేయుడు. సంస్కృతేతర పండిత దుర్లభమగు మహామహోపాధ్యాయ బిరుదము జీవితకాలమంతయు తెనుగుపండితుడుగ నుండి గడించి, దేశభాషాపండితపదవికి ప్రతిష్ఠ దెచ్చిన కళాశాలా పండితుడు. బహుముఖములుగా నర్ధశతాబ్ది పర్యంత మాంధ్రభాషా సేవ నొనరించి సాహిత్య ప్రపంచమున తనంతటి పండితుడు లేడనిపించుకొన్న దీ సాహితీవేత్త. ఇట్టి మహాపండితుని జీవితచరిత్ర యిచట ప్రపంచితము.



"పంతులు" అనుపదము చిత్రమైనది. ఇది సంస్కృతమున భవంతః అను బహువచనమునకు వైకృతరూపము. మహారాష్ట్రభాషలో పంత్—అని నేడు వాడబడుచున్నది. కాని తెనుగున "పంతు" అను నేకవచన రూపములేదు—'పంతు' శబ్దము బహువచనమైనను గౌరవము ద్యోతకము కాకపోవుటచే దానికి వేఱొక బహువచన ప్రత్యయము'లు' చేర్చిరి. పంతులు అయిన 'పంతులు'కు గౌరవమురాలేదు. దానికి తిరిగి 'గారు' చేర్చిరి—అంతను గౌరవము పూర్తిగా వ్యక్తము కాలేదు. 'గారు' ను 'వారు' గా మార్చి, పంతులవారిని చేసిరి—కాని యప్పటికి గౌరవము స్థాయిని పొందలేదు 'పంతుళ్లవారు' అని

వ్యవహరించిరి. అప్పటికి పూర్తిఅయినది. అనగా నిందులో అయిదు బహువచనము లున్నవన్నమాట.

వేంకటరత్నము పంతులుగారి యింటిపేరు కొక్కొండవారు. కొక్కొండ యనునది—కోరు కొండ, కోర్కొండ యనువానిరూపాంతరము—లక్ష్మీనృసింహస్వామి వెలసిన యీ కోర్కొండ 1 క్షేత్రముతూర్పు గోదావరిజిల్లాయందు రాజమహేంద్రవరమునకు సమీపమున నున్నది. పంతులుగారి పూర్వికు లీ క్షేత్రమున మొదట నివసించుటచే నాయూరిపే రింటిపేరైనది. కొక్కొండవారు ఋగ్వేదులు. కౌశికగోత్రులు—ద్వైతమతానుయాయులగు మాధ్వులు—వీరి వంశక్రమ మిది:

వీరికి రావు, పంతులు, అనియే వ్యవహారము. నరసింహశర్మగారి లౌకికనామము నరసింగరావు పంతులు—మొదట ద్వైతులుగా నున్న వేంకటరత్నము పంతులుగారు తరువాత యద్వైతమతము స్వీకరించినపుడీ వ్యావహారిక నామములను విసర్జించి 'శర్మ' యను వైదికనామములను చేర్చి వ్యవహరించిరి. వేంకటరత్నము పంతులుగారు తమ పేరును 'వేంకట రత్నశర్మ' యని గ్రంథములయందు వ్రాసికొనినను, లౌకికవృత్తియందు 'పంతులుగారు' అనియే వ్యవహృతులు—ఈ మార్పునకు కారణము పంతులుగారి తల్లివంశమువారు. వారి తల్లి రామమ్మగారు కృష్ణాతీరమునందలి రేపల్లె నివాసులును




పైవంశమున నరశింహశర్మగారే వేంకటరత్నము పంతులుగారి తండ్రి—వీరు మాధ్వులగుటచే నాఱ్వేలనియోగులు నగు నందిరాజువారి యాడుబడుచు. లౌకికవృత్తియందే నిమగ్నులైయుండి వైదికతను గోల్పోయిన యాఱ్వేలనియోగిశాఖవారిని సవైదికులుగా నుద్ధరించుటకు "పద్ధతి నియోగము"ను స్థాపించిన జీర్ణాద్వైత మతోద్ధారకులగు నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారు, రామమ్మగారికి వరుసకు పెదతండ్రి—కావుననే వేంకటరత్నము పంతులుగారు వీరిని తమ మాతామహులుగా నిట్లు స్తుతించియున్నారు.

సానందుండిలనందిరాజ కులజుం
డద్వైత సిద్ధాంతి ల
క్ష్మీనారాయణ దీక్షితుండనగ రా
జిల్లె న్నియోగీశ్వరుం
డనగా నెవ్వడు యాజ్ఞవల్క్య డన
గా నై బ్రహ్మభూతుండు తత్
జ్ఞాన శ్రీనిధి నెంతు నెంతయు జగ
త్సంశ్లాఘ్యు మాతామహున్.

మఱియును "దీక్షిత చరిత్రము" అను పేర నీ మహనీయుని చరిత్రమునుగూడ పంతులవారు రచియించిరి.

1. తమ యింటిపేరునకు కారణమైన యీ క్షేత్రముయొక్క మాహాత్మ్యమును కుమారనృసింహము లేక 'కోర్కొండమాహాత్మ్యము'అను పేరనొక పద్యకావ్యమును పంతులుగారు రచియించినారు. ఈ 'కోర్కొండ'ను ప్రజలెన్ని రీతులుగా వ్యవహరించెడివారో పంతులవారే బిల్వేశ్వరీయములో ప్రథమబింబము ౭౯ పద్యమున నిట్లు చెప్పియున్నారు.

కొక్కొండ యనగను గ్రొత్తకొండ యటంచు
గొందఱు నవశైలమందురు మఱి
కొక్కొండ యన గొనకొమ్మ కొండయటంచు
గొందఱు శృంగాద్రి యందురు మఱి
కొక్కొండ యనగోటి కొండల కెనయంచు
గొందఱు కోట్యగ మందురు మఱి
కొక్కొండ యనగను కొండల కొండంచు
గొందఱు వరధర మందురు మఱి
కోరుకొండ ఫలించును కోర్కులెల్ల
నంచు నే కొండగోరుదు రల గిరిదరి
కోరుకొండ యనంగ గోర్కొండ యనగ
నలరు గౌతమి కొక్కొండ యను నొక పురి.

ఈ లక్ష్మీనారాయణ దీక్షితులే 'చిదానంద యతీంద్రులు'—గుంటూరున గల చిదానందాశ్రమము ఈ యతీంద్రుని పేర వెలసినదియే. తల్లిగారి వంశక్రమ మిది.




ఈ రామాంబా నరసింగరాయదంపతులకు క్రీ. శ. ౧౮౪౨ - మార్చి తే ౨౮ దికి సరియగు ప్లవ నామ సంవత్సర ఫాల్గున శుద్ధ తృతీయా (తదియా) భానువారమున వేంకటరత్నముపంతులుగారు వినుకొండయందు జన్మించిరి. పంతులుగారి జననకాలమున తండ్రి నరసింగరావుగారు, సర్వేశాఖయందుద్యోగులై వినుకొండలో నుండిరి. పంతులుగారి వెనుక నొక యాడుబిడ్డయు గలిగినది. పుట్టిననాట నుండియు పంతులుగారు తమ తల్లి తల్లియగు సుందరమ్మగారి సంరక్షణలోనే యుండిరి. కాని వీరికి మూడవయేడు వచ్చినతోడనే, క్రీ. శ. ౧౮౪౫ ప్రాంతమున తండ్రిగారు కాలధర్మము చెందిరి. తల్లి రామమ్మగారు, వయసున చిన్నదైనను, సాధ్వీజనధర్మము నెఱిగిన పెద్ద యిల్లాలు—ఈమె తన వైధవ్య దుఃఖమునంతయు నణచికొని, యీ నిసుగుల నిద్దఱను గుంటూరునం దున్న తన యక్కయైన రాజాంబ కప్పగించెను. రాజాంబభర్త భార్యావశ శ్రీనివాసరావు పంతులుగా రా కాలమున గుంటూరి మండలమున "2శిరస్థదారు" హోదాలో నుండెడివారు. గుంటూరికి వచ్చిన కొలది కాలములో రామమ్మగారికి భర్తపోయిన దుఃఖముతోపాటు, మఱియొక విషాదము నినుమడించెను. పుత్రీపుత్రులలో పుత్రిక మరణించెను. అయిన నామె ధైర్యమును వహించి తన పుత్రుని జాగ్రతగా పెంచుచుండెడిది. ఆకాలమున గుంటూరి మండలమునకు కలెక్టరుగా నున్న స్టోక్సు (*Mr H. Stokes*) దొరగారును, శ్రీనివాసరావు పంతులుగారును నీ బాలు నెంతయు గారాబముగా చూచెడివారు. పెదతల్లి రాజాంబపోషణ కన్నతల్లి రామాంబశిక్షణవలన పంతులుగారు దినదినాభివృద్ధి గాంచిరి. అయిదవయేట శ్రీనివాసరావుగా రక్షరాభ్యాసముచేసి, వడుగు గావించిరి. బాల్యము నుండి పంతులుగారు సూక్ష్మగ్రాహు లగుటచే, నక్షరాభ్యాసమైన రెండు మూడేండ్లలో, మంచి భాషాజ్ఞానము వాచకత యలవర్చికొని పురాణములను చదువుటకు ప్రారంభించిరి. పంతులుగారు సహజముగ పొట్టివారు. బాల్యదశయందు మఱియు బక్కపలచగనుండి, యింకను పొట్టివారుగ వామనమూర్తి వలె నుండెడివారు. కాని ముఖమున, తెలివి తేటలు—చుఱుకుదనము ప్రస్ఫుట మగుచుండెడివి. కంఠము శ్రావ్యముగ నుండెడిది. ఈ కారణములచే బాల్యదశ నుండి తమ వచోమాధుర్యముచే ప్రజల నందఱ నాకర్షింప గలిగియుండిరి. భాగవతమున, తమ రూపమున కనుగుణమగు వామనచరిత్ర వీరికి చాల యభిమాన పాత్రమైనది. దాని నెన్నోసారులు చదివి యింటివారి నానందింపజేసెడివారట. పది పండ్రెండేండ్ల యీడువచ్చునాటికి పంతులుగారు పద్యములల్ల గలిగిన శక్తిగలిగి ఏవేవో రచనలు గావించెడివారట. కాని శ్రీనివాసరావుగారి పుత్రులు వీరియందలి చూపోపమిచే వాని నన్నింటిని చించిపాఱవైచెడివారట. ఇంతలో వీరికి పండ్రెండవ యేడు పూర్తియగునాటికి శ్రీనివాసరావుగారు మరణించిరి.

ఇంటివద్ద నిట్లు తెనుగుభాష సంస్కృతములలో తనయుని దిద్ది తీర్చినను రామాయమ్మగారా కాలమున నాంగ్లేయవిద్య నేర్చినగాని లాభము లేదని గుర్తించి, పంతులుగారిని యెనిమిదవ యేటనే యింగ్లీషుబడియందు ప్రవేశపెట్టెను. ఆంగ్లవిద్యాభ్యాసము గావించుచున్నను, సంస్కృతాంధ్రభాషలను పంతులు మఱువలేదు. బాల్యమునుండి భక్తిపరత్వము మెండు-దానికితోడు కంఠమాధుర్యము. ఆపెకు సంగీతమునందపరిమితాసక్తి— పండ్రెండేండ్లయీడుననే—

2 ఈ పదమును శిర - తలపై-స్థ - ఉండునట్టి- దారుడు - భార్య కలవాడు. అనగా నీశ్వరుడని పండితులు చమత్కరించెడివారు.

"చదువు [3]గర్ణామృతము కృతి సరసులెన్న
గీతగోవిందమును దరంగిణి బురంద"

రాదికృతకృతులను బాడుచు నాడుచు మూఢ ప్రహ్లాదుడన సుజనులకు తోషింప జేయుచుండెను.

పదమూడవయేట పంతులుగారు [4] మంగళగిరి క్షేత్రమును దర్శించి, పానకాలరాయని భక్తితో సేవించిరి. ఆ యేడే క్రీ. శ. ౧౮౫౫ లో వారికి వివాహమైనది. అది మేనఱికము—మేనమామ అప్పయపాకయాజి తన కుమార్తె సుబ్బమ్మనిచ్చి పెండ్లి చేసెను. కాని వధువునకు లేబ్రాయమగుటచే, పంతులుగారి విద్యాభ్యాసమునకు భంగము కలుగలేదు. కాని నేర్చిన విద్యయంతయు, కేవలము లౌకికమై యేదేని గుమాస్తాపని కర్హతగలిగించినదే కాని యంతకంటె హెచ్చుగా నుపయోగకారి కాలేదు. ఇంతలో తల్లిని తన్ను పోషించుభారము గూడ, పదునాల్గు పదునైదేండ్ల యీడుగల పంతులుగారిమీద పడెను. గుంటూరియందే కలక్టరాఫీసున జేరి కొంత కాలముచట పనిని నిర్వహించెను.

కాని యీపనియు నొక యేడాదిపాటైన గుదురుపడలేదు. తత్ క్షణమే మఱియొకచో పని కలిసిరాలేదు. పొట్టివానికి పుట్టెడు బుద్ధులన్నట్లు ధనము లేకపోయినను నొక ముద్రాక్షరశాలను స్థాపింపవలెననియు తన గ్రంథములన్నియు నందు దచ్చువేయవలెననియు, ద్రవ్యము సంపాదింపవలెననియు పలుమారు భావనాసౌధములను నిర్మించుచు, నేమేమో యాలోచనలలో కాలము గడపుచు మిక్కిలి నిరుత్సాహుడై యుండెడివాడు. అప్పుడు తల్లియగు రామాంబగారు కొమారుని పిల్చి యిటుల హెచ్చరించిరట.

"నాయనా! ఏదేని యొక కార్యము సాధించు తలపే లేనిచో కార్యప్రారంభ మెట్లు? ఆపైని కార్య సాధనకు ప్రయత్నింపకున్న ఫలమెట్లొనగూడును? కనుక తలపే ఫలమునకు మూలము—మన గోత్రకర్త విశ్వామిత్రుడు మొదటి క్షత్రియుడైనను, తరువాత దీక్షవహించి, తపస్సుచేసి, బ్రహ్మర్షి కాలేదా! మొదట పనిచేయుటకు నిచ్ఛ కలుగవలెను. ఆయిచ్ఛవలన పురుషార్థములు పొందవచ్చును. "నే నొక యున్నతస్థితిని పొందవలె"నను నాసక్తి లేనివాడు పుడమిపై పుట్టినను గిట్టినవాడే. 'తలపు విత్తనము. తన పూనిక పొలము. పట్టుదలతో పనిచేయుట దున్నుట—పండుటకు వాన దైవికము; ఫలము భాగ్యానుసారము' అని బుద్ధిశాలి తలచును. చిరంజీవియు, బాల్యమున శివభక్తిపరత్వము జూపిన మార్కండేయుని దలంపుము. జగత్తులో మానవునికి సర్వము సాధ్యము. అసాధ్యమనునది లేదు. ఉత్సాహము గలిగి, నిర్వాహకుడవగుము. అప్పుడే నీవు సార్థక జన్ముడవు కాగలవు"

ఈ మాటల కెంతయు నుత్సాహపూరితులై పంతులుగారు క్రీ. శ. ౧౮౫౬ లో తల్లిగారితో గూడ తొలుత చెన్నపట్టణము వచ్చిరి. అప్పుడే పాశ్చాత్య నాగరకత తన ప్రభావము, హైందవ మత సంఘములపై చూపుట ప్రారంభించినది. చెన్నపురిలోని యాచారవ్యవహారములకు ఖిన్నుడై, విముఖుడయ్యెను, చేయునది లేక తల్లిగారి యుపదేశమువలన పంతులుగారెట్లో నాంగ్లేయభాష వచ్చినవారు గాన యుత్తరములు, దరఖాస్తులు మొదలైనవి వ్రాసియు, లెక్కలను వేసియు, లేఖనవృత్తిని కాలము గడపెడి వారు. కాని యీవృత్తి స్థిరమైనది గాక పోవుటచే, ప్రభుత్వశాఖలో చేర నిశ్చయించి తన తండ్రిగారుద్యోగము చేసిన సర్వేశాఖలో పనికొఱకు దరఖాస్తు నంపుకొనిరి.

ఈసమయమునందే యనగా క్రీ. శ. ౧౮౫౬ సంవత్సరమున (కాశీయుక్తి) పంతులవారి జీవితము నందలి ముఖ్యఘట్టము ప్రారంభమైనది. చెన్నపురిలో పనికి దరఖాస్తు పెట్టినను, కడపయం దేదో యుద్యోగము లభించునని తెలిసి యచటికి బోవదలచి, యొక నాటి వేకువజామున బయలుదేరి, కంచి ప్రవేశించి, యచట కామాక్షీదేవిని సేవించి, యారాత్రి యచ్చ

3 కర్ణామృతమనగా లీలాశుక యోగీంద్రుల కృష్ణకర్ణామృతము, గీతగోవిందము జయదేవకవిత్వము జగత్ప్రసిద్ధము. తరంగిణి శ్రీనారాయణతీర్థులవారి దివ్యకృతి. పురందరదాసకృతులు—కన్నడదేశమునకు త్యాగరాజువంటి భక్తుడు—పరశ్శతములుగా కీర్తనలు వ్రాసినవాడు. పై వానిలో గీతగోవిందము పంతులవారి కభిమానపాత్రము. దీని ననుసరించి, వారు సంస్కృతమున "గీత మహానటనము" అను గేయకృతిని నిర్మించినారు.

4 ఈ క్షేత్రమాహాత్మ్యమును "పానకము" అను పేర పద్యకావ్యముగా పంతులుగారు రచియించినారు.

టనే నిద్రించెను. ఆ రేయి నొక వృద్ధబ్రాహ్మణు డచ్చటికి వచ్చి "వత్సా! నీ వింక యభ్యుదయము చెందెదవు. అప్పుడు నన్ను మావారిని కొంచెము చూచుచుండుము. మఱువకుమా!" అని చెప్పి మఱునాడు చల్దియన్నము, పెరుగుతోగూడ బెట్టి ప్రయాణము సాగింపుమనెను. పంతులవా రా బ్రాహ్మణుని పేరడుగగా తనపేరు బిల్వనాథుడని తన యూరు తిరువళ్ల క్షేత్రమని చెప్పి, దారిచూపి తత్క్షణమే యదృశ్యుడయ్యెను. ఆ దారినిపట్టి పంతులవారు నే డుత్తరార్కాటుజిల్లాయందు గుడియాత్తము సమీపమునగల తిరువళ్లక్షేత్రమును దేశభాషానామము గల బిల్వారణ్యక్షేత్రమును దర్శించిరి. దర్శించుటతోడనే, యాప్రాంతములలో మున్ను తాను నివసించిన ప్రదేశమువలె, తనకు పరిచితమైన పరిసరములవలె పూర్వవిస్మృతి గలిగెను. అంత నచ్చట బిల్వనాథుడను, నొక వృద్ధబ్రాహ్మణు డెచట నున్నాడని ప్రశ్నింపగా, వల్లీశుడను మఱియొక బ్రాహ్మణు డగపడి. బిల్వనాథుడను బ్రాహ్మణుడు వేఱె లేడు. ఇచ్చట నెలకొన్న దైవమే యాతడు—నీకాతడే యారూపమున దర్శనమిచ్చినాడు. ఇదిగో కనుగొనుము, అని యాదేవాలయమున ప్రవేశపెట్టి, యచ్చట తను మధ్యా బిల్వనాథ మహాదేవులగూర్చి తపస్సుచేయుమని యాజ్ఞాపించెను. ఆకాలమం దచ్చట బ్రహ్మోత్సవము జరుగుట తటస్థించినది. పంతులుగారు, తదేకదీక్షతో తపోనిమగ్నులై శ్రీ తనుమధ్యా శ్రీ బిల్వనాథుల దివ్య సాక్షాత్కారము వడసిరి. [5]ఆ బిల్వేశ్వరప్రసాదమువలన యఖండ కవితాధారయలవడి, పంతులవారప్పుడే "బిల్వనాథశతకము"ను సంస్కృతమున రచియించిరి. వారి కవితారచనకిదియే ప్రథమము. అప్పటి వారి వయస్సు పదునాఱేండ్లు—అచ్చటనె యున్న యొక శైవముని పంతులుగారికి బాణభట్టారకుని 'కాదంబరి' నిచ్చి, చదువుమని చెప్పి వెడలిపోయెను. పంతులవారు సంస్కృతసాహిత్య వ్యాసంగము కాదంబరితో ప్రారంభించి, అచ్చటనే కొన్ని సంస్కృత కావ్య నాటకములు బిల్వనాథుని కరుణచే స్వయముగ పఠించి పండితులైరి. నాటినుండియు, శ్రీ బిల్వనాథస్వామికి వారఖండభక్తులై తను మధ్యాదేవిని తల్లిగా, బిల్వనాథుని తండ్రిగా భావించి యాత్మశుద్ధిని, యాధ్యాత్మికవిజ్ఞానసమృద్ధిని, యమేయ కవితాసిద్ధిని గాంచి ధన్యులైరి.

తిరువళ్ల క్షేత్రమున నుండగనే 'మనందవాడి' రివిన్యూ సర్వే పార్టీయందు పంతులుగారు గణకుడు (*Computor*) గా నియమితులైన ట్లాజ్ఞాపత్రము వచ్చెను. అందు పంతులుగారు తొలుత సేలమునం దుద్యోగములో ప్రవేశించవలసినదిగా వ్రాయబడి యుండెను. వారంతట సేలమునకు వెళ్లి తమ యుద్యోగములో ప్రవేశించి, కొలదికాల మచ్చట నుండి యావెనుక సర్వేపార్టీప్రధానస్థానమగు కోయంబుత్తూరున పనిచేయుచుండిరి. కాని యచ్చట యధికారుల నిరంకుశత్వము, తన యాత్మస్వాతంత్ర్యమునకు వ్యక్తిస్వాతంత్ర్యమునకు నడ్డంకిగా నున్నదని తెలిసికొని, యా శాఖయం దుద్యోగమును నచ్చట నొక పాఠశాలలో తెనుగు, తమిళ పండితపదవికి మార్చుకొనిరి. ఇచ్చట వారి విద్యావ్యాసంగమునకు చాల యవకాశము లభించినది. అచ్చట కొంతకాలమైన వెనుక, కోయంబుత్తూరుదగ్గఱగ నున్న పాలఘాటున ప్రత్యేక

---

5 ఈనాటివారి కిట్టి కథలు విడ్డూరముగ నే దోచవచ్చును. క్రిందటి శతాబ్దిలోని కొంతమంది మహాకవుల చరిత్రలు చూచినవారి కిది వింతగ గన్పించదు. గోపినాథ వెంకటకవి, మతుకుమల్లి నృసింహ విద్వత్కవి—మండ పాక పార్వతీశ్వరశాస్త్రి మున్నగు వారి చరిత్రలలో నిట్టి ఘట్టములు గలవు. క్రీ. శ. ౧౮౭౨ నాటికే, యిట్టి కథలను గూర్చి యాంగ్ల విద్యాధికులలో నమ్మకము లేకుండె ననుటకు, నీ క్రిందివాక్యములు సాక్ష్యముగా నుదాహరించుచున్నాను.

*"whatever way be the opinions of English educated men in this purely materialistc age, siill it is admitted by one and all, that there is something divine, something superhumam in the art of poetry"*

(కేవల పదార్థవైజ్ఞానిక యుగమగు నవీన యుగమున ఆంగ్లేయభాషాభిజ్ఞులైనవారి యభిప్రాయ మెట్లున్నను, కవితాకళయందు నొక దివ్యత్వము నొక అధ్యాత్మికత యున్నదనిమాత్రము సర్వజను లంగీకరింపక తప్పదు.)

*R. Sivasankara Pandya - from the english Biography of Venkataratnam Pantulu.*

ముగ తెనుగు పిల్లల కొఱకు పాఠశాల స్థాపించి, అచ్చట తెనుగే కాక, తమిళకన్నడములను నేర్పుచుండెడి వారు. పాలఘాటునందున్నప్పుడే మంగళూరుపాఠశాలలో కొన్ని నెలలు కన్నడభాషాపండితులుగ పని చేసిరి.

పాలఘాటులో పంతులుగారికి ప్రశాంతజీవన మేర్పడినది. అచ్చట కొండల నైసర్గికరామణీయకత, వాతావరణము వారి నెక్కువగ నాకర్షించినది. ఇచ్చట వారి విద్యావ్యాసంగమునకు ననుకూలపరిస్థితు లేర్పడినవి. క్రీ. శ. ౧౮౭౦-౭౧ లో వారీ గ్రంథములను రచియించిరి.

౧. తనుమధ్యాశతకము—

శ్రీ బిల్వనాథ క్షేత్రమున దేవియగుతనుమధ్యను గూర్చిన సంస్కృతశతకము. ఆర్యావృత్తములు. సరళమును భక్తిభరితములైనది.

౨. గీతమహానటనము—

గీతగోవిందము ననుసరించి శైవపరముగా సంస్కృతమున రచించినది. ఇందు పంతులుగారి సంగీత సంస్కృతభాషా పాటవము సువ్యక్తమగుచున్నది. అద్యతన సంస్కృతవాఙ్మయచరిత్రలోనికెక్కిన ప్రసిద్ధకృతి.

౩. మధ్వవిజయము—

ఇది తెలుగు పద్యకావ్యము. ద్వైతమత ప్రతిష్ఠాపకులగు శ్రీ మధ్వాచార్యులవారి చరిత్రము. ఈ గ్రంథము ముద్రితము కాలేదు. నేటికిని మధ్వాచార్య చరిత్రము పద్యరూపముగా నున్నది ప్రసిద్ధిగా లేదు. అప్పటి కింకను పంతులుగారు మధ్వ సాంప్రదాయమును విడువలేదు. ఇందులో మధ్వాచార్యులవారి దిగ్విజయయాత్రలు, మిక్కిలి విశదముగా వర్ణితములై యున్నవి.

౪. గీతనారాయణము—

ఇది సంస్కృత జయదేవకవి గీతగోవిందము ననుసరించి, తెనుగున యష్టపదులుగా రచితమైనది. ఇందు పంతులుగారికి గల సంగీతపరిజ్ఞానము, సంకీర్తనరచనా నైపుణ్యము వ్యక్తమగుచున్నది. ఇదియు ముద్రితమే. ఈ గ్రంథరచనమైన వెనుక పాలీఘాటు వదలి తిరిగి కోయంబుత్తూరునకు పార్టీవారాహ్వానింపగా వచ్చి యుద్యోగమున జేరెను.

ఇట్లు గ్రంథరచన కావించుచున్నను, వారు సంస్కృతభాషావ్యాసంగము మానలేదు. ఇచ్చటనీకాలముననే పంతులుగారు సంస్కృత వ్యాకరణమును, కొచ్చిన్ సంస్థానమున న్యాయాధిపతియై, పండితమండలిచేతను, కొచ్చిన్ మహారాజుచేతను సమ్మానితుడై యుపకృతిని పొందుచున్న శ్రీ వైయ్యాకరణము వేంకటనరసింహాచార్యులవారియొద్ద, సంపూర్ణముగ నభ్యసించిరి. శాస్త్రమెప్పుడును గురుముఖమున నభ్యసించినగాని సంప్రదాయాభిజ్ఞత కలుగదని పంతులవారి యాశయము. మఱియు సంగీతమును గూడ, కోయంబుత్తూరి నారాయణయ్యయను ప్రసిద్ధ సంగీతశాస్త్రజ్ఞునియొద్ద శాస్త్రీయముగ నభ్యసించిరి. ౧౮౭౩ వఱకు కోయంబుత్తూరిలో నుండి, యచ్చటనే "పౌండరీకభాణము" అను నొక నాటకభేదమును సంస్కృతమున రచియించిరి. అది యముద్రితము.

పంతులుగారు తెనుగులో నిత్యవ్యవహారమునను కూడ గ్రాంధికభాషనే మాట్లాడువారని సర్వజనవిదితము. అట్లు మాట్లాడుటకు వ్యవస్థ యేర్పడినదీ యే దేండ్లకాలమునందే. వారు నివసించిన ప్రదేశము, శుద్ధద్రవిడదేశము. కన్నడప్రాంతములకు చేరువ. అచ్చట తెనుగువారు నున్న, వారు అరవముగాని కన్నడముగాని నిత్యవ్యవహారమున నుపయోగించెడివారు. పంతులవారు, అరవ కన్నడములలో సమానమైన పాండిత్యముగలవారు. కాబట్టి తెనుగు చెప్పవలసి వచ్చినప్పుడు, విషయము ప్రపంచింపవలసివచ్చినపుడు, తెనుగునాటి మాండలిక వ్యావహారికభాష యెట్లుపయుక్తము కాగలదు? అచ్చట నున్నవారికి పంతులుగారికిని పరిచితమైన తెనుగు గ్రాంధికభాషయే. అది క్రముముగా వారి కభ్యాసమై ఆ స్థలములు విడిచి చెన్నపురి చేరినను వారు గ్రాంధిక భాషతోనే నిత్యజీవితమునంతయు నడుపవలసివచ్చినది. జీవితాంతమువఱకు నట్లే సాగించిరి. క్రీ. శ. ౧౮౭౦ ప్రాంతమునుండి, అనగా పంతులుగారు తమ పదునెనిమిదియేండ్ల యీడునుండియు తెనుగు గ్రాంధికభాషనే యుపయోగించుచుండెడివారని చెప్పనొప్పును.

౧౮౭౩ లో, కోయంబుత్తూరిలో సర్వేపని పూర్తియగుటచేత పంతులవారు ద్యోగము చాలించుకొనవలసివచ్చెను. అచ్చటనుండి వారు క్రీ. శ. ౧౮౭౪ సంవత్సర ప్రారంభమున చెన్నపట్టణమునకు తిరిగి బయలుదేరిరి. వారెచ్చట నున్నను చిత్తమెప్పుడును శ్రీ బిల్వనాథునియందే నిమగ్నమై యుండెడిది—

"చిత్తూరినుండి, కోయం
బుత్తూరున మోలకొట మొగిచెన్నపురికా
చిత్తం బెత్తటిని దదా
యత్తంబగు నాకు శ్రీ వనాధిపభక్తికా"
అని బిల్వేశ్వరీయము.

(సశేషము)

---

# పల్లెపడుచు

●

శ్రీ వి. సుబ్బన్న

వలపుం బంగరుఁ బూఁతమై పసుపు శో
భల్ కన్నె గేదంగి వ
న్నెల మైదీవకు సొంపు దీర్చినవి; చాం
ద్రీకోమలం బైన న
వ్వులలోఁ దేటలు పాటలై కలిసి పో
వుకా వేణుగానమ్ములోఁ—
జెలియా! యెచ్చటి కేఁగుద్దాన విదిగోఁ
జెప్పంగదే, బాలికా !!

*       *       *

పడఁతీ ! లేనడు మల్లలాడ, లలితా
ధ్వం బందురా, నీదు క్రొ
మ్ముడిలో గుప్పని చెండుమల్లియలు చె
ప్పన్, ముగ్ధశృంగార మె
ప్పుడునుకా దాగదు లెమ్ము: పల్లియ పద
మ్ముల్ పాడునందాక, పో
విడువకా మామకు నేను జెప్పెదను లే
వృత్తమ్ము, శాతోదరీ !

*       *       *

ఈ న్యగ్రోధ శిఫాగ్రముల్ ముడిచి, యు
య్యేలూగుచుకా, కోకిలా
కన్యాప్రేమ రసార్ద్రకోమల సుధా
గానమ్ము నాలించు చ
న్యోన్యం బుంటిమి యాటపాటల, సదే
అంబళ్ల ప్రొద్దాయె! సౌ
జన్యశ్రీనిధి!! బువ్వదుత్త గొని, స
స్యక్షేత్రముం జేరుమా.

---

# ప్రాక్తనగీతి



శ్రీ సాళ్వ కృష్ణమూర్తిశాస్త్రి

గీత మొకండు సాగె పులకింపుల సొంపుల తీరు తీయముల్
చేతము నిండ, ప్రాక్తన విశిష్టమనోహర సుస్వరస్వర
వ్రాతము ప్రాణమై విమల భావరసాత్మక దివ్యదీధితి
ద్యోతక హేతువై, పికవధూమధు మంజుళగీతికాచ్ఛమై,

మృదువై, స్వాదువునై, మనోజ్ఞతర గంభీరప్రభావచ్ఛటా
స్పదమై, ప్రాక్తనపుణ్యగీత మదియే స్వర్లోక మందాకినీ
హృదయాహ్లాద విశుద్ధ గానముల యక్లైచ్ఛోటనో దాకి నా
ఎదలో నవ్యమహానుభూతి యొకటై ఏదో ప్రదీపించెడున్.

ఏ వేదస్వచ్ఛ యుగమ్ములన్ గడిచియో ఈ మంజు గీతీసుధా
ప్రావీణ్యమ్ము లనంతపుణ్యఫలద ప్రాచుర్య రేఖాప్రభా
హేవాకమ్ముగ వచ్చి నేడిటుల నా హృత్సీమ కానందద
ప్రావృట్శీతల వర్షబిందు నవ సంపాతమ్ములై పొల్చెడున్.

ఆ గీతమ్మది యేమొ మద్హృదయసీమాంతమ్మునందాదిమ
శ్రీ గీతమ్ముగ విన్నయంత ప్రనటత్ శ్రీరుద్ర నేత్రాగ్నులై
రాగోద్వేగము లెన్నియేని నవ విక్రాంతిచ్ఛటా భోగముల్
రాగా, ప్రోజ్వలమై సురాసురుల సంగ్రామంబె తా వచ్చినన్.

ఈ హృదయాంతర ప్రమద హీనవిషాదకఠోరభావమా
ఆహవభూమి నేవొ దహనార్చుల రేపి సురాసురోగ్ర సం
దోహము లిట్లు కాల్చికొన దూసెను దైత్యసమూహ మెల్ల 'దా
సోహము' చెప్పికొంచు భయమై ఒక యోటమి సంఘటిల్లినన్.

శంఖహ్రాదముస్థ మధురనిస్వానమట్టు
లేకమై పరిభ్రమణలీల, కమనీయ
శాశ్వతోంకార నాదమ్ము సరణి ప్రాక్త
నస్వరమ్మది నాయెద నాట్యమాడె!

---

# నరాంకితము

(శ్రీ నోరి నరసింహశాస్త్రి)

"ఇమ్మనుజేశ్వరాధముల
కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని
చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులం బడక
సమ్మతితో హరి కిచ్చఁ జెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు
భాగవతంబు జగద్ధితంబుగన్.

ఏనాడు పోతరా జీ పద్యము చెప్పినాడో గాని, పోతరాజు భాగవతము తెలుగునాట పేరు కెక్కిననాటినుండి, గ్రంథములు నరాంకితము చేయుట కూడనిపని యను భావము మనదేశములో స్థిరపడి పోయినది. కూడనిపని కాదనకున్నను, అధమపక్ష మది కక్కుర్తిపని యని యైనను అనునను దృఢభావము పాదుకొనిపోయినది. అది పెల్లగించినను తెలుగువారి మనస్సులలోనుండి తొలగిపోదు. పలువురు అనామకులగు కవులుకూడ—వారి కావ్యములలో ఇతరసుగుణము లేవియు లేకున్నను—తాము నరాంకితము చేయుట కిష్టము లేక తమ కావ్యములు భగవదంకితము చేసినట్లు చెప్పుకొని మహత్కార్యము చేసినట్లుగా భావించిరి, భావించుకొనుచున్నారు.—మన మెంత కాదన్నను-ముందును అట్టే చేయగలరు!

కాని యీ పద్యము జెప్పుటలో పోతన ఉద్దేశ మేమి? కావ్యములు నరాంకితము చేయుట పనికిరానిదని, యమబాధలకు కారణమని యాతని భావమా? కాక నరులను ఉద్దేశించి కావ్యరచనము సాగించుటే కూడనిపని యని కూడ నాతని హృదయమా? నన్నయ, తిక్కన, ఎఱ్ఱయ—చేసిన పని దూష్యమని గాని—దూష్యము కాకున్నను, అంత సమంజసమైన కార్యము కాదని కాని—అతని తలంపా? మరి నిజముగా కవి హృదయ మేమి?

నరుల నుద్దేశించి గ్రంథ రచన చేయగూడదని యాతని యభిప్రాయ మన్నచో, నది యేమాత్రము పొసగదు. పోతన శ్రీరాము నుద్దేశించి శ్రీమద్భాగవత మేల చెప్పవలె? అట్లే హరిహరనాథు నే ఉద్దేశించి శ్రీమదాంధ్ర మహాభారతము తిక్కన సోమయాజి మాత్ర మేల రచింపవలె? శ్రీరామునికిగాని, హరిహర నాథునికి గాని భాగవత స్వరూపము భారతస్వరూపము తెలియదని యా కవీశ్వరుల యుద్దేశ మనరాదు కదా! అంతే కాదు. పై పద్యముననే పోతన తాను భాగవతము 'జగద్ధితంబుగన్' చెప్పుచున్నట్లు పలికినాడు. మరియు కొన్ని పద్యముల తర్వాత నత డేమన్నాడు?

"కొందఱకుఁ దెనుఁగు గుణ మగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణ మగు రెండుం
గొందఱకు గుణము లగు నే
నందఱ మెప్పింతు, గృతుల నయ్యైయెడలన్"

ఈపద్యము శ్రీరాముని నుద్దేశించి చెప్పినది కానే కాదు గదా! తెనుగుదేశములో నున్న జనులను బహువిధ రుచులు గలవారిని ఉద్దేశించియే రచన సాగించినాడు. అతడు మహాభక్తుడే కాని, ఈ కాలములో పలువురు తలంచునట్లు, భక్తితన్మయుడై ఒడలు మరచి గ్రంథరచనము చేయలేదు. జనుల మెప్పింపవలె నను కోరిక యాతనికి నిస్సందేహముగా నున్నది. అట్లనుటలో పోతన యవ్యాజభక్తి కేమాత్రము భంగము చేయుట కాదు.

మరి పూజ్యుడగు తిక్కన సోమయాజియో? హరిహరనాథున కర్పితము చేసిన తన మహాభారత

మునే "బుధ సంతోషంబు నిండారగా రచియించు టొప్పు" అని తలంచెను. దాని కొఱకు ఆంధ్రావళి మోదముంబొరయ నుపక్రమించెను. అందుచే నాతఁడు ఆంధ్రావళి నుద్దేశించియే యది రచించెను. కాని కృతి నాథునిగా హరిహరనాథుని జేయుట యేమి? అతడే చెప్పికొనెను:

"ఈదృశంబు లగు పుణ్యప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రకాశింపఁజేయుటయు నొక్క యారాధన విశేషంబు."

నరుల నుద్దేశించి వ్రాసిన గ్రంథము పరమేశ్వ రాంకితము చేయు పద్ధతి యిది యొకటి!

ఏదియైనను నరుల నుద్దేశించి చెప్పు కావ్యములే కనుక అట్టివి నరోత్తములకు అంకితము జేయుట మాత్రము ఉత్తమపద్ధతి కాకపోదా? ఐనచో పోతన, తిక్కన, సోమయాజివంటి పూజ్యులు తమ యుత్తమ గ్రంథములను భగవంతుని పేర యంకితము చేసిరి? వారును నరాంకితము చేయకుండలేదు. కాని ధర్మ గ్రంథములు భగవదంకితమే చేయవలయు ననుట యుక్తమగునా? అట్లైచో వారితో సమానులగ నైన పూజ్యులును, పుణ్యమూర్తులు నగు నన్నయ, ఎఱ్ఱయలు తమ యుద్గ్రంథములు నరోత్తముల పేర యంకితమొన ర్చిరి. ఆకారణమున వారిని పైవారితో పోల్చినచో కుడి యెడమ తారతమ్య మున్నదనవలెనా?

ఈ విచారణకు మహర్షులయు, ఋషికల్పులయు నాచరణ మనుసరించి కడగుదము. సందర్భవశమున నితరుల గ్రంథప్రసక్తి వచ్చినను, అది ప్రమాణభావములోకాక, ఉపోద్బలకముగా మాత్రమే యని గ్రహింపవలెను.

ఎవరికి అంకితము చేయుదురో వారిని అశ్వాసాదిని అంతమునను సంబోధించుట ఆచార మని ముందు మనము మనస్సులో నుంచుకొనవలెను. ఇతర విభక్తులు ప్రయోగించిన కేతనాదికవు లున్నారు. కాని నన్నయ, ఎఱ్ఱయ, మహాభారతమున తిక్కన, పోతనసంబుద్ధియే అవలంబించిరి. కాన ఆయా చారమే ఇక్కడ గ్రహింపబడినది.

## ౨

ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమును వాల్మీకి మహర్షి ఎవని నుద్దేశించి వ్రాసెను? ఎవరికైన నది యంకితము చేసెనా? చేసియున్నచో నెవరికి? ఏమైనను దానికి ప్రథానశ్రోత ఎవరు?

ఈసందర్భమున వివాదము లన్నియు వదలి, ఇప్పుడు ఉపలభ్యమగుచున్న శ్రీమద్రామాయణ గ్రంథమును గ్రహించి, పెద్దలు బహుకాలముగా నిర్ణయించిన సిద్ధాంతవాక్య సారము నిచ్చెదను.

సీతాదేవి వనవాసము చేయుచు తనయాశ్రమమున నుండగా వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణ రచనమున కుపక్రమించెను. అప్పుడే నారదు డాతనికి రామాయణకథ నుపదేశించెను. ఆ యుపదేశించు బాలకాండము మొదటిసర్గలో ౯౦వ శ్లోకము వరకు 'రాజ్యం పునరవాప్తవాన్' భూతకాలక్రియలు కలవు ౯౧వ శ్లోకమునుండి 'ద్రక్ష్యన్తి' 'భవిష్యంతి' 'స్థాపయిష్యతి', 'బ్రహ్మలోకం గమిష్యతి' ఇత్యాదిగా భావికాలమునజరుగునట్లు వర్ణించి యున్నది. మరియు శత్రుఘ్నుడు లవణుని జంపబోవుచు దారిలో వాల్మీకి యాశ్రమమున విడిసినప్పుడు రామాయణ కావ్యము కొంత యాలకించెను.

ఆ రామాయణమును వాల్మీకి తన యాశ్రమమున పెరుగుచున్న కుశలవుల కుపదేశించెను. దాని పాఠక్రమాదులన్నియు నియమించెను. ఉత్తమాధికారులును ఋషివేషధారులు నగు నా కుశలవులు మునిపల్లెలలో రథ్యలలో రాజమార్గములలో పాడిపాడి, తుదకు శ్రీరామచంద్రప్రభుని యాస్థానములో నాతని యాజ్ఞచే పరిషత్సమక్షమున గానముచేసిరి. బాలకాండము నాల్గవసర్గలో నిది యున్నది. వారు పాడినదే రామాయణమంతయును! ఆ పరిషత్తుకూడ యాగదీక్షితు డైన శ్రీరామ నరేశ్వరుని సేవించి యున్న మహాపరిషత్తు. రామాయణశ్రవణముతో సీతా విశుద్ధి జగద్విదిత మైనది. సీతావిశుద్ధి ప్రఖ్యాపనము చేయుటే ఆ కావ్యనిర్మాణమునకు మూలకారణము.

దీనినిబట్టి చూడ వాల్మీకిమహర్షి యా పుణ్య గ్రంథమును శ్రీరామసార్వభౌముని యజ్ఞవాటికలో గూడిన యశేషమంత్రి సామంత దండనాథ దౌవా

రిక ప్రజాసమూహమును ఉద్దేశించి వ్రాసినదే. కాని ప్రధానముగా నది శ్రీరామప్రభువునకే యంకితమైనది. అట్లగుచో నది నరాంకితమే! శ్రీరామచంద్రుడు నారాయణాంశ సంభూతుడు కావచ్చుగాక! విష్ణువు కాని పృథ్వీపతియే లేడు. అందుచే నీ సందర్భమున శ్రీరామచంద్రుడును మనుజేశ్వరుడే!

## 3

ఆదికావ్యము ఎంత మనోజ్ఞమైనను, ఎంత పూజ్యమైనను, దాని రచనకు వాల్మీకిని ప్రధానముగా ప్రేరేపించినది సీతా విశుద్ధిప్రఖ్యాపనము చేయుట యను ప్రత్యేకప్రయోజనమే. ఏ ప్రయోజనము నుద్దేశించి యది రచింపబడినను, మహర్షి నోట వచ్చుటచే నది యనంతప్రయోజనము ఘటించు లోకోత్తర గ్రంథమైనది.

మహాభారత గ్రంథ రచనమునకు, వ్యాసభగవాను డుపక్రమించుటకు అంతకంటె విశేషప్రయోజనము సాధించు నుద్దేశ మున్నది. ఇది సర్వలోక సంగ్రహబుద్ధితో శ్రీకృష్ణద్వైపాయనముని రచించినాడు. అది విశ్వజనీనము, వేదసారము, ధర్మశాస్త్రము, వేదాంతము, మహాకావ్యము! అది ఏది కాదు? సాక్షాత్తుగా నది కామధేనువే!

ఇదియు నితర పురాణములవలెనే సూతుడు శౌనకాది మునులకు చెప్పినట్లే యుండును. ఐనను దీని ప్రధానశ్రోత జనమేజయుడు. వక్త వేదవ్యాసుని యాదేశము నిర్వర్తించు వైశంపాయనమహర్షి. వ్యాస శిష్యుడే యైనను గురుతుల్యుడగు మహానుభావు డతడు! ఈ భారతము విశ్వశ్రేయస్సు నుద్దేశించి వ్రాయబడినను, దీనిని లోకములో ప్రవర్తింపజేసినది సర్పసత్రము చేయుచున్న జనమేజయుని సంబోధించుచునే గదా! అందుచే వ్యాసభారతము జనమేజయ మహారాజునకంకితము చేయబడిన దనుటలో నెట్టి యసంబద్ధోక్తియు లేదు.

జనమేజయున కుపదేశించుటకు పూర్వము దీనిని వైశంపాయనునకును, శుకునకును వ్యాసుడు చెప్పియుండవచ్చును. వారి కిది చెప్పుట దానిని లోకమున ప్రవర్తింపజేయుటకే కాని వారి ప్రయోజనమునకై కాదు. వారిరువురు కృతకృత్యులు. మరి యిక జనమేజయుడో?

పెద్దల గణనప్రకారము శ్రీకృష్ణనిర్యాణముతో కలి ప్రవేశించినది. ఆ పిమ్మట కొద్ది దినములకు ధర్మజుడు రాజ్యపరిత్యాగము చేయుచు పరీక్షిత్తుకు పట్టము గట్టినాడు. కావున కలియుగమున భారతసామ్రాజ్యమునకు మొదటిప్రభువు పరీక్షిత్తు. అతడు మొత్తము మీద ధర్మబుద్ధితోడనే రాజ్యపరిపాలనము చేసెను. అతని కింకను ధర్మరాజు, శ్రీకృష్ణుడు, అర్జునుడు నిత్యస్మృతిలో నున్నారు. ఐనను కలికాలప్రభావముచే తుదకు అన్యాయముగా మునీశ్వరు నవమానించి విప్ర శాపము నొంది హార్మ్యతలమున నంతరిక్షములో సర్పదష్టుడై దుర్మరణము పొందినాడు. కలికాల ప్రభావము పోలేదు.

ఆ పిమ్మట నాతని కుమారుడు జనమేజయుడు పసితనములోనే రాజైనాడు. ఇతడు కలియుగమున రెండవ భారతసార్వభౌముడు. ముందు ముందు రాజులకు ధర్మనిష్ఠ క్రమక్రమముగా నంతకంతకు క్షీణింపగల దని వేదవ్యాసునకు తెలియును. ధర్మములు ఎన్ని గ్రంథములలో చెప్పియున్నను ఏమి ప్రయోజనము! ధర్మము ప్రవర్తింపజేయునది ప్రభువు. నరేంద్రుడు, మనుజేశ్వరుడు. ధర్మగ్రంథములు ధర్మశాసకులగు ప్రభువుల కుపదేశించినపుడే యవి సార్థకత నొందును. మహాభారతమును జనమేజయునకు, అతనిద్వారా, కొంతవరకైన ధర్మనిష్ఠయుండగల అనంతరప్రభువులకు ఉపదేశింపబడినది; అంకితము చేయబడినది.

ఈ జనమేజయు డెట్టివాడు? అతనికి పసితనము వదలినంతనే, అతడు చేయ నుపక్రమించిన ఘనకార్యము సర్పసత్రము. అది కేవలము ద్వేషముతో నారంభింపబడిన తామసయాగము. ఉద్దిష్టమైన తక్షకనాశము సిద్ధింపకుండగనే ఆ యాగము విరమింపబడినది. ఆ విరమణము సభ్యులగు వ్యాసాదులే అనుమతించిరి. ఆ సర్పసత్రము జరుగుచున్న సమయముననే వైశంపాయనుడు జనమేజయునకు వ్యాసాదుల సమక్షమున మహాభారతము నుపదేశించెను. జనమేజయుడు మధ్య మధ్య ప్రశ్నించుచుండును. వైశంపాయనుడు ధర్మసమ్మతముగా నుత్తరమిచ్చును.

అట్టి మహాభారతము భగవదంకితము చేసియున్నచో వ్యాసుని ప్రయత్నము వృథయై యుండును. వేదవ్యాసునికి తా నుపదేశింపదలచిన ధర్మము కలికా

లమున ప్రజలకు ఇష్టముగా నుండదను నెరుక యున్నది. మహాభారతకథాంతమున వేదవ్యాసుడు రెండు బాహువు లెత్తి ఉద్ఘోషించినాడు, కాదు, ఆమహానుభావుడు ఎలుగెత్తి యేడ్చినాడు. ఏమని?

"ధర్మమువలననే అర్థమును కామమును పొందవలెనుమా! నేను రెండు బాహువు లెత్తి ఎలుగెత్తి యేడ్చుచున్నాను కాని నామాట లెవరును ఆలించువారు లేరు!"

మహాభారతము వేదవ్యాసుని ధర్మఘోష! ఆఘోష పూర్తిగా నాలించువారు ఆకాలముననే లేరని తెలిసి చేసిన ఉద్ఘోష! కొంతవరకైనను వినునటువంటి జనమేజయుని యాస్థానములో దానిని ప్రకటించినాడు.

మరలమరల కవులు, పండితులు ఆ భారతధర్మజయఘోషను ధర్మప్రభువుల మన్నవారి యాస్థానములలో నెల్ల ఉద్ఘోషించి భారతధర్మము నశించిపోకుండ నిలువబెట్టినారు!

## ౪

మరల జనమేజయునితో తుల్యు డనదగిన ధర్మప్రభువు భారతదేశములో వేంగీమండలములో నుదయించినాడు. అతడు రాజరాజు-అతనివలెనే ధర్మనిష్ఠులగు చోళచక్రవర్తుల కాతడు దౌహిత్రుడు, అల్లుడు, వియ్యంకుడు. అతనికుమారుడు చోళచక్రవర్తియై దక్షిణాపథమున విశేషభాగమున కధిపతి కానున్నాడు. అతడును జనమేజయుని వంశములోనివాడే. ఆతనికి ఐదుసద్గుణములు వదలకుండ గలవు. భూదేవతాపూజయన్న ప్రీతి, భారతశ్రవణాసక్తి, పార్వతీపతిపూజ, దానశీలత, సాధుసాంగత్యము. అట్లు భారతవంశ్యుడును మనుమార్గుడును అగు రాజరాజును ప్రధానశ్రోతగా పెట్టుకొని నన్నయభట్టారకుడు ఆంధ్రమహాభారత రచన కుపక్రమించినాడు. ప్రతి ఆశ్వాసాదిని ఆశ్వాసాంతమునను అతడు రాజరాజునే సంబోధించును.

ఆ సంబోధనలలో విశేష మున్నది. ప్రాకృతుల కవి స్తుతిపాఠముల వలె భావింపవచ్చును. కాని యీ సంబోధనలు గమనింప దగినవి.

"నిత్యధర్మప్రారంభ — మనుమార్గ — ధర్మనిరత — ఆదిక్షత్రచరిత్ర — నిత్యనిరంతరధర్మమతీ — బుధనుతసుగుణాకర — కలియుగపవిత్ర — ధర్మధురంధరా — మహాదాన తర్పితద్విజవర — వ్యసనవివర్జిత — పుణ్యవరేణ్యా — నిఖిలజగత్పావన శుభచరిత —"

నిత్యసత్యవచనుడైన నన్నయభట్టారకుని వాక్యములు సత్యము లనియే గ్రహింపదగినవి. ఎన్నడైనను రాజరాజు మానవసహజదోషముచే ధర్మచ్యుతిం చెందియున్నను, ఇట్టి సంబోధన లాతని ధర్మనిరతి నాతనికి స్ఫురింపజేసి, మరల ధర్మనిష్ఠుని గావింప గలవు.

ఇట్లు రాజరాజును సంబోధించుచు రచించిన నన్నయకృతి మహర్షియగు వేదవ్యాసునే అనుకరించెను. నన్నయను బుషి యనుటకు వనుకాడు పెద్దలుందురు గాని యట్టివారును ఆతని బుషితుల్యు డనుటకు సంశయింపరు. వేదవ్యాసునికి జనమేజయుడువలెనే, నన్నయభట్టారకునకు రాజరాజు ప్రధానశ్రోత! సామాన్య భాషలో చెప్పినచో నది రాజరాజాంకిత మనవచ్చును. కాని నిజముగా నది రాజరాజునకు ఉపదేశము.

ఈ మహాభారత రచన కుపక్రమించువేళ రాజరాజు నన్నయభట్టారకు నెట్లు పూజించెనో మనకు తెలియదు. 'జాంబూనదాంబరాభరణంబు' లిచ్చి సత్కరించి నట్లు లేదు. అగ్రహార మిచ్చినట్లు లేదు. నన్నయ యాచకుడుగా దోపడు, అందులో యాచకు డున్నచో నతడు రాజరాజే. కాని రాజరాజును యాచకు డనుట యుక్తము కాదు. అతడు ప్రచ్ఛకుడు. నన్నయ వక్త, రాజరాజు శ్రోతగా నుద్భవించుటచే ఆంధ్ర మహాభారతము కృతకృత్యత నొందినది!

## ౫

కాని భారతధర్మము అప్పటిలో సుస్థిరముగా, ప్రతిష్ఠితముగానుండ నోచుకొనలేదు. మూడు పర్వములు పూర్తికాకుండగనే ఆంధ్రమహాభారత మాగిపోయినది. వేంగీమండలమున విప్లవములు వచ్చినవి. రాజరాజు కుమారుడు, చోళ చక్రవర్తియై ధర్మనిరతితో రాజ్యము చేసినాడు, కాని యాతనికిని, అతని

వంశము వారికిని మాతృవంశముమీదను, ద్రవిడదేశము మీదను అభిమాన మతిశయించినది. ఆంధ్రమహాభారతము మూలబడినది.

ఉత్తరదేశమును తురుష్కు లాక్రమించుకొని భారతధర్మమును పెల్లగించియే వేయుచున్నారు. వారి దృష్టి దక్షిణదేశముమీద గూడ పారినది. దక్షిణదేశములో ననేకరాజ్యములు వెలసినవి. ఆ రాజ్యముల యధినేతలు ఒకరితో నొకరు కొట్లాడుచున్నారు. వారికి ధర్మకాంక్షకంటె రాజ్యకాంక్ష ఐశ్వర్యకాంక్ష ప్రబలమైనవి. భారతధర్మ మే రాజునకు కావలెను ? ఆంధ్రదేశమునంతటిని జయించి గణపతిదేవుడు కొంతవరకు రాజ్యము స్థిరపరచినాడు. కాని యాతని చిన్నతనము యుద్ధములతో గడచిపోయినది. వార్ధకము తన యనంతరమున సింహాసనమున నుంచదగిన ప్రభు వెవరా యను చింతతో నల్లిపోయినది. రాజగురువు గౌడరాతమఠాధిపతి యగు విశ్వేశ్వరశంభుదేశికుడు. అతడు పంచద్రావిడులలోని వాడుగా దోపడు. గౌడులలోనివాడు. ఆ సమయముననే ఆంధ్రదేశములో గౌడబ్రాహ్మణులు స్థిరవసతు లేర్పరచుకొని బాబాజీమఠములు స్థాపింపసాగినట్లున్నారు. మరియు గణపతిదేవుని యాస్థానమున జైనాచార్యులును పలువు రున్నారు.

ఆకాలమున నెల్లూరులో తిక్కన యమాత్యుడుగా నుండెను. ఆతనికి చిన్నతనమునుండియు ధర్మాభిమాన మున్నట్లు తోచును. కాని యది ధర్మనిష్ఠగా మారుటకు కొంతకాలము పట్టినది. ముందాతడు మనుమసిద్ధి కంకితముగా నిర్వచనోత్తరరామాయణము రచించెను. అతడు తాను 'శిల్పమున పారగుడ' ననియు, 'కళావిదుడ' ననియు నిత్యాదికముగా స్వీయప్రతిభ నుత్తమపురుషలో జెప్పుకొని కృతి నుపక్రమించినాడు. అదియు 'మనుమనృపతి కభ్యుదయముగా' జెప్పినాడు.

కాని యా మనుమనృపతికి లక్ష్మి స్థిరముగా నిలువకపోయినది. ఆతడును తిక్కన యుపదేశములకు పాత్రభూమిగా చిరకాల మున్నట్లు తోపదు. మొదలే యాతనిది చిన్నరాజ్యము. అదియు బలవంతులగు రాజులమధ్య సంధిస్థానములోనున్నది. ఇటు కాకతీయులయు, అటు చోళులయు, ఒకవంక పాండ్యులయు, మరియొకవంక కాడవులయు పోటులకే కాక జ్ఞాతుల పోటులకును, చిల్లరప్రభువుల పోట్లకును మనుమసిద్ధి గురియైన ట్లున్నాడు. ఆతనికి రాజ్య మెన్నిమారులు పోయినదో భగవంతునకే ఎరుక !

ఇట్టి సమయమున తిక్కనకు 'వైదికధ్యాయిత' ఎక్కువయినది. 'వైదికధర్మనిష్ఠమగు వర్తనము నిర్వహింప' సాగినాడు. సోమయాజి యైనాడు. అనవరతము 'స్వాహాస్వధావషట్కారములు' ప్రయోగింప సాగినాడు. మహాభారత రచనాకుతూహల మాతనికి పెరిగినది. కాని యది ఎవరి కంకితముచేయుట ? దీని నాలించు ధర్మప్రభు వేడీ ?—ఏడీ ?—దీని యాచరణలో పెట్టువా డేడీ ? ఆచరణలో పెట్ట దలపెట్టినను దానిని సమర్థింపగల నాథు డేడీ ?

“అని రచనాకౌతుకమున
మన మలరఁగ నీప్రబంధమండలి కధి నా
ధునిఁగా నే పురుషునిఁ జే
ర్కొనువాఁడనో యను తలంపు గూరిన మతితోన్”

ఇంచుక నిద్రించు సమయంబున కొమ్మనామాత్యుడును, హరిహరనాథుడును ఆవిర్భవించి హరిహరనాథున కంకితం బొనర్ప నాదేశించిరి. అంతట నతండును 'ఈదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధనవిశేషం బగుటం జేసి' హరిహరనాథునకు 'విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని' రచన కుపక్రమించెను. ఆత డెక్కడనుండి రచించుచున్నను హరిహరనాథుడు అంతస్సన్నిహితుడై యుండెను.

సోమయాజి పదునైదు పర్వములు రచించెను. వానిలో నెన్నియో యాశ్వాసము లున్నవి. కాని ప్రతిఆశ్వాసమును ఒకే వచనముతో ప్రారంభించును.

“దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.” ఈమాట లాతడు పదేపదే చెప్పుటకు విసువలేదు. తనవలెనే వైదికనిష్ఠాభాసురుడు, ధర్మతత్పరబుద్ధి, తన యజుశ్శాఖకు ప్రవర్తకుడు, నగు వైశంపాయన మహర్షి జనమేజయున కుపదేశించినట్లు, తానును మహాభారతము తగిన యధికారి కుపదేశింత మన్న నట్టి ధర్మప్రభువు తనకు లేడయ్యెగదా ! 'దేవా, దేవా, దేవా' యని చింతించుచు తిక్కనసోమయాజి హరిహరనాథు నారాధించెను. హరిహరనాథుని సాక్షిగా

నుంచుకొని మహాభారతరచనమున కొతడు గడంగెను. కాని ధర్మసూక్ష్మవేత్త యగుటచే సోమయాజి, ఇతరులు భ్రాంతిపడకుండగలందులకు, మరలమరల 'వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె' నని చెప్పుచునే వచ్చెను.

మహాభారతశ్రోతగా నుండుటకు ధర్మప్రభువు లేడాయెగదా యని సోమయాజి ఎంత పరితాప పడెనో పునః పునరుక్తమైన ఆ ప్రారంభవచనమే చాటుచున్నది!

## ౬

కాని సోమయాజుల తపస్సు వెంటనే ఫలింప లేదు. సోమయాజులవలెనే ధర్మతత్పరు లగు బహు వేదవిప్రుల తపస్సుగూడ కాలమాహాత్మ్యముచే వృధ యైనది. తురుష్కులు దక్షిణాపథమును ముంచియే వేసినారు. ముందు దేవగిరి, పిమ్మట ఓరుగల్లు పట్టుకొనిరి. ఆ ఊపున మధుర యాక్రమించిరి. వారి కత్తి కప్పుడు ఎదురులేదు. కనబడిన బ్రాహ్మణుల నెల్లర వధించిరి. వారి నోళ్లలో బలవంతముగా సురామాంసములు క్రుక్కిరి. ప్రతాపరుద్రుని సామంతమండలేశ్వరులు దండనాథులు, ప్రాణములు వదలినవారు పోగా, మిగిలినవారు పారిపోయి దాగికొనిరి. దేశమంతటను మహాభయ మావేశించెను. వర్తకుల వ్యాపారము కట్టువడినది. పొలములలో వ్యవసాయ మాగిపోయినది. ఎవరో ఒకరు పొలము పండించినను, సిద్ధమైన యాపంట తురుష్కాధికారు లెత్తించుకొనిపోవుచుండిరి.

ఆ సార్వజనీన మగు మహాభయములో నుండియే ధర్మబీజము మొలకెత్తెను. సామాన్యముగా వ్యవసాయము చేసికొనువారును, వర్తకము చేసికొనువారును, తమతమ యితరవృత్తులతో కాలక్షేపము చేసికొనువారును, చేతికి చిక్కిన యాయుధము ధరించిరి. పల్లె పల్లెలందును వారు తురుష్కప్రభువుల మూకలను ప్రతిఘటింపసాగిరి. బ్రాహ్మణులును ఆయుధములు ధరించిరి. కాని వారి యాయుధములకంటె వారు సామాన్యజనులకు చేసిన బోధ, కలిగించిన యుత్సాహము, ఇచ్చిన యాశీర్వచనములు నమోఘములై యుండవలెను. సామాన్యప్రజలనుండియే దేశమంతట నాయకు లుద్భవించిరి.

సరిగా నాసమయముననే శంకరస్వామిశిష్యుడును సూర్యసుకవి పుత్రుడును అగు ఎఱ్ఱనకు మహాభారతగ్రంథములోని మొరికి భాసించినది. ఆంధ్రమహాభారతగ్రంథము పూర్తికానిది ధర్మము ప్రతిష్ఠితము కాదని శ్రీగురుస్వామి యుపదేశించి యుండురు. నన్నయభట్టారకుడు ఎఱ్ఱయ నావేశించినాడు. రాజరాజువంటి ధర్మప్రభువుకొరకై ఆకాలపు ప్రజలు తపించియుందురు. అట్టివా డింకను ఎఱ్ఱయకు పొడకట్టలేదు. అందుచే రాజరాజాంకితముగానే అరణ్యపర్వశేషముపూరించినాడు.

అంతలో నొక విశేషము జరిగినది. అది యపూర్వము! ఆంధ్రదేశనాయకు లందరు తాత్కాలికముగా నేకీభవించినారు ఆనాయకులకు అగ్రణులుగా కొంత కాలము ప్రోలయయు, పిమ్మట కాపయయు నుండిరి. వారు తురుష్కులను తరిమితరిమి కొట్టిరి. భయభీతులైన ప్రజలు ధైర్యశాలులైరి. ఆంధ్రసేనలు వచ్చుచున్నవని విన్నంతనే భయభ్రాంతులై తురుష్కులు దుర్గములు నగరములు విడిచిపారిపోజొచ్చిరి. ఆంధ్రసేనలపోటు పోయి, పోటు వచ్చినది. ఆంధ్రభూమి నంతట జాతీయప్రభుత్వములు నెలకొనెను.

ఆ ప్రభుత్వములకు అధినేతలలో ఎక్కువ భాగము శూద్రులు. ఆ శూద్రులు ఉత్తమశూద్రులు. తమ శూద్రజన్మమందు గర్వమున్నవారు, తమ శూద్రధర్మమందుఅభిమాన మున్నవారు, భారతధర్మస్వరూపము తజ్ఞులగు పెద్దలవలన తెలిసికొన్నవారు. అట్టివారిలో నుత్తమోత్తముడు ప్రోలయ వేమన! అతనికి అద్దంకి రాజధాని. అతడు బంధుసంపద కలవాడు. సర్వసంపదలును గలవాడు. అతని ముద్దు తమ్ముడగు మల్లరథినీనాథుని ఆప్తసచివుడగు ఎఱ్ఱయను అతడు గ్రహించినాడు.

ఎఱ్ఱయతపస్సు ఫలించినది. మరల రాజరాజు వంటి ధర్మదీక్షగల ప్రభువు మధ్యాంధ్రదేశమును పాలింపసాగినాడు. గుండ్లకమ్మకిరుప్రక్కల నున్న మహాదేశము నాతడుపరిరక్షించెను. పశ్చిమమున అహోబలము శ్రీశైలమును, తూర్పున సముద్రమును అతని పాలనలో నుండెను. అతడు సమస్తాధికారములు కలవాడే, సమస్తప్రభుత్వశక్తులు కలవాడే, కాని క్షత్రియోచితము లగు లాంఛనములు బిరుదములు నాతడు నిరాకరించెను. అత డెట్టివాడు?

"ఇష్టాపూర్తరూపం బగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగా, దొడంగి,

"అగ్రహారములు విద్యాతపోవృద్ధజ
నుల కిచ్చి యజ్ఞకర్తలుగ నునిచె,
గోమఠారఁ జెఱువులు గుళ్లఁ బ్రతిష్ఠించి
లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లను నిలిపెఁ దోఁటలు
సత్రములు చలిపందిళ్లు వెలయఁబెట్టె
హేమాద్రిపరికీర్తితామిత వ్రతదాన
నివహంబు లన్నియు నిర్వహించెఁ
జేసెఁ జేయుచు నున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతి శుభావలుల నెల్ల
ననఁగ శ్రీవేమవిభున కయ్యలరుపేర్మి
వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు!"

ఇవి ఎఱ్ఱయకవి చేసిన స్తుతిపాఠములు కావనుటకు ప్రోలయవేము డిచ్చిన దానశాసనములు, దానములే సాక్షి. అవి పెక్కులు నేటివరకు స్థిరముగా నుండి ఎఱ్ఱయ సత్యవచనములను వేముని ధర్మబుద్ధిని చాటుచున్నవి. అతడు బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చి వారిని తమ యన్నలతో నందు ప్రవేశించి యజ్ఞయాగాదులను అతిథిపూజలను నిరతాన్నదానములను సాగించుకొనవలసిన దని ప్రార్థించినట్లు ఆశాసనములలో గలదు. ఆదానములచే తాను కృతార్థుడైనట్లే భావించినాడు. ఆప్రతిగ్రహీతల నామములు చదివినచో వారందఱు అసమపక్షము మూఁడునాలుగు తరములుగా వేదవేదాంగవిదు లగుటయేకాక, బహువిధయజనములు చేసిన తపస్సంపన్ను లని విదితము కాగలదు.

అట్టి ప్రోలయవేమన ఎఱ్ఱయచే ముందు శ్రీమద్రామాయణము చెప్పించినాడు. ఆ రామాయణము ఇప్పుడేలనో దొరకకున్నది. అది దొరకినచో, తెలుగులో నెన్ని రామాయణము లున్ననుతృప్తి కలిగించు రామాయణము లేదను లోటు, తీరిపోయియుండును. అంతే కాదు. ఆకాలపు చరిత్ర అజ్ఞాతముగా నుండక విజ్ఞాతమై యుండును. ఆ రామకథ చెప్పించుటచే ప్రోలయవేముడు తాను 'అత్యుత్తమఖ్యాతిం బొందితి' నన్నాడు. అది ప్రోలయవేమునకే అంకితమైన దని మనము భావించుటలో పొరపాటుండదు.

కాని యంతటితో ప్రోలయవేముడు 'కావ్యామృతాస్వాదనతో' తనియలేదు.

"భారత పరాంశ మని యిం
పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
హారమ్యకథఁ దెనుంగుగ
ధీరోత్తమ, నిర్వహించి తెలుపుము మాకున్."

"అనినం బ్రహర్షపులకితదేహుండనై, యమ్మహాభాగుని సముగ్రసంప్రార్థనంబు కృతార్థతాకలితనృత్తం బగు చిత్తంబునం గైకొని యిట్లంటి.

"నన్నయభట్ట తిక్కకవి
నాథులు మాపిన త్రోవ పావనం
బెన్నఁ బరాశరాత్మజము
నీంద్రుని వాఙ్మయ మాదిదేవుఁ డా
వెన్నుని వృత్త మీవు కడు
వేడుకతో విను నాయకుండ వి
ట్లెన్నియొ సంఘటించె మద
భీప్సితసిద్ధికి రాజపుంగవా!"

పైవాక్యములతో ఎఱ్ఱయ హరివంశరచన కుపక్రమించినాడు.

వేదములకు ఉపనిషత్తు లెట్టివో, రామాయణమునకు ఉత్తరకాండ మెట్టిదో, మహాభారతమునకు హరివంశ మట్టిది. హరివంశము పూర్తి కానిది మహాభారతము పూర్తి కాదు. యోగీశ్వరుడును శంకరస్వాముల శిష్యుడును అగు ఎఱ్ఱయ చేతులలో మహాభారతము పూర్తియగుట ఆంధ్రుల మహాభాగ్యము!

అది యీకాలపువా రనుకొను నరాంకితము కాదు. భారతమూలమువలెనే ఆంధ్రమహాభారతము లోని మొదటి మూడు స్కంధములును, దాని శిఖయగు హరివంశమును ఉత్తము లైన యధికారుల కుపదేశింపబడినవి. జనమేజయునకు వైశంపాయనునం దెట్టి భక్తి యున్నదో, అట్టిదే ప్రోలయవేమునకును ఎఱ్ఱయ యందు గలదు. "అమ్మహాభాగుని సముగ్రసంప్రార్థనంబు" అని స్తోత్రపాఠకు డగు కవి వ్రాసికొనునా? మరియు నొక్క విశేషము! హరివంశమును వేముని నాశీర్వదించుచు ఎఱ్ఱయ యిట్లు పూర్తి గావించెను.

"శ్రీవేమ క్ష్మావల్లభ
భూవల్లభపూజనీయ భుజవైభవ ల
క్ష్మీవల్లభ గుణవితరణ
పావన నినుఁ బొందు గాత భవ్యశుభంబుల్!

ఇట్టివి యీసడింపదగిన నరాంకితములా? ఇట్లు ముఖ్యశ్రోత నొకరిని పెట్టుకొని గ్రంథములు చెప్పుట సత్సంప్రదాయము గనుకనే, ఇతరులుకూడ పలువు రీ

పద్ధతినే యవలంబించినారు. సన్న్యాయాదుల మార్గమును నిరసించు పాల్కురికి సోమనాథుఁడుకూడ తన యుద్గ్రంథములకు ముఖ్యస్రోతలను పెట్టుకొన్నాడు. బసవపురాణమునకు సంగయామాత్యుఁడును పండితారాధ్య చరిత్రమునకు సూరనామాత్యుఁడును ప్రధాన స్రోతలు !

౭

ఎఱ్ఱయపిమ్మట కొలదికాలమునకే పోతన యవతరించినాడు. ఎఱ్ఱయ వృద్ధుఁడైయుండఁగనే పోతన జన్మించియు నుండవచ్చును. అప్పటికి దక్షిణదేశములో మార్పులు చాల వచ్చినవి.

గుల్బర్గాలో భామినీసుల్తానులు స్థిరపడిపోయినారు. శ్రీవిద్యానగరములో క్షత్రియవంశజు లగు రాజులు శ్రీవిద్యారణ్యుల యాశీర్వచనముచే సుప్రతిష్ఠితులై భారతధర్మము నుద్ధరింపబద్ధకంకణులై సుల్తానులతో నిత్యము పోరాడుచున్నారు. అద్దంకినుండి కొండవీటికి తమరాజధానిని మార్చిన ప్రోలయ వేముని వంశ్యులగు ప్రభువులు రాజమహేంద్రవరమువరకు గూడ తమరాజ్యమును విస్తరింపజేసిరి. కాని వారిలో ప్రోలయ వేముని ధర్మదీక్ష మందగించినది. ధర్మమందభిమానము నశింపలేదు కాని భోగలాలసత అతిశయించినది. 'వసంతరాయఁడు' రాజై తన మంత్రి యగు కాటయ వేమునకు రాజ్యపాలన మప్పగించినాఁడు. తుదకు జనకంటకుఁ డగు రాచవేమారెడ్డి ఆ రాజ్యమునకు ప్రభువైనాఁడు. షుమారు నూఱు సంవత్సరములలో ధర్మమూర్తు లగు ప్రభువులతో ప్రారంభించిన రెడ్డి రాజ్యము క్షీణించి లయమందినది.

ఆ సమయముననే ఆవల రాచకొండలో సింగమనీఁడు ప్రభువు. ఆవంశమువా రిప్పుడు వారి పూర్వుఁడగు మొదటి సింగమనేనివంటివారు కారు. కాపయ నాయకుని కాలము అండగా నున్నరోజులు నేఁడు మారిపోయినవి. ఆరాజు లిప్పుడు రెడ్డిరాజులతో నిరంతరము పోరుపెట్టుకొనసాగిరి. వీరి తలకొట్టి వారును, వారి తలకొట్టి వీరును, తమ తమ తమ్మపడిగలలో దాపించుకొన మొదలుపెట్టిరి. 'మరణాంతాని వైరాణి' అను నార్యోక్తి మరచిపోయి ఓడిపోయిన శత్రువుల పుఱ్ఱెలు తెచ్చి తమ తమ్మ ఉమియు పళ్ళెములుగా నుపయోగింపసాగిరి. అవి కేవలము పుఱ్ఱెలే కావు న్నను, వాని యనుకృతులైన నయియుండవలెను మరియు వా రిప్పుడు బహమనీసుల్తానులతో చెలిమి చేసి, ఇటు రెడ్డిరాజులతోడనే గాక అటు శ్రీవిద్యానగరప్రభువులతో గూడ కలహింపసాగిరి.

ఈరాజులకు వారిపూర్వుల ధర్మబుద్ధియే నశించినది. కాని వారి సాహిత్యాభిమానము నశింపలేదు. వారికి సాహిత్యగ్రంథములు ఆస్థానాలంకారములు! లోకములో నున్న సమస్తరత్నములను సంగ్రహించిన శుంభనిశుంభులు స్త్రీరత్న మగు చండికను కాంక్షించినట్లే, వారును ఉత్తమగ్రంథములు తమ కంకితము కావలె నని కాంక్షించి యుండవచ్చును. అట్టివానిలో నొకటి పోతన రచించుచున్న ఆంధ్రమహాభాగవతము.

పోతన యాంధ్రీకరించిన మూలగ్రంథము వ్యాసప్రోక్తమా కాదా యను వివాదము పోతననాటికే కలదు. ఏది యెట్లున్నను అది వ్యాసకృత మను తాత్పర్యముతోడనే పోతన యాంధ్రీకరింపసాగినాఁడు. అందునను చిత్రవిశేషము లున్నవి.

పోతనతండ్రి 'శైవశాస్త్రమతము గనిన' వాఁడు. అతని యన్న 'ఈశ్వరసేవాకాముఁడు'. తాను స్వయముగా శివభక్తుఁడు. ఐనను అతఁడు 'శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలు' డైనాఁడు. ఒకనొక పూర్ణిమనాఁడు సోమోపరాగసమయమున గంగయందు (అది గోదావరి కావచ్చును) మునుకలిడి మహేశ్వరధ్యానము చేయుచు పులినతలమండపమున కన్నులరమోడ్చినాఁడు. 'రాజశేఖరు' డొక డాతనికి ప్రత్యక్షమై తాను 'రామభద్రుఁడ' నని పేరు చెప్పుకొని, తన కంకితముగా శ్రీమహాభాగవతము తెనుంగు చేయుమని యాతని కానతిచ్చినాఁడు.

పోతనకుగూడ ఆ గ్రంథము 'రాజశేఖరునకు' అంకితముచేయుట సత్సంప్రదాయమనియు కర్తవ్యమనియు తెలియును. రామభద్రున కంకితము చేసినను అతఁడు రాజశేఖరుఁడను భావముతోడనే అంకితము చేసినాఁడు. ధర్మమూర్తియగు రామభద్రునితో తా నెరిగిన మనుజేశ్వరులను పోల్చినాఁడు. వా రెవరో కాని తమకు భాగవతము కృతి యిమ్మనియు పురములు వాహనములు ఆభరణములు ఇచ్చెద మనియు ప్రలోభపెట్టి నట్లున్నారు. అందునుగూర్చి లోకములో వ్యాప్తమై యున్న కథలలో కొంత సత్య ముండకపోదు. ఆత డెరిగిన యా రాజులు—పరీక్షిత్తువంటి

వారు కారు, జనమేజయునివంటివారు కారు, రాజరాజువంటివారు కారు, ప్రోలయ వేమునివంటివారు కారు! వారు 'మనుజేశ్వరాధములు!' ఉత్తము లగు నరేశ్వరుల కంకితము చేయుట, ఉపదేశించుట, పోతనకు ఇష్టము లేక పోలేదు. తనరచనకు మూలగ్రంథమే కలిలోని ప్రథమసార్వభౌమునిగు పరీక్షితున కంకిత మైనది. పోతనదృష్టిలో భాసించినది యాకాలపు 'మనుజేశ్వరాధములు' కొందరు. అట్టివారి నుద్దేశించియే 'ఇమ్మనుజేశ్వరాధముల' కిచ్చి ఇత్యాది పద్యము చెప్పినాడు.

ఆ తర్వాతివారు చరిత్ర మరచినారు. ధర్మగ్రంథములు వ్రాయుటయు మరచినారు. వాని నుపదేశించు సంప్రదాయమును మరచినారు. ఉపదేశింపగల మను ఆత్మవిశ్వాసమును పోయినది. ధన మిచ్చిన వారికెల్ల తమ కృతులు సమర్పింపసాగినారు. తాము కోరినంత ధన మిచ్చువారు లేనియెడల, ధనవంతులపై కోపముతో, ఇదిగో భగవంతునికి కృతియిచ్చుచున్నా మని బెదరింపసాగినారు. కొందరు నిజమైన భక్తులు కూడ నరాంకితము చేయుటే దోషమని పోతన తలంచెనని భ్రాంతిపడినారు. గ్రంథము లంకితము చేయుపద్ధతిలోనే పెద్ద మార్పు వచ్చినది. కొందరు ధనమిచ్చినవారి పేరనే తమ గ్రంథములు రచించి గ్రంథకర్తృత్వమే వదలుకొన్నారు. అది యిప్పటికిని జరుగుచునే యున్నది. ముందును జరుగగలదు.

అంతేకాని నరాంకితము చేయుట పోతన హేయ మని తలపలేదు. నరేశ్వరులకు అంకితము చేసినందున నన్నయకును ఎర్రయకును ఎట్టి న్యూనతయు నారోపింపరాదు. ధర్మగ్రంథములే కాదు, గ్రంథములన్నియు, నరులకొరకు వ్రాసినవే కాని భగవంతు నుద్దేశించి వ్రాసినవి కావు. హరిహరనాథునకు వ్యాసకృతి సంస్కృతభారతము అర్థము కాకపోలేదు; అతనికి ఆంధ్రభారతమే వినవలెనని కుతూహలము కలిగియుండెను. శ్రీరామభద్రునికి పోతనభాగవతమే వినవలెనని కోర్కె కలుగదు. తిక్కనసోమయాజియు పోతనయు మహాతపస్వులు. వారు లోకసంగ్రహము నకై ఉద్గ్రంథములు వ్రాయబూనినారు. అందులో వారికి ఉత్కంఠతోపాటు జంకును కలిగియుండవలెను. తుదకు వారు ధైర్యము తెచ్చుకొనిరి. ఆసమయమున వారికి కలలోననో ధ్యానముననో భగవంతుడు ఏదో ఒకరూపమున, సాక్షాత్కరించినట్లు భాసించినాడు. వారి ధైర్యము స్థిరపడినది. అందుచే వారు తమ గ్రంథములు ఉదాత్తవిధముగా నిర్మింపగలిగినారు.

వారికలలు దూరము తరచి చూడగూడదు. అట్లు చేసినచో కొన్ని యసందర్భములు కనిపించును. కఠినపరీక్ష చేయువారికి అప్పకవి కలలో నున్నన్ని యసందర్భములును కనబడవచ్చును. కాని వారి స్వప్నములు నిజముగా వచ్చినవే. అసందర్భము లేకున్న స్వప్న మెట్లగును? ఆ కలలు వారి భావనాబలమును భగవద్భక్తియు రూపించును. అందుకు సందేహము లేదు. వారు చేసిన రచనలే వారి మహోపాసనలుగా పరిణమించినవి.

తిక్కన 'యుపలాలితుండగు డింభకుండు తన కోలందియెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున బ్రహ్మానందస్థితిం గోరి' నాడు. హరిహరనాథుడు కలలో 'జననమరణాదులైన సంసారదురితములకు వగపడకుండంగఁ దొలఁగు తెరువు గను వెలుంగు నీకిచ్చితి' ననెనట. ఆకోర్కెతో నాతడు మహాభారతము వ్రాసినాడు. ఆ కోర్కెతో నాతడు అశ్వాసాది పద్యములు నాశ్వాసాంతపద్యములు మరల మరల వ్రాసినాడు. అందుచే నట్టి వెలుగును ఆతడు సమీపించె ననుట కెట్టి సందేహము నుండరాదు!

అట్లే పోతనకును శ్రీరామభద్రుడు 'నీకు భవబంధంబులు తెగునని యానతిచ్చెను'. ఆ నిశ్చయముతోడనే పోతనయు గ్రంథము రచించెను.

వారికి అట్టిది ఆ జన్మములోనే ప్రాప్తించెనని కాని ప్రాప్తించలేదని కాని చెప్పలేము. వారు ఆజన్మములో చేసిన సాధనలచే భవబంధములు తెగిపోవు వెలుగును దరిసినారనుటకు మాత్రము ఎట్టి విప్రతిపత్తి నుండరాదు. వారా వెలుగును పొందినారనుటకు ఇతరాధారము లున్నచో పొందిరనియే అందుము. అది కష్టసాధ్యము కనుక, ఆవెలుగును వారు సమీపించినారని చెప్పి తృప్తినొందుదము. అట్లనుటచే మనము పిసినిగొట్టులము కాము; తిక్కన పోతనలయందు తక్కువ గౌరవము కలవారము కాము; బ్రహ్మజ్ఞానము యొక్క సర్వాతిశాయిత్వమే కొంతలెక్క వేయగల వారమగుదుము!

## ౮

మన తెలుగు దేశములో వలె గ్రంథములు ఇతరు లకు కృతియిచ్చు నాచారము కర్ణాటకకవులలో నున్న దేమో! పూర్వపు సంస్కృతకవులలో లేదు. ఐనను సంస్కృతములో నుత్తమగ్రంథములకు ప్రధాన శ్రోతలు — ప్రత్యక్షముగనో అప్రత్యక్షముగనో — లేకపోలేదు. పురాణము లన్నిటికి శ్రోత లున్నది జగ ద్విదితము గనుక, వానిని వదలి కావ్యప్రపంచములో నుండి యొక్క యుదాహరణ మిత్తును.

సంస్కృతకవులలో ఋషితుల్యుడు మహాకవి కాళిదాసు. అతని రఘువంశము విద్యార్థులు ప్రథమ కావ్యముగా పఠించుట మన దేశములో నాచార మైనది. పరిణతులైనపిమ్మటను ముఖ్యముగా పఠింప దగిన దా కావ్యము! అందులో దిలీపునియొద్దనుండి రఘువంశరాజుల చరిత్రము వర్ణింతు నని ప్రారంభిం చెను. వా రెటువంటివారు?

ఆజన్మశుద్ధులు, యథావిధి హుతాగ్నులు, యథాపరాధదండులు, త్యాగార్థము సంభృతార్థులు, ప్రజార్థము గృహమేధులు, శైశవమందు విద్య లభ్య సించినవారు, వార్ధకమున మునివృత్తి యవలంబించిన వారు, తుదకు యోగముచే తనుత్యాగము చేయువారు!

దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు, శ్రీరా ముడు — ఇత్యాదు లందులో వర్ణింపబడిన యాదిరా జులు. వారు రాజర్షులు! తుదకు సుదర్శనుడను రాజు ప్రజాపాలనము చేసి, రాజ్యమునకు తన కుమారు డగు నగ్నివర్ణుని నభిషేకించి, వనమునకు పోయి మునివృత్తి యవలంబించెను. అతని కచ్చటి ఉటజముల సౌఖ్య ముతో రాజమందిరసౌఖ్యమును, దర్భశయ్యల సుఖ ముతో హంసతూలికాతల్పముల శయనించిన సుఖ మును, మరపువచ్చెను.

మరి యాతని సుపుత్రు డగ్నివర్ణుడో? అతడు తండ్రి సంపాదించిపెట్టి యిచ్చిన రాజ్యము, తన భోగమునకే వినియోగింపదగునని భావించి, నిశ్చ యించి, ప్రవర్తించెను. కొద్దికాలమే రాజ్యపరిపాల నము చేసి పిమ్మట నతడు ఆ భారమంతయు మంత్రు లపై నుంచెను. తాను స్త్రీలతో రమించుచు నృత్తగీత వాద్యములతో కాలక్షేపము చేయసాగెను. ఆతని యంకతలమును వదలక ఎప్పుడును వీణయును కలభా షిణి యగు యువతియును ఆశ్రయించియుండెడి. అత డద్దములో తనరాజవేషము చూచుకొనుటకంటె, భోగ చిహ్నితమైన తన రూపము చూచుకొని నివ్వెరగందు చుండెను. ప్రజలకు దర్శనమిచ్చుటే యాతడు చాలిం చెను. వృద్ధామాత్యు లెవరైనను ప్రజలకు దర్శన మీయవలె నని బలవంత పెట్టినచో, గవాక్షమునుండి తన చరణము మాత్రము ప్రజలకు కనబరచువాడు!

అట్టివా డేమగును? రాజయక్ష్మచే నకాలమర ణము నొందెను. అనేకస్త్రీలతో భోగించినను ఆతనికి సంతానము కలుగలేదు. ఆతడు చనిపోయినది ప్రజ లకు తెలుపుట కిష్టములేక, మంత్రులు రోగశాంతి చేయించుచున్నా మని ప్రచురించి, యాతని దేహము నకు గృహోపవనముననే దహనాదిసంస్కారములు రహస్యముగా చేయించిరి.

అంతలో అదృష్టవశమున రాణిగర్భవతి యయి యున్నదని అమాత్యు లెరిగి, ఆమెనే ఆధారము చేసి కొని, పుత్రోత్పత్తి నర్థించుచు, రాజ్యము రక్షింప సాగిరి.

ఈ కథతో రఘువంశము పూర్తియగును. కాళి దాసుకు ఈ అగ్నివర్ణుడు సమకాలికు డేమో! ఏమై నను రఘువంశ మను మహాకావ్యముతో కాళిదాసు రాజుల కందరకు ఎట్లు పరిపాలింపవలెనో, ఎట్లు ప్రవ ర్తింపగూడదో, మహోపదేశము చేసినాడు.

అందుచే నా కావ్యము భగవదంకితము కాదు; ధర్మాంకితము, ధర్మపరిపాలకు లగు రాజుల కంకితము, నరోత్తమాంకితము!

కథానిక:

# చిరుతిండి

●

శ్రీ ఆకుండి నారాయణమూర్తి

ఇంతవరకూ శరీరానికీ మనస్సుకూ ఎంతో బాధ కలిగించిన ఎండల్లా ఒక్కమారుగా మాయమయి, పడమటి దిక్కునుంచి చల్లటి గాలి వీస్తూ, నల్లటి వాన మేఘం హుటాహుటిగా పరుగెత్తుకుంటూ మీదికి వస్తూ ఉండడంచేత, కుర్చీలో కూర్చొని బుఱ్ఱ వేడెక్కేలా ఏవేవో ఆఫీసు కాయితాలు వ్రాస్తున్న అనంతం ఆ పనికి అక్కడితో ఓ ఫుల్‌స్టాపు పెట్టేడు. అసలింకా రాయవలసిన సబ్జెక్టు బోలెడంత ఉంది! కానీ అలా చల్లగా గాలి వీస్తూ ఉంటే, ఆ ప్రక్కనుంచే గమ్మత్తుగా ఆకాశానికి నల్ల వార్నీసు ఏ చిత్రకారుడో తన కుంచెలో వేసుకొని వస్తున్నట్లు మేఘాలు వస్తూవుంటే ఇంకా ఆ నాలుగు గోడల మధ్యా కూర్చోవడం ఎంతో కష్టమనిపించింది అనంతానికి! ...... ఆ సమయంలో తనకు రెక్కలుండాలనీ, రివ్వున ఎగురుతూ ఆకాశవీధుల్లో సంచరిస్తూ ఉండాలనీ, ఆ మేఘాలలోకి ఎగిరిపోయి వాటి సంగతంతా కనుక్కోవాలనీ, ఆ రకమయిన గొంతెమ్మకోరికలతో ఆనందపడుతూ ఉండడం అతనికో అలవాటు!

అంతకంతకీ మేఘాలు క్రమ్ముకొస్తూ ఉండడంచేత, గాలి ఒత్తిడి ఎక్కువవడంవల్లా ఆ ఫైల్సు అలా మూలపడేసి వీధులో కొచ్చేడు. అప్పుడే ఎవరో వీధల్లా తుడిచినట్లు, ఆట్టే ఇసుక లేకుండా రాళ్లు కనిపిస్తూ మంచి గమ్మత్తుగా ఉంది రోడ్డు. ఆ సమయంలో తనకే అలా ఆనందంగా ఉంటుందా, లేక అందరికీ ఆ ఆనందం సహజమా? అనే అనుమానం కలిగిందనంతానికి. రైతులకు మాత్రం మహా ఆనందంగా ఉంటుందనే నిర్ధారణకు వచ్చేడు. మరి తక్కినవాళ్లగురించి అత నట్టే ఆలోచించలేదు. మెల్లగా అడుగులు వేస్తూ ఇంటిముఖం పట్టేడు.

ఆ ఊరికి తూర్పుదిక్కున ఉన్న ఆ కొండను "చింపిరికొండ" అని ఆ ఊరి వాళ్లంటూ ఉంటారు. కొండనిండా చింపిరి చింపిరిగా చెట్లు లావుగా ఉండడంచేతే దానికా పేరు వచ్చింది. ఆ కొండ వేపు మేఘాలు వెళుతున్నాయంటే తప్పకుండా వర్షం వస్తుందనే నిశ్చయానికి వస్తారా ఊరివాళ్లు!... చిన్నప్పుడు, 'వర్షంఎలా ఏర్పడుతుందో' అనే విషయాన్ని పాఠశాల్లో బాగా తెలుసుకున్నాడు. భూమిమీద ఉన్న నీరే ఆవిరయి, మళ్ళీ చల్లని గాలి తగులగానే వర్షం అవుతుందని. అయితే, మానవుల తాలూకు కన్నీటి బిందువులు కూడా నీరేగా? - అదికూడా ఆవిరయి, తిరిగి వర్షిస్తున్నాయా? ప్రస్తుతం హిందూదేశంలో కన్నీరు ఆవిరిగా మారి, మళ్ళీ వర్షిస్తున్నాది కదూ?... ఆ ప్రవాహంలోనే కదూ మనం ఈదులాడుతున్నది!! ఆ రకమయిన ఆలోచనల్లో పడ్డాడతను. కానీ ఆ ఆలోచనలకు త్వరలోనే ఓ అంతరాయం కల్గింది. తొందర తొందరగా నీళ్లకడవలతో వస్తున్నారు భామామణులు!— వర్షం తప్పకుండా వస్తుందని అప్పుడే వాళ్లు గ్రహించేఉంటారు. అందుకే అంత తొందరగా పోతున్నారని అనుకున్నాడు. గబగబా వెళుతే రాళ్లని తన్నేసి పడతారని చెపుదామనుకున్నాడు. కానీ, తీరా వాళ్ల మేలుగురించే చెప్పినప్పటికీ "నీ కెందుకయ్యా మాగోడవ. మా కా సంగతి తెలుసు!" అని వాళ్లంటే తన పనేం గానూ? వాళ్లలా అనడం కూడా సబబే!— ఎంచేతంటే, తనంత నిరంకుశులు కారు వాళ్లు. తనంటే దర్జాగా రాత్రి పన్నెండుగంటలకు ఇల్లు చేరుకున్నా ఎవ్వరూ ప్రశ్నించేవారు లేరు. మరి ఆడవాళ్ల విషయమో?— భర్త ఇంటికి వచ్చేసరికి వంట సిద్ధంచేసి భార్య 'రెడీ'గా ఉండకపోతే వస్తుందో తగవు!— ఒకవేళ వాళ్లు ఏ వానకో తడిసి ఎవరి పంచనో చేరుతే, ఆ విషయమై భర్తకు తెలిస్తే ఏమీ లేందే ఇద్దరిమధ్యా అనేక అపార్థాలు కలగడానికి అవకాశాలేర్పడతాయి! ఆ అవకాశాల్నే కథల రూపేణా

సదవకాశాలుగా చేసుకుంటారు రచయితలు!— అలా ఏ వేవో విషయాలగురించి ఆలోచిస్తూ, రోడ్డుమీద అగుపిస్తున్న దృశ్యాలను గమనిస్తూ నడక సాగించేడు.

'టప్, టప్' అని వడగళ్లలాంటి చప్పుడు చేసుకుంటూ చినుకుల పడడం ప్రారంభమయేయి. అప్పు డాలోచించేడు, తనిల్లు అక్కడికెంత దూరం ఉంటుందా, అని. తన 'కేలిక్యులేషన్సు' బట్టి అక్కడికి ఓ మైలుదూరం ఉంటుం దని తేల్చేడు. ఆఫీసునుంచి తనిల్లు ఎలా లేదన్నా మైలున్నర దూరం ఉంటుంది. ఆ ప్రెస్సుఆఫీసు దగ్గర మలుపు తిరిగి, ఆ ప్రక్క సందులోంచి 'కొడుకుళ్ల' వారి మేడదగ్గరకు వచ్చేసరికి పావు మైలు దూరం ఉంటుంది. అక్కడనుంచి బజారుకు సమంగా పావు మైలు దూరం. తనప్పటికి సమంగా బజారులో ఉన్నాడు. అంటే, తనిల్లు అక్కడికింకా మైలు దూరం ఉందన్నమాట! కోవెలవీధి దాటి, గవరయ్య దుకాణం ప్రక్కనున్న సందులోకి పోవాలన్నమాట. అప్పటి కప్పుడే చినుకులు ఒత్తుగాపడుతుండడంచేత అంతదూర్ం పోవడం దుర్లభం అనుకున్నాడు. కానీ ఎక్కడ కాలక్షేపం చెయ్యడం?... పోనీ ఏ దుకాణందగ్గ రయినా నిలబడితేనో!... కానీ అక్కడ నిలబడడం అంతగా బాగుండదేమో! ఓ పది గజాల దూరంలోనే 'మద్రాసు కాఫీ హోటల్' అని ఓ బోర్డు ప్రత్యక్షమయింది. కడుపు నింపుకుంటూ, వర్షం తగ్గేవరకూ కాలక్షేపం చేయవచ్చునుకున్నాడు అనంతం. హోటల్లోకి వెళ్లేడు. తనలాంటి వుద్దేశమే చాలామందికి కలిగింది కాబోలు! హోటల్ 'రష్' గానే ఉంది. అనంతం కూడా ఓ మూలకు పోయి కూర్చున్నాడు.

అయ్యరు తనప్పచెప్పే వలసిం దంతా అప్పచెప్పేసేడు. ఆఖరికి, "ఏం గావాల" అన్నాడు.

ఏ దయినా 'స్వీటు' తెమ్మనమని చెపదామనుకున్నాడుగానీ, అదయితే ఎక్కువ ఖరీదు. అదీకాక ఏ మంతగా కడుపునిండే సరుకు కాదు. దాంతోనే కడుపు నింపుకోవాలీ అంటే మొదట జేబులు ఖాళీ చేసుకోవాలి. కొస్త, ఘనపదార్థాలలో చవగ్గా వచ్చే 'పకోడీ' తెమ్మనమని చెప్పేసేడు. అదయితే నమిలేసరికే ఓ పావుగంట పడుతుంది, అలోగా వర్షంకూడా తగ్గిపోతుంది, ఇంటికెళిపోవచ్చు నని మరో ఉద్దేశంకూడా ఉంది...... పకోడీ తినడం పూర్తయిందికానీ వర్షంమాత్రం తగ్గలేదు

"ఇంకేంకావాల?... కాఫీయా?" అని అడిగే డయ్యరు.

అతనిదృష్టిలో కాఫీ త్రాగడం దండగే!— తన కసలు కాఫీ అలవాటు లేనేలేదు. అంత పెద్దవాడయినప్పటికీ ఇంటిదగ్గర ఉదయాన్నే చల్దన్నం తినడం అలవాటు! ఆ మధ్య బొత్తిగా బియ్యం దొరక్కపోడంచేత, "ఉప్పుపిండి" ఆ వగైరా టిఫిన్లకలవాటు పడ్డాడు. అసలీ కాలంలో కాఫీ అలవాటు లేనివా డుంటాడా? అనే అనుమానం కలగడం సహజం. అనంతంకూడా మొదట్లో అలవాటు చేసుకుందామని ప్రయత్నం చెసేడు కానీ, ఆ వాసన పడకపోడంచేత ఒక్కొక్కవాడు వాంతయిపోయేది. అయితే ఇలాంటి మనుష్యులీ రోజులో ఏ వెయ్యిమందికో ఒక్క రుంటా రనడంలో అతిశయోక్తి లేదు. తను కాఫీ త్రాగకపోయినప్పటికీ ఇంట్లోవాళ్లు త్రాగడానికి ఎవ్విధమయిన అభ్యంతరం పెట్టేవాడు కాదు. అప్పు డప్పుడు 'టీ' మట్టుగు త్రాగుతూ ఉండేవాడు. అదయినా ఏ టీపార్టీల సందర్భంలోనో, లేక స్నేహితుల బలవంతంమీదో త్రాగేవాడు. ఆ రోజున తనొక్కడే వెళ్లేడు. న్యాయతః ద్రవపదార్థం ఏదీ తన 'థియరీ' ప్రకారం తీసుకో నవసరం లేదు. కానీ మరో చిక్కు సమస్య! తన చుట్టూ పెద్దమనుష్యులందరూ కూర్చున్నారు. కాఫీదుకాణానికి వచ్చిన తరువాత వట్టి 'టిఫినే' చిన్నపిల్లడిమల్లే తినేసి, లేచిపోతే, తన్ని 'నాగరికతలేని మనిష'ని వాళ్లనకుంటా రని అనంతం అనుమానం. ద్రవ పదార్థం తీసుకోక తప్పింది కాదు. "ఉం టీ పట్రా" అన్నాడాఖరికి.

అనేసేడే కానీ మళ్ళీ ఒద్దని చెప్పేద్దా మనుకున్నాడు. తన కిష్టంలేని ఆ ద్రవపదార్థానికి వినియోగించిన డబ్బుతో, ఫస్టుక్లాసయిన ఘనపదార్థం వస్తుందికదా అని. కానీ అది మర్యాద కాదేమో అని అనుకున్నాడు. తాగే డన్నమాటేగానీ ఏమంత సత్ప్రీతికరంగా లేదు.

అప్పటికయినా వాన తగ్గుతుం దనుకున్నాడు వాన యింకా బాగానే పడుతున్నాది. అయ్యరు బిల్లు చేతిలో పెట్టినప్పటికీ ఇంకా కూర్చున్న జాగా లోంచి లేవలేదు. ఎదురుగుండా అవుపిస్తున్న అద్దాల బీరువా—అందులో అవుపిస్తున్న తీపిసామానులూ-కారపు సామానులూ ఆయన దృక్పథంలో పడ్డాయి. 'చిట్టిబాబు' జ్ఞాపకొని కొచ్చేడు.

గుమ్మంలో కాలు పెట్టగానే, "నాన్నగారూ, నాకేం తెచ్చేరివాళ ?" అని ఎలానూ అడుగుతాడు. వారం రోజులైౖ "ఏమీ లేదు." అనే చెపుతున్నా డతికష్టంమీద. ఆవాళకూడా అలా చెప్పడం ఇష్టం లేకపోయింది. ఇంతకీ ఓ పిశాచంలా ఆ బల్లజబ్బంటూ ఒకటి వాడిని పీక్కుతింటుండబట్టిగానీ, లేకపోతే ఏమయినా కొని పట్టుకెళ్లటానికి అంతలా ఆలోచించవలిసే పని ఆతని కసలే ఉండేది కాదు!... పుట్టిన మొదటి సంవత్సరం ఎంత బాగుండేవాడు ?" తెల్లగా గుండ్రని ముఖంతో, ఎంతో ముద్దుగా ఉండేవాడు. అసలాతని వంశంలోకానీ, భార్య తరపు వంశంలోగానీ ఏ ఒక్కరికీ లేని బల్లజబ్బు వాడికెలా వచ్చిందా అని ఒక్కొక్కప్పుడు ఆలోచించేవాడు. ఇంతకీ అది తన దురదృష్టమనీ, పూర్వ జన్మ కర్మఫలితమనీ వేదాంతమార్గంలోకి పోయి సముదాయించుకొనేవాడు.

నాలుగేళ్లకంటే హెచ్చు వయస్సు లేనివాడల్లా ఓ ఏడేళ్ల వాడిలా ముదరముఖంతో వికృతంగా తయారయేడు. పెద్ద కడుపూ, పూతికపుల్లల్లాంటి కాళ్లూ, అంతా అదో మాదిరిగా తయారయేడు. ఆరు నెలల వయస్సప్పుడు కేరింతాలుకొడుతూ ఎగిరే చిట్టిబాబునీ బల్లజబ్బు వచ్చిన తరువాత తయారయిన చిట్టిబాబునీ తలుచుకుంటే అనంతం హృదయం చెక్కలయేది!

అప్పటినుంచి ఎన్ని మందు లిప్పించినా తగ్గుముఖంలోకి రాలేదు. ఆఖరికి టెక్కలికూడా తీసుకెళ్లడం జరిగింది. అక్కడ మందిప్పిస్తూ పథ్యంగా ఉంచినన్నాళ్లూ కొంచెం తగ్గినట్లనిపించింది. కానీ మళ్లీ తన స్వగ్రామం వచ్చి అదే మం దిస్తున్నప్పటికీ మార్పేమీ కనిపించడం లేదు.

"మీనుంచే వాడికా జబ్బు తగ్గలే" దంటుంది -భార్య అరుణ. ఆ మాటలు జ్ఞాపకొని కొచ్చేయి.

ఆతని గుండె గుభేలు మంది. 'తన్నించేనా?' తన్నితాను ప్రశ్నించుకున్నాడు. "ఊహుఁ..." తనందుకుబాధ్యుడు కాడు. అతని మనస్సుకు అంతకన్నా సమాధానం తోచింది కాదు.

అంతవరకూ దబదబా చూరునుంచి కారే నీరల్లా, చిన్న చుక్కలు చుక్కలుగా పడుతూఉండడం చేత వర్షం పూర్తిగా పోయిందనే నిర్ధారణకు వచ్చేడు. "చిట్టిబాబుకు ఏమయినా కొంటేనో!" అని కుర్చీ లోంచి లేస్తూ మళ్లీ అనుకున్నాడు. అపథ్యం కాబోలనే పుద్దేశ్యం మనస్సులో ఉంటున్నప్పటికీ, చిట్టిబాబు తనింటి కెళ్లేసరికి తను తెచ్చిన పొట్లం పట్టుకొని ఎంతో సంతోషిస్తాడనే ఉద్దేశంతో, "కారప్పూస ఓ బేడది కట్టు" అని అయ్యరుతో అన్నాడు.

బిల్లు చెల్లించేసి పొట్లం పట్టుకొని ఇంటి కొచ్చేడు. చిట్టిబాబు తనకోసం గుమ్మందగ్గర నిరీక్షిస్తూ ఉంటాడని అనుకున్నాడుగానీ, అలామాత్రం జరగలేదు. అ దంతా అరుణఖాయిదా అయి ఉంటుం దని ఊహించేడు. నిజమే!... గాలితో వాన వచ్చేటప్పుడు తలుపుల దగ్గర పిల్లల్ని ఉండనియ్యకుండా ఉంచడం మంచిపనే!— సరాసరి వంటింటిలోకే వెళ్లేడు.

"అమ్మా, ఈ వానలో నాన్నగా రెలా వస్తారే ఆఫీసునుంచి?" అని అమ్మవీపుకు చేరబడి అడుగుతున్నాడు చిట్టిబాబు.

"అబ్బా!... ఇక్కడ పొగరా!— అక్కడ మంచంమీద కూర్చోబెడితే అప్పుడే దిగిపోయావ్!.. దొంగ!" అంటూ అలా పొగ వస్తున్నటువంటి పొయ్యిని ఎలాగయినా రాజెయ్యాలని బహు ప్రయాస పడుతున్న దా మాతృశ్రీ.

అంతట్లోకే, "అమ్మోవ్!... అదుగో నే నాన్నగారొచ్చేరు. దొంగతనంగా వెనకాల నిలబడ్డారు." అంటూ తండ్రిదగ్గరకు పరుగెట్టేడు చిట్టిబాబు.

"నాకు తెలిసిందిటూ!...... నాన్నగారు నాకేమిటో తెచ్చారుటూ!... టూటూటూటూ..." చిన్నరాగపు వరుసలో అంటూ, చిందులు త్రొక్కుతూ చప్పట్లు కొడుతూ అన్నాడు చిట్టిబాబు.

"ఆయనకు మరే పనయినా ఉంటే కదూ?— అడ్డదిడ్డమయిన తిళ్లూ తెచ్చిపెడుతూ ఉండడమూ, తను తింటూ ఉండడమూను." అదో రకమయిన చికాకుతో అంది అరుణ.

అలా అరుణ అన్నందుకు అనంతం ఆట్టే ఆశ్చర్యపడలేదు!— అలా అంటుందనికూడా అతనికి తెలుసు!... అదివర కలా ఎన్నిమార్లు అనిపించుకున్నాడో!

"నాన్నగారూ!... అమ్మకేం ఒక్క పిసరూ తినటానికివ్వద్దు. అంతా మనిద్దరికే!" అన్నాడు చిట్టిబాబు.

"అబ్బే!... మీ అమ్మకవి లిలాంటి తిళ్లు పడవురా!" అరుణ దగ్గరనుంచేదో ఘాటయిన సమాధానం వస్తుందని ఆ మాట లన్నాడు.

"జబ్బుతో ఉన్న వాళ్లకయితే పడతాయి. నాకెలా పడతా యీ తిళ్లు?" ఆమాట లనంతరం అరుణముఖం అరుణవర్ణాన్ని దాల్చింది.

"పోనీ అమ్మా! నీకూ కొంచెం ఇస్తానులే... నువ్వెందుకలా ఇదవుతావు?" అన్నాడు చిట్టిబాబు ఇవ్వడం ఇష్టంలేకపోయినా.

"పోరా దొంగవెధవా!... తిండిపోతురామన్నలా వెధవతిండీ నువ్వూను. అలా తినేస్తూ ఉండడమేనా పని?—ఇంతకూ ఆ తండ్రికి నువ్వు కొడుకువి. ఆ గుణా లెక్కడికి పోతాయి?" భర్తని ముఖాముఖీగా పేర్కొని అనడానికి సాహసం లేకపోవడంచేత, చిట్టిబాబుమీద పెట్టి అనంతాని కర్థమయేలా ఎత్తిపొడుపుమాట లంది అరుణ

"అయితే వీడికీ బల్లజబ్బు ఏ ప్రక్కవంశం లోంచి వచ్చిందంటావు?" అని అడిగే డనంతం.

"ఏ వంశంలోంచేమిటి? అదంతా మనకర్మ. పథ్యంగా ఉంచితే ఈపాటికా జబ్బు తగ్గిపోయుండేది. ఆ పెక్కలిలో ఉన్నన్నాళ్లూ హాయిగా ఉండేవాడు. ఆ డాక్టరిగారి దగ్గర భయంచేతయినా వాడికే చిరుతిళ్లూ కొని పెట్టక పథ్యంగా వుంచేవారు. మళ్లీ ఈ ఊ రొచ్చేక ఎక్కడలేని చిరుతిళ్లూ కొని వాడికి తినిపించుతుండడం మొదలు పెట్టేరు. ఎప్పటికి తగ్గుతుందా జబ్బు?"

"నోర్ముయ్!... అర్థం లేకుండా మాట్లాడడం అని దీన్నే అంటారు."

"అవును నోరు మూసుకొనే ఉంటాను. ఇంకా జబ్బు ముదిరితే మీరూ మూసుకుంటారు. ఆఖరికి మన జీవితాంతంవరకూ మన నోళ్లు మూసుకుపోతాయి!" కళ్లల్లో గిర్రున తిరిగిన నీళ్ల నాపుదామని ప్రయత్నం చేసిందిగానీ ఆగలేదు.

పొట్లాం విప్పి తిందామనుకున్నాడు కానీ అమ్మ కళ్లంట కారిన కన్నీళ్లు కనిపించడంతోనే ఆ ఉద్దేశాన్ని మార్చుకున్నాడు చిట్టిబాబు. వాళ్లనుకున్న మాటలు ఈమాత్రం అమాత్రంగా తనను గురించే నని అర్థం చేసుకున్నాడు.

"అయితే మరి నే నివి తిననే అమ్మా!" ఎంతో అమాయకంగా అన్నాడు చిట్టిబాబు.

ఆమాటలు వినడంతోనే మరింతగా కన్నీరు కార్చింది అరుణ. "అలా అన్నీ తినకూడదు నాన్నా, అలా తింటే నీ బొజ్జ పెద్దదయిపోతుంది. ఔషదం తాగేస్తూ ఉంటే నీ జబ్బు పోతుంది. అప్పుడు అన్నీ తిందువు గాని." అతిదుఃఖంతో ఆమాట లందరుణ.

"అయితే నా జబ్బు ఎప్పటికి పోతుందే?" అని అడిగే డాందోళనతో.

"నువ్వు పథ్యంగా ఉంటే వేగిరంగా పోతుంది నాయనా!... ఏదీ ఆ పొట్లాం నా చేతి కిచ్చేవూ? నువ్వు తినకూడదు సుమీ!" అందరుణ, చేతిలోంచి పొట్లాం తీసుకుంటూ.

"అమ్మా, మరేం, నా చిన్నపెట్టిలో ఇది దాచేసి అటకమీద పెట్టేవే. నా జబ్బు ఎల్లుండికి పోతే... తీసుకు తింటాను." అని అమాయకంగా అన్నాడు చిట్టిబాబు. కొన్నాళ్లల్లో స్మారక చిహ్నంగా కూడా అందులో ఏమీ మిగలదని ఆ కుర్రాడికేం తెలుసు? జబ్బు పోయిన వెంటనే తీసుకుతిందామనే ఆ అమాయక హృదయం ఉద్దేశ్యం!— చిట్టిబాబు కోరికప్రకారం ఓ చిన్న కర్రపెట్టిలో ఆ పొట్లాం పెట్టి అటకమీద ఓ మూల దాచేసిం దరుణ.

అదంతా చూస్తున్న అనంతానికి పూర్తిగా మతి పోయినట్లే అయింది. ఇంతకీ ఆడవాళ్లు అసాధ్యులని అనుకున్నాడు. ఆ పొట్లం అక్కరలేదని వాడి

చేతే ఒప్పించడం ఎంత కష్టం!—చిట్టిబాబు ముఖం వేపు చూచేడు. పొట్లాం ఇచ్చేసే డన్న మాటేగానీ, మనస్సు మనస్సులో లేదు. అప్పుడే ఆముదం త్రాగినవాడిలా ముఖం పెట్టేడు. ఏడవలేదు కానీ అంత కన్నా బాధ పడ్డాడు. "దాని దెంత కఠినహృదయం" అని అనంతం అనుకున్నాడు. ఆ కాస్తా తింటే ఏమయి పోతుందనో దాని భయం— అక్కడికి తన కన్నా దానికే వాడిమీద అభిమానం హెచ్చయినట్లు! తల్లి ఎంతో తెలివి తక్కువవాడిక్రింద జమ కట్టేసింది. ఏది తెచ్చినా అపథ్య వస్తువులే అని అంటుం దో వైద్యశిఖామణిలా. వైద్యం అంతా తనకే మహా తెలిసిపోయినట్లు కబుర్లు చెపుతుంది. ఆ విషయంలో అరుణను తల్చుకుంటే ఎంతయినా కోపం వస్తుం దనంతానికి.

మధ్యాహ్నమల్లా ఆఫీసుపనితో విసుగు చెందడం—ఆ తరువాత ప్రకృతిరమణీయతవల్ల హృదయప్రశాంతత చేకూరడం—ఇంటికి రాగానే పిల్లడు తను తెచ్చిన పొట్లాం పట్టుకొని ఎంతో ఆనందించడం—ఆ తరువాత జరిగిన తతంగంవల్ల ఏర్పడిన హృదయక్షోభ—అంతా అపోర్కపు మస్తుమంచు జల్లిన పండిలా తయారు చేసిం దనంతాన్ని!

మానవ జీవితంలో కష్టసుఖాలు కల్పన చేసే వివిధ పరిణామాలు ఎలా ఉంటాయా అని ఆలోచిద్దామనుకున్నాడు. ఎందుకొచ్చిన గొడవదంతా అని మళ్ళీ ఊరుకున్నాడు. అలా పార్కు వేపు షికారెళ్లి వస్తే కొంత హృదయప్రశాంతత ఏర్పడుతుం దేమో అని మరో బట్టలు కట్టుకొని వెళ్లడానికి ఉద్యుక్తు డయేడు. దూరంనుంచే చిట్టిబాబు చూచేడు బట్టలు మార్చుకోడం ఆ వైఖరి అంతా!

"నాన్నగారూ, నాకు తెలిసిందిలెండి" అన్నాడు.

"ఏమిటి?" అన్నా డనంతం

"మీ రెక్కడికో వెళుతున్నారని నాకు తెలిసిందిట!" అన్నాడు నవ్వుతూ.

"అమ్మ దొంగా... అప్పుడే గ్రహించేసేవ్!" అన్నా డాశ్చర్యంతో.

"ఊఁ... మరి నాకూ చొక్కా తొడగ రేమిటి?" అన్నాడు గునస్తూ.

"నీ కెందుకూ?"

"నన్ను తీసుకెళ్ల రేమిటి?... నిన్నా అంగేను! తీసికెళ్లమంటే దొంగవేషా లేసేవ." అన్నాడు మూలుగుతూ.

"అయితే అమ్మని తొడగమని చెప్పు."

ఆమాటను వంటింట్లోంచే విం దరుణ. ఓ చొక్కా తీసికొచ్చి తొడిగింది.

అక్కడికి పార్కు మహా ఉంటే నాలుగుఫర్లాంగులదూరంకంటే ఎక్కువ ఉండదు. అంబర్లవారింటి మలుపు తిరుగుతే నే బజారు. ఆ ప్రక్క సందులోకి వెళితే నే సత్యనారాయణస్వామి కోవెల. అక్కడే ఉంది పార్కు. బజారులో కొచ్చేసరికి చిట్టిబాబుకు చాలా మధురమయిన కోర్కెలు కలిగేయి.

"నాన్నా, ఆ పాడుతున్న దేమిటండీ?" అన్నాడు చిట్టిబాబు.

"రేడియోరా." అన్నా డనంతం.

అయితే అక్కడకెళ్లి మన్ని విననిస్తారూ?"

"ఎందుకు విననివ్వరూ?... అయితే నిం దామా?" అంటూ ఓ కాఫీహోటల్లోకి దూరే డనంతం. చిట్టిబాబుకు రేడియో పెట్టెని చూపెట్టేడు. అరె! అదేలా పాడుతున్నాదా? అని ఆశ్చర్యపోయేడు చిట్టిబాబు.

"ఏం కావాల." అన్నా డయ్యరు.

కాఫీహోటలు కొచ్చినతరువాత ఏమీ తినకుండా వెళ్లిపోడం ఎటికేట్ కాదేమో అని 'రెండు దోశె' అన్నా డనంతం. అరుణ జ్ఞాపకాని కొచ్చింది. గుండె గుభేలుమంది. దానికి తెలిసినట్లయితే ఓ పెద్ద రాద్ధాంతం జరక్క తప్పదు. ఎప్పుడో ఓ దోశ తిన్నంత మాత్రంలో ఏమంత ప్రమాదం లేదని డాక్టరు తనతో చెప్పేడు. అదీగాక బ్రహ్మాండమయినంత పథ్యం ఏమంతగా అవసరం లేదు. వాతంచేసే పదార్థా లేమీ తినకూడదని చెప్పేడు, అంతే!...అమాటికే గోలచేసేస్తుంది పథ్యమో, పథ్యమో, అని. ఇంతకీ అది దాని తప్పు కాదు. పిల్లడిమీద గల వాత్సల్యతచేత, పైగా అమాయకత్వం, అజ్ఞానత్వంవల్లా అలా అంటుంది. అంతే!...ఇక తనకిమాత్రం పిల్లడంటే అభిమానం లేదూ? కొర్కుండి ప్రాణం తియ్యడానికి తనేం హంతకు డనుకుందా?........

చిన్నప్పటినుంచీ, చిరుతిళ్లు తింటుండడ మనే దనంతాని కో అలవాటు. ఇక పిల్లలెవరయినా తన

దగ్గర చనువుగా ఉంటే, వాళ్లను చిరుతిళ్లతో నింపేస్తూ ఉండేవాడు. చిట్టిబాబు పుట్టకముందు పొరిగింటి 'ఎకౌంటెంటు' గారబ్బాయిని ఎంతగా ఎత్తుకొని మోసేడో చెప్పలేము. వాడినుంచి చిరుతిళ్లకై బోలెడు డబ్బు ఖర్చుచేసేడు. అదేమిటో చిన్నపిల్లలంటే ఓ వెర్రిఅభిమానం అనంతానికి. అది అతని కో సహజలక్షణం అనుకోవచ్చు. కన్న కొడుకును సంతోషపెట్టలేకపోతున్నాను కదా అని అనంతం ఎంతేనా బాధపడేవాడు. అరుణకు దడిసి చిరుతిళ్లు కొనడం చాలావరకూ తగ్గించేసేడు. కానీ ఎంత ప్రయత్నించినా పూర్తిగా మానేయలేకపోయేడు. అక్కడే ఆ భార్యాభర్తలిద్దరికీ పేచీ వచ్చేది. ఓమారు ఓ రెండు రోజుల పర్యంతం మాటలు మానుకోడంకూడా జరిగింది. వారివారి ఆదర్శాల, అభిప్రాయాల అంతరార్థాన్ని గ్రహించలేకపోయేరిద్దరూ!

మానవజీవితంలో ఆదర్శాల అంతరార్థం అపార్థకల్పన జేస్తుంది. ఒక్కొక్కప్పుడు అనేకప్రమాదాలు కూడా సంభవించవచ్చు!

"ఇంకేం కావాల" అన్నాడయ్యారు. పరాకుగా ఉండడంచేత త్రుళ్లిపడ్డాడనంతం. "బిల్లిచ్చేయ్." అన్నాడు......

పార్కుకు వెళదామనుకున్నాడేగానీ, చిట్టిబాబు ఇంటికెళిపోదాం, అని అనడంచేత ఇంటిముఖం పట్టాల్సొచ్చింది.

"అయితే, మనకీ ఓ రేడియో కొనకూడదటండీ? అని మధ్యదారిలో అడిగేడు చిట్టిబాబు.

"ఓ! తప్పకుండా కొంటాను......మరి మనం ఇలా తిన్నామని అమ్మతో చెప్పకుమీ !" అన్నాడనంతం.

"ఊహుఁ....చెప్పను. చెప్తే అమ్మ దెబ్బలాడుతుంది. అన్నట్లు నా పొట్లాం దాచేసింది. నా జబ్బు పోయేక ఇస్తుందట."

"దానికేం తెలీదురా. వట్టి తెలివితక్కువది—అయితే, మీ అమ్మ మంచిదా? నేను మంచివాడినా?" సమాధానం ఎలా వస్తుందా అని ఆతృతతో చిట్టిబాబుముఖంవేపు చూచేడు.

"ఇద్దరూ మంచివాళ్లే!......మరయితే నాకు రేడియో కొంటారు కదూ?"

"ఊఁ." అన్న తండ్రిసమాధానంమీద ఆట్టే నమ్మకం లేకపోయింది చిట్టిబాబుకి. ఒకవేళ రేడియో కొంటే, ఎలాఎలా కాలక్షేపం చేస్తాడో అనే విషయాన్నిగురించి ఊహాచిత్రాలను చిత్రించుకున్నాడు చిట్టిబాబు.

సరాసరి ఇంటికే వచ్చేసేడనంతం. ఇంట్లోకి వెళ్లీవెళ్లడంతోనే, "అమ్మా, ఇప్పుడు మేం రేడియో విన్నాం!......ఎంత బాగా పాడిందనుకున్నావ్! నాన్నగారు నాకూ ఓటి కొంటామని చెప్పేరు తెలుసా?" అన్నాడు చిట్టిబాబు.

"ఆ! అలాగా...బాగా పాడిందా? ఎక్కడ విన్నావు నాన్నా." అంటూ చిట్టిబాబు నెత్తుకుంది అరుణ.

"మరేం, మరేం, కాఫీహోటల్లోనే!" అన్నాడు చిట్టిబాబు.

గదిలోంచి విన్నాడనంతం. "పోరా వెధవా. సగవబద్ధాలూ నువ్వూనూ. పార్కులోకదూ విన్నాం?" అన్నాడు.

"మధ్యని వాడూ అబద్ధాల వెధవ!...చాలా బాగుంది. అబద్ధాలు చెప్పించడంలోకూడా ప్రావీణ్యతుందన్నమాట!......ఓమారు చెపితే అర్థం చేసుకోవాలి. బుద్ధి లేకుండా ప్రవర్తిస్తే......" మధ్యలోనే ఆపేసిందా వాక్యాన్ని.

"పూర్తి చెయ్యి వాక్యాన్ని......అలాంటి వాళ్ళని పశువులని కదూ అంటావు? ఒళ్లు తెల్సుకోని మాట్లాడు. ఇకనుంచీ వాడి ఊసు నాకవసరం లేదు." కోపంతోనే అన్నాడా మాటల్ని.

కన్నీటిబిందువులను కార్చింది. మరేమీ మాట్లాడలేదు. అరుణచెక్కిలిపైనుండి కారే కన్నీటిని చూచేడనంతం. కళ్లు మూసుకున్నాడు. గదిలోకి వెళ్లిపోయేడు. మంచంమీద బోర్లా పడుకున్నాడు. ఎన్నో ఆలోచనలు మనస్సును కదిపేయి. అరుణకు బుద్ధి వచ్చేలాగ చెయ్యాలంటే మార్గం? అర్ధరాత్రివేళ లేచి, ఆ బుద్ధుడిలాగ ఎక్కడికయినా సన్యసించడానికి వెళిపోతేనో!......ఛీ! వెధవాలోచన అనుకున్నాడు. ఎందుకొచ్చిన ఆలోచనలని వాటి కక్కడితో స్వస్తి చెపుదామని ప్రయత్నంచేసేడు.

ఆ ప్రయత్నం, క్రమంగా నిద్రపట్టడానికి మార్గం అయింది.

ఎన్నో పీడకలలొచ్చేయి. ఎప్పుడూ అలాంటి కలలు రాలేదు. చిట్టిబాబు చచ్చిపోయినట్లు—అరుణకు పిచ్చెత్తిపోయినట్లు— ఈరకంగా ఎంతో భయంకరమయిన కల వచ్చింది. ఆ కలంతా నిజమే అనుకొని అతిభయంతో గబుక్కున లేచి కూర్చున్నాడు. 'ఎంత పీడకల' అని అనుకున్నాడు. ఎదురుగుండా మంచంమీద చిట్టిబాబును పడుకోబెట్టి, ప్రక్కనే మంచానికి ఆనుకొని తల మోకాళ్ళ మీద ఆనించి కూర్చుంది అరుణ. ఆ దృశ్యాన్ని చూచినతోనే మళ్లీ కల జ్ఞాపకానికొచ్చింది. అచ్చు కలలో కూడా అలాగే చిట్టిబాబు శవం ప్రక్కనే ఏడుస్తూ కూర్చుంది అరుణ. ఆ దృశ్యాన్ని చూడలేకపోయేడు. అతని హృదయం కొట్టుకుంది......

—"అలాగేం అలా కూర్చున్నావు?" అన్నాడనంతం ఆదరంతో.

"మీరు భోజనానికి మడికట్టుకోరూ?" అన్నాది నిలబడుతూ.

తనన్నం తినకుండానే పడుకున్నానన్న సంగతి అప్పుడు తెలుసుకున్నాడు అనంతం. గోడ మీద ఉన్న గడియారం తనవేపు చూసి నవ్వినట్టయింది. 'నీ గుండెకాయ ఆగిపోవాలిగానీ, నే నాగను' అంటున్నాదా అది!...పన్నెండుగంటల రాత్రయిందప్పుడు. "నువ్వింకా అన్నం తినలేదూ?" అన్నాడు.

"మడి కట్టుకోండి." అని మళ్ళీ అంది.

"ఊహుఁ...మరిప్పుడు నే నన్నం తినను." అన్నాడనంతం.

చిట్టిబాబు ప్రక్కనే పడుకొంది కళ్లు మూసుకొని. అనంతంకూడా పడుకున్నాడు. మళ్ళీ అదే కల!—లేచి కూర్చున్నాడు. ఎదురుగుండా ఉన్న మంచంవేపు చూచేడు. అరుణ ఇంకా మేలుకొనే ఉంది.

"ఏం ఆకలేస్తున్నదా?" అని అంది అరుణ లేచి కూర్చొని.

"లేదు." అన్నాడనంతం.

"ఔను...వెయ్యదు. వెయ్యదనికూడా నాకు బాగా తెలుసు."

"ఏం!......"

"..............."

"పోనీ నువ్వు తిన్నావా?"

"..............."

"సరేలే, అన్నం పెట్టు. నువ్వుకూడా నాతో కలసి తినాలి."

"ఆకలెయ్యలేదుగా! ......మరెందుకిప్పుడు పడుకోండి."అంది.

అనంతానికెంతేనా కోపం వచ్చింది. తను తింటానన్నప్పుడు అలా అంటుందేమా అని. కాని ఏమనగలడు?.... మళ్ళీ పడుకున్నాడు. అతి కష్టంమీద ఆరాత్రి గడిపేడు.

* * * * *

ఆ మర్నాటినుంచీ అనంతంలో గొప్ప మార్పు వచ్చింది. చిట్టిబాబుకు చిరుతిళ్లు ఇవ్వడంలేదు సరి కదా, అసలు ఎత్తుకోడంకూడా మానీసేడు. అరుణ మీద కోపంచేతే, చిట్టిబాబువిషయంలో జోక్యం కలిగించుకోడమే మానీసేడు. వాళ్లిద్దరిమధ్యా కలిగిన అపార్థం, చిట్టిబాబుమీద బ్రహ్మాస్త్రంలా పనిచేసింది. అసలు పగటివేళ భోజనసమయంలో తప్ప తక్కినవేళల్లో ఇంటిదగ్గర ఉండేవాడే కాడు. రాత్రిళ్ళయినా, పన్నెండుగంటలవరకూ ఏ సినిమా హాలులోనో, లేక మరెక్కడో కాలక్షేపం చేసి ఇంటికి వస్తూ ఉండేవాడు.

తనమీద కోపం రావడంచేతే భర్త అలా ప్రవర్తిస్తున్నాడని అరుణకు తెలుసు. భర్తకు కోపం రావడంకూడా మంచిదనే అని అనుకుంది. చిట్టిబాబును పథ్యంగా ఉంచుతున్నదరుణ.

"అమ్మా, నాన్నగారు మునపటిలా నన్నెక్కడికీ తీసుకెళ్లకుండా ఉన్నారేమిటే?" అని చిట్టిబాబు ప్రతీరోజూ అడగడమే.

"నీ జబ్బు తగ్గిపోతే తీసుకెళతారు నాయనా!" అంది అరుణ.

"పోనీ, ఎత్తుకుంటే జబ్బెక్కువవుతుందేమిటే?!" ఎంతో దుఃఖంతో అన్నాడు చిట్టిబాబు. తల్లి చెప్పే సమాధానాలతో సంతృప్తి చెందలేకపోయేడు చిట్టిబాబు. ఏదో బెంగ పట్టుకుందా అమాయకుడికి.

కాలప్రవాహం ప్రవహిస్తున్నది. విధి దేవత ఎదురు తిరిగింది!......జబ్బు రోజురోజుకీ ఎక్కువవటం మొదలుపెట్టింది. అరుణహృదయంలో విషాద రేఖలు ప్రత్యక్షమయేయి. తను ఎంతో పథ్యంగా ఉంచినప్పటికీ తగ్గలేదాజబ్బు! "ఇప్పుడేమంటావు?" అని భర్త అడుగుతే తను చెప్పగలిగే సమాధానం ఏమిటి? ఆకాశంమీద అలుపడే మబ్బులవేపు చూచింది. చుట్టూ కమ్ముకొస్తున్నాయి కారుమేఘాలు. తన జీవితాన్నే కప్పేస్తాయా అవి?...ఆమె కళ్లు చెమ్మగిల్లేయి.

ఉత్తరదిక్కునుండి, దక్షిణదిక్కుకు వీచిందో పెనుగాలి. చెలరేగిందో తుపాను. ఆ తుపానులో అదృశ్యమయేడు చిట్టిబాబు.

"నేనే కదూ హంతకుణ్ణి?" అన్నాడనంతం.

"ముమ్మాటికీ మీరే! నామీద....కోపం.... వాడిమీద...ప్రయోగించేరు.... ఆ...జెంగచేతే... వాడు..." దుఃఖంలో మరి మాట్లాడలేకపోయిందరుణ.

"నిజమే నేమో!" అని అనంతం అనుకున్నాడు. కన్నీరు మడుగుకట్టింది. అదంతా ఆవిరయింది. కారుమేఘాలక్రింద రూపొందింది. మేఘాలను చూస్తే లిన కిదివరకుండే ఆనందం ఆనాడు లేదు. కన్నీరువర్షంలో స్నానం చేసేడు!!

'చిట్టిబాబు' యొక్క జ్ఞాపకార్థంగా, బాబు కోరినటువంటి రేడియో కొన్నారు. ఆ దంపతులిద్దరికీ అందులోంచి వినిపించేది విషాదగీతాలే! 'మరి పిల్లలొద్దు' అనుకున్నారు. కానీ.........

---

# ఈ బ్రతుకు

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

మేటి కొండల్లు
గుండె యులిప్పగా
ఏటిదరి క్రొ
న్నేటి రవళులు
చివురు పాటల
పిట్టల మురువులు
మొరయు నీ ఎడద!

కడలి లోతుల
నడలు కోరిక
ఉడుగణంబుల
మెరయు రవళిక
అలల యోలల
సొలయు విరికత
మలయు నీ గొంతు!

పేదవాని ఎ
డారి మూలుగు
మరలొ మర కా
ర్మికుని ఎలుగును
దారి తప్పిన
బుడుత బెదరిన
ఎడదె ఈ బ్రతుకు!

---

# రాజ్యపాలనము: కౌటిల్యనీతి

## శ్రీ జె. కిరీటిరావు

స్వతంత్రభారత రాజ్యాంగ విధానమును రాజ్యాంగ పరిషత్తువారు రెండు సంవత్సరములు చర్చించి తయారుచేసిరి. అది పాశ్చాత్య దేశాల రాజ్యసూత్రముల అనుకరణమే గాని భారత సాంప్రదాయములను, హిందూ ధర్మశాస్త్రములను ఆధారము చేసుకొని వ్రాసినది కాదని ఒక విమర్శ గలదు. ప్రభుత్వమునకు ప్రజల కుండవలసిన సంబంధము, ప్రజాపాలనము ఎట్లుండవలెను, ప్రాచీనకాలమున భారతదేశమున పరిపాలనావిధానము ఎట్లుండెను, అను విషయము తెలిసికొనుటకు కౌటిల్యుని అర్థశాస్త్రమే ముఖ్యాధారము. ఇందు కేవలము ఆర్థిక విషయములే గాక, దేశపరిపాలనా విధానమంతయును సవిస్తరముగ చర్చింపబడినది.

క్రీస్తు పూర్వము సుమారు 300 సంవత్సరముల క్రిందట, అనగా రమారమి రెండువేల ఏండ్ల క్రిందట చంద్రగుప్త మహారాజునకు మంత్రిగానున్న చాణక్యుడను బ్రాహ్మణోత్తముడు యీ శాస్త్రమును రచించినట్లు చరిత్ర తెల్పుచున్నది. విష్ణుగుప్తుడు, చాణక్యుడు, కౌటిల్యుడు యీ మూడు పేర్లు అతనివే. కౌటిల్య నీతి లేక చాణక్య నీతినిగూర్చి అనేక ప్రాచీన సంస్కృత గ్రంథములందు పేర్కొనబడినను, అతడు రచించిన వ్రాతప్రతి చిరకాలముగా లభించలేదు. మైసూరు ప్రభుత్వమున ఆర్. శ్యామశాస్త్రి యను పండితుడు తంజావూరుజిల్లాలో నొక సంస్కృతప్రతిని సంపాదించి, దాన్ని ఆంగ్లమున కనువదించి ప్రచురించుటతో, యీ శాస్త్రమునకు ప్రపంచఖ్యాతి వచ్చెను. తదుపరి జర్మనుపండితులు, తదితరులు దీని నాధారము చేసుకొని ప్రాచీనకాలపు హిందూదేశ నాగరికత, రాజనీతి శాస్త్రములగూర్చి తర్జనభర్జనలు చేయసాగిరి. ఈ శాస్త్రము రచించిన కాలమునుగూర్చి భిన్నాభిప్రాయము లున్నను, క్రీస్తునకు పూర్వము సుమారు 300 సంవత్సరముల క్రిందట రచింపబడినదనియు, కౌటిల్యుడే దీనిని రచించెనని ఆ గ్రంథములోని శ్లోకములే రుజువు చేసినవి. ఈ అర్థశాస్త్రమును శ్రీమామిడిపూడి వెంకటరంగయ్యగారు, ఆకొండి వెంకటశాస్త్రిగారులు తెలుగులో వ్రాసిరి. కౌటిల్యునికిపూర్వ మనేక రాజనీతిశాస్త్రము లుండినట్లు అతను పేర్కొనెను. కాని అవి నామమాత్రముగనే మిగిలినవి. రాజ్యాంగ తంత్రమునుగురించి మన పూర్వులుచేసిన సిద్ధాంతముల పతనమునకు కౌటిల్యుని అర్థశాస్త్రమే ప్రధానమగు ఆధారము. కౌటిల్యుడు ఆతని పూర్వులగు అర్థశాస్త్రకారుల వాదము లనేకముల ఖండించియు, కొన్నిటిని పోషించియున్నాడు.

ప్రభుత్వమునకు దండనాధికారము ప్రధాన లక్షణము. ఇది ఒక్క పురుషునియెడలనే సంక్రమించినయెడల ఏకనాయకమని (నేటికాలపు మోనార్కీ - *Monarchy*), అనేకులయందు యీ అధికారము సంక్రమించినయెడల బహునాయకమని (*Oligarchy*)యు ప్రజలయందుగాని ప్రజాప్రతినిధులయందుగాని సంక్రమించినయెడల ప్రజానాయకము (*Democracy*) అనియు, ప్రభుత్వాలను శాస్త్రకారులు మూడు రకములుగ విభజించియున్నారు. ఏకనాయకము, బహునాయకము ఆ కాలమున ఉండినట్లు కౌటిల్యుని అర్థశాస్త్రమువల్ల తెలియుచున్నది. కాని ప్రజాప్రతినిధి ప్రభుత్వము పేర్కొనబడలేదు. అయినా, కౌటిల్యుడు విధించిన రాజనీతి సూత్రములు వివరించిన రాజవిధులు, పన్నుల వసూలు విధానము, ఉద్యోగశ్రేణి, సైనిక సమీకరణము, మంత్రుల విధులు, రాజశాసనముల తీరు అన్నియు పరిశీలించినచో, ఆ కాలమున ప్రజాప్రతినిధులు గల శాసనసభలు లేకపోయినా, నేటి బ్రిటిషు రాజ్యాంగ విధానమునకు పరిసమానముగ నుండు పరిమితాధికారము గల రాజుపాలనమే యుండెనని తెలుస్తుంది

ప్రభువు శాసనబద్ధులు కాక తన కిష్టము వచ్చిన శాసనముల నిర్మించి పరిపాలనము జరుపుచుండిన యెడల వారి ప్రభుత్వము నిరంకుశమయినదని చెప్పదగియుండును. ఇట్లు కాకపోవుటచేతనే అమెరికాలోని ప్రభుత్వము నిరంకుశముకాదని మన మనుకొనుచుందుము. ఆ రాష్ట్రములలోగూడ శాసనముల నిర్మించు శాసనసభలు, వాని నమలులోనుంచు కార్యనిర్వాహక శాఖవారు, వానిని సమన్వయించు న్యాయాధికారులు కలరు.

(౧) ఇంగ్లాండులో పార్లమెంటుసభయే శాసనములనిన అట్టి శాసనములనిర్మించు అధికారము కలిగియున్నది. పార్లమెంటు సభ్యు లందరు ప్రజాప్రతినిధులు, ప్రజాభిప్రాయములబట్టి ప్రవర్తింతురు. కావున ప్రజలకు విరుద్ధమగుశాసనములెన్నటికి అమలులోనికి రాజాలవు. కావున ఆ దేశమందు ప్రజలు, ప్రభుత్వము అను భేదము విస్తారముగా లేదు

పై రెండు లక్షణములలో నేదియున్నను ప్రభుత్వము నిరంకుశము కాకుండును.

మొదటి లక్షణము పూర్వకాలపు భారతీయ ప్రభుత్వములలో నుండినట్లు కౌటిల్యుని యీ దిగువ సూత్రములబట్టి చెప్పవచ్చును. ఇష్టము వచ్చిన శాసనమును చేయుటకు రాజునకు అధికారము లేదు. అతని శాసనము లెల్లప్పుడు ధర్మశాస్త్రము ననుసరించి యుండెడివి. అనగా అతడు శాస్త్రబద్ధుడై యుండెడివాడు. "ప్రభువు— ప్రజలను స్వధర్మమునుండి వ్యభిచరింపకుండ చేయువాడు. స్వధర్మపరిపాలకుడును, ఆర్యమర్యాదావ్యవస్థాపకుడును, వర్ణాశ్రమస్థితి కర్తయు నగు రాజు ఇహపర సౌఖ్యముల పొందుచున్నాడు." అని కౌటిల్యుడు వ్రాసెను.

న్యాయస్థానములందు తీర్పులు చెప్పవలసి వచ్చినపుడు న్యాయాధికారులు దేశాచారమునుబట్టి వెళ్లువారేగాని రాజుశాసనమునుబట్టి కాదు.

కౌటిల్యుని గ్రంథమునందు శాసనాధికారమను ప్రకరణ మొకటి కలదు. దానిలోని విషయముల విమర్శించినయెడల రాజశాసనలక్షణము లేవియో స్పష్టమగును.

కార్యనిర్వహణమునందు మాత్రము ఆకాలపు రాజులు నిరంకుశులై యుండిరి. వారికి సలహానిచ్చు మంత్రులు, సమాహర్త, సన్నిధాత, మున్నగు ప్రధానోద్యోగస్థులు, అధ్యక్షాది సామాన్యాధికారులు— మున్నగు ఉద్యోగస్థులు రాజాజ్ఞాబద్ధులు గాని, ప్రజాభిప్రాయము ననుసరించువారు కారు.

సామ్రాజ్య పరిపాలనమందు స్వయముగ సమస్త కార్యములను నిర్వహించుటకు ప్రభువునకు వీలుండదు. రాజులు సచివుల నిడుకొని వారి మతము ననుసరించి ప్రవర్తింపవలెను. ఈవిధముగ రాజునకు సహాయము చేయుచున్నవా రందరికి అమాత్యులను పేరుండెను. సామాన్యముగా అమాత్యపదమును మంత్రిపదమునకు పర్యాయపదముగ మనము వాడుచుందుము. కాని కౌటిల్యుని గ్రంథమందు దాని కిట్టి యర్థము లేదు. ప్రతి రాజసేవకుడు అమాత్యుడనియే పిలవబడుచుండెను. అమాత్యులలో కొందరు అధ్యక్షులుగను, కొందరు సమాహర్త్రాది ప్రధానోద్యోగులుగను, మరికొందరు మంత్రిపరిషత్సభ్యులుగను తక్కినవారు మంత్రులుగను నియమింపబడుచుండిరి. అమాత్యులందరిలో మంత్రులు ప్రధానులైయుండిరి. వారితో నాలోచించియే రాజశాసనములు పంపువారు. మంత్రులు సాధారణముగ నెల్లప్పుడు ప్రభువు సముఖమున నుండువారు. ఆ కారణముచేతనే వారికి దుర్గమందు ప్రత్యేకముగా బస లేర్పాటు గావింపబడి యుండెను.

మంత్రులుగాక మంత్రిపరిషత్తను పేర మరొక ప్రత్యేకసభ యుండెను. ఇందులో సభ్యులసంఖ్య పరిమితము కాదు. దీనిలోని సభ్యులు పరగణాలలోని ఉద్యోగస్థులు. వారి కార్యములు చక్కగ నెరవేర్చుచున్నారో లేదో కనుగొనుచు తాము చూచినట్టియు, వినినట్టియు విషయములను ప్రభువుకు తెలియజేయుచుండువారు. కొన్ని సమయములందు ప్రభువు మంత్రులను, మంత్రి పరిషత్సభ్యులను కూడ కలిపి సభచేయువాడు. అప్పు డధికసంఖ్యాకు లెట్లు చెప్పిన అట్లు నడుచుకొనుట ఆచారము—అని కౌటిల్యుడు వ్రాసెను. దీనినిబట్టి నేటి మన డెమాక్రసీపద్ధతిలో నున్న మెజారిటీపరిపాలనాసిద్ధాంతము అపుడు అమలునం దుండెనని గ్రహింపవచ్చును.

పరిపాలనాప్రధానమునందు కార్యాలోచనకంటె కార్యనిర్వహణము ప్రధాన మయినది. కౌటిల్యుని కాలమునందు రాజకార్యనిర్వాహకులలో … గురు ప్రధానోద్యోగు లుండెడివారు. రాజసమక్షమునుండి రాజ్యమంతటిపై అధికారము వహించువారు మొదటివర్గము ఉద్యోగులు. వీరిని *Central Executive* శాఖగ నెంచవచ్చును. సామ్రాజ్యములో ఒక్కొక్క రాష్ట్రముపై అధికారము చెల్లించుచుండినవారు కొందరు. వీరు *Provincial Executive.* వీరుగాక మూడవ వర్గము గలదు... రాష్ట్రములోని గ్రామాలన్నింటిమీదను, గ్రామసముదాయముల మీదను అధికారము వహించినవారు, వీరు.

మొదటితరగతిలో మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు, దౌవారికుడు, అంతర్వంశికుడు, ప్రశాస్త, సమాహర్త, సన్నిధాత, ప్రదేష్ట, నాయకుడు, పౌరవ్యవహారికుడు, కార్మాంతికుడు, మంత్రిపరిషదధ్యక్షుడు, దండపాలుడు, దుర్గపాలకుడు, అంతపాలుడు, ఆటవికుడు అను పద్దెనమండుగురు ఉద్యోగస్థు లుండిరి. వీరిలో సమాహర్తఉద్యోగము గొప్పప్రాధాన్యముతో కూడినది. ఇతనికి కోశసంగ్రహణపరిశోధకాధికారము గలదు. దుర్గ రాష్ట్ర ఖనిజ సేతు వన వ్రజ వణిక్పథములను మంచిస్థితియం దుంచి, ఆదాయమువృద్ధి చేసి వ్యయము తగ్గించి, ఆదాయముజేయుట యితని విధి. పైన తెల్పిన ఏడు మార్గములనుండి రాజునకు రావలసిన ఆదాయమును సుకరముగా వసూలుచేయుటకై అతడు దేశమును నాల్గుభాగములుగ విభజించి, ఒక్కొక్క భాగమునకు అనేక గ్రామముల సముదాయములుగ విభజించి, వానిపై తగిన ఉద్యోగస్థులను నియమించును. ఐదు లేక పది గ్రామములకు సంబంధించిన

లెక్కలనన్నిటిని తయారుచేసి పన్నుల వసూలు చేయుటయందు సమాహర్తకు తోడు గోపుడను ఉద్యోగిని నియమించెడివారు. గోపునిపై స్థానికుడను మండలాధికారి, స్థానికులపై ప్రదేష్ట అను అధికారియు నుండెను. ప్రదేష్టలు రాష్ట్రములందు సంచారము చేసి దిగువ ఉద్యోగులయొక్క పనులను విచారించుచుండువారు. ఉద్యోగు లెవ్వరు తప్పులు చేసినను తెలిసికొని సమాహర్తకు తెలుపుటకు గూఢచారులనేకు లుండెడివారు. క్రమముతప్పక అధికారులు వారి కార్యములను నెరవేర్చుచుండుటకై అవసరమగు ఏర్పాటులన్నియు చేసియుండిరి. ప్రజలయొక్క శ్రేయముగాని, గౌరవముగాని పాటించక, అన్యాయముగ ప్రజలను పీడించి రాజాదాయమును ద్విగుణపరచినవారిని, స్వలాభమును కోరి రాజద్రవ్యమునకు నష్టముల కలిగించినవారినిగూడ కఠినముగ శిక్షించుచుండిరి. పెద్ద ఉద్యోగుల అజాగ్రత్తవలన ప్రజలకు నష్టము సంభవించినపుడు ఆ నష్టమును వారే భరింపవలసియుండెను. న్యాయస్థానమందు న్యాయమును తీర్పుచేయు న్యాయాధికారులు సహితముకార్యము నందెట్టి పొరపాటు చేసినను కఠినశిక్షలకు పాత్రులగుచుండిరి.

ఉద్యోగుల జీతాలు తక్కువగుటచేతనే వారు లంచాలు తీసుకొని ప్రజలను పీడింతురను అభిప్రాయము యిపుడు ప్రబలినట్లే అపుడును ప్రబలియుండెను. అందుచే కౌటిల్యుని అర్థశాస్త్రములో ఉద్యోగుల జీతములు వారివారి మర్యాదలకు తగిన ట్లుండెను. జీతములనుబట్టి ఉద్యోగులు పదకొండు తరగతులుగా విభజింపబడిరి. ఉత్తములకు సంవత్సరమునకు ౪౮,౦౦౦ పణములు. అధములకు ౬౦ పణములు—పణమనునది అప్పటి వెండినాణెము దూతలు లోనగు వారికి వేతనము, సంవత్సరమున కింత యని గాక, వారి పనులనుబట్టి నిర్ణయింపబడుచుండెను. నేటి బోనసులు అలవెన్సులవలె ఉద్యోగుల యింట్లలో వ్యాధిప్రసూతికాది కృత్యములు వచ్చినపుడు ప్రత్యేక ధనసహాయము, నేటి పింఛనులు, *Gratuity* గ్రాట్యుటీలవలె, ప్రభుకార్యములు చేయుచు మృతినొందిన వారి దారపుత్రులకు భుక్తి వేతనము లుండెను. అపుడు బిరుదు బహుమానములుగూడ నుండెను. భృత్యులందరి విద్యాకర్మలను బట్టి జీతము లధికముచేయు ఆచారముకూడ నుండెను. కొందరికి జీతములే కాక భూములుకూడ నిచ్చుచుండిరి. ఇన్ని సదుపాయము లుండుట చేత ఉద్యోగులందరు సంతృప్తి చెంది వారి పనులను మెలకువతో చేయుచుండెడివారు.

ఇక గ్రామపాలన మెట్లుండెనో చూతము :

రాజ్యమందు జనపదము, నగరమును రెండు విభాగము లుండెను. గ్రామములతో గూడిన భాగము జనపదము. పట్టణములతో గూడినది నగరము. పరిపాలనాసౌకర్యమునకై జనపదము నాల్గు భాగములుగ విభజింపబడెను. ఒక్కొక్క భాగములోని గ్రామములను ప్రభువుతో వానికి గల సంబంధమునుబట్టి నాలుగు రకములుగ విభాగము చేసియుండిరి. కొన్ని గ్రామములు పన్నులు చెల్లింపనక్కరలేనివి, పరిహారకము లనబడెను. కొన్ని అంటే నగదుగా పన్ను యియ్యగలవి యాయుధీయములు. కొన్ని ధాన్య పశు హిరణ్యరూపములగు పన్నులు చెల్లించునవి. కొన్ని పన్నులకుబదులు దొరతనమువారికి వలసినకూలిపనులు చేయునట్టివి. నూరు యిండ్లకు తక్కువ గాక ౫౦౦ లకు ఎక్కువగాక ఉండు గ్రామము ఉత్తమగ్రామముగ నెంచబడెను. గ్రామపరిపాలనము గ్రామాధ్యక్షుని వశమందుండెను. ఇతడే రాజప్రతినిధియై అల్లరులేమి జరుగకుండ, గ్రామవృద్ధుల సహాయముతో చూచుచుండెను. చోరులను జారులను గ్రామము నుండి తొలగించుట కితనికి అధికారము గలదు. గ్రామాధ్యక్షుడు అధికారదుర్వినియోగము చేసినచో అతని గ్రామమునుండి తొలగించెడివారు. గ్రామపాలనకు గ్రామవృద్ధులతో చేరిన పంచాయతీ యుండెడిది. వీరు దేవస్థానముల ఆస్తులను, మైనరుల ఆస్తులను స్వయంగా చూస్తూ వృద్ధి పొందించుట, తగవులు పరిష్కరించుట, సేతువులు కట్టుట, దేవాలయముల నిర్వహించుట, మున్నగు పనులు గ్రామమంతకు ఉపయుక్తమైనవి చేయు అధికారము కలిగియుండిరి. ౫ లేక ౧౦ గ్రామములకు గోపుడను అధికారి యుండెను. ఇతడు గ్రామకరణమువలె లెక్కలు తయారుచేయుటకు *Income Tax* కలక్టరు అధికారము కలిగి, గ్రామస్థులందరి ఆదాయ వ్యయములు నిర్ణయించుట, సర్వే ఉద్యోగులవలె భూమిలెక్కల నుంచుట, జనాభా లెక్కలు సిద్ధపరచుట, రిజిస్ట్రారువలె దానవిక్రయములయొక్క నిబంధనలు చేయుట మున్నగు పనులు చేయును. ప్రజలయొక్క ఆర్థిక సాంఘిక స్థితిగతుల యథార్థత తెలిసికొను స్టాటిస్టికలు ఉద్యోగిగూడ యితడే. గోపుల రికార్డులనుబట్టి మండలాధ్యక్షుడు సమస్తవిషయములకు సంబంధించిన నిబంధన పుస్తకములు తయారుచేయుచుండును. ఈ కాలము లోవలె పదేండ్ల కొకసారి జనాభా లెక్కలు తీయడం, కరువు వచ్చినపుడు అర్థశాస్త్రప్రవీణులను లెక్కలు తయారీకి నియమించుట గాక, ఎప్పటికప్పుడు యీ లెక్కలు తయారుచేసే యేర్పాటు అపు డుండెను.

నగరముల పరిపాలనవిషయమునకూడ ఆకాలమున చేయబడిన యేర్పాటులు బహు ప్రశంసనీయముగ నుండెను. ప్రతి పట్టణము ఒక పద్ధతిని అనుసరించి నిర్మింపబడుచుండెను. పట్టణములోపల విశాలములగు మార్గములు సమృద్ధములగు జలాధారములు, వృత్తి జాతి కులముల ననుసరించి యేర్పరుపబడిన నివాసప్రదేశములోనగునవి అమర్చబడి యుండెను. పరిపాలనా సౌకర్యమునకై ప్రతి పట్టణము నాలుగు భాగములుగ విభజింపబడి ఒక్కొక్క భాగము ఒక స్థానికుని అధీనమునందుండెను. అదేవిధముగ ప్రతి చతుర్థభాగములోని ౨౦ లేక ౪౦ కుటుంబముల వ్యవహారమును చూచుట కొక గోపు డుండెను. నగరమంతటిని పాలించుటకు నాగరికుడను అధికారి యుండెను. గ్రామములందు గోపుడు చేయు పనులే నగరములోని గోపులుకూడ చేయువారు. నగరవాసుల క్షేమమునకును, ఆరోగ్యమునకును ప్రస్తుతకాలమందు మునిసిపాలిటీవా రొనరించు కార్యముల నన్నింటిని ఆ కాలమున నాగరికుడు చేయుచుండువాడు. నగరములోని విదేశవస్తువుల రాకపోకలకు గల కారణములను తెలిసికొని వారిమూలమున రాజునకు గాని రాష్ట్రమునకు గాని ప్రమాదము రాకుండ చూచుట, మార్గములను వీధులను శుభ్రముగ నుంచుట, అగ్ని ఉదకబాధల వలన ప్రజలు నష్టముపొందకుండ చూచుట, రాత్రికాలమందు దుర్మార్గులు ప్రజలను బాధించకుండ వారిని బంధించుట, మున్నగు పనులు నాగరికుడు చేయుచుండెను. ఇదిగాక నగరములోని బంధనాగారములు రక్షకస్థానములు మున్నగువానిని ఇతడే చక్కబెట్టుచుండెను. ప్రజ లెన్నికొన్న మునిసిపలుసంఘాలు లేకున్నా, నగరపాలనమందు ఏ యే విషయములు ముఖ్యమో అవన్నీ నాగరికుడే సర్వాధికారముతో చక్కజూచుచుండెను.

అప్పటి కాలపు పాలకులు శూన్యప్రదేశములందు గ్రామములు నిర్మించి నేటి వలసలవలె వాటిని అభివృద్ధికి తెచ్చుచుండిరనికూడ కౌటిల్యుని అర్థశాస్త్రమునందు పేర్కొనబడెను.

రైతులవద్దనుండి రాజులు భూమిశిస్తు, పంటలో 1/4 వంతు, నీటితీరువ 1/5 వంతు తీసుకునేవారు. నేటి సేల్సుటాక్సువలె ఆనాడు వస్తువిక్రయంపన్ను లేకపోయినా, రైతులు విక్రయించవలసిన సరకు నగరం టోలుగేటువద్దకు వచ్చి విక్రయించాలని నిబంధన గలదు. విక్రయమయిన తరువాతనే గేటువద్ద పన్ను పుచ్చుకొనేవారు. విదేశాలనుండి దిగుమతియ్యే వస్తువులపై నూటికి ౨౦ వంతు, త్వరగా చెడే పదార్థాలగు కూరలు పండ్లు మున్నగువాటిపై 1/6 వ వంతు, యితరములపై నూటికి నాలుగునుండి ౧౦ వరకు పన్ను వసూలుచేసేవారు. అఫ్ఘనిస్తానునుండి వచ్చే సారాయిపైగూడ ఎక్సైజుపన్ను వసూలుచేసేవారు. ఈ పన్నుల రాబడి అంతా పాలకుడు యేరీతిగా వెచ్చించాలో కౌటిల్యుడు విశదీకరించియున్నాడు. ఇందు ముఖ్యంగా నేటి రేషనుకాలములో మనం గమనింపదగ్గ అంశం ఒకటిగలదు. కౌటిల్యనీతిలో స్టోర్‌హౌసు సూపరింటెండు ఒకడు కోష్ఠాగారాధ్యక్షుడను పేరున పేర్కొనబడెను. ఈతను యీతని క్రిందఉద్యోగుల విధాయక మేమన, వ్యవసాయదారుల లెక్కలు సరిచూచుట, గ్రామంలోని పన్నుల రాబడి, క్రయవిక్రయ పరివర్తనముల లెక్కలుంచుట, వస్తురూపకమున వచ్చు పన్నులు వసూలుచేసి నిలవయుంచుట. అతను వసూలుచేసిన సర్వవిధ వస్తుసముదాయములో సగమువంతు కష్టకాలమున ప్రజల ఉపయోగానికి నిలవయుంచి, మిగిలిన సగమే ఉపయోగించాలి. క్రొత్త వసూళ్లు రాగానే,... ప్రాతది వాడి క్రొత్తది నిలువ చేయాలి. సైన్యానికి కాలప్రకారం సప్లయి చేయుట, కష్టదశయందు ప్రజలకు ఎట్లు పంచాలో కొలమానము తూకముల ప్రమాణములు నిర్ణయించుట అంతయు యితని విధియై యున్నది. అనగా ఇప్పటి ప్రభుత్వంవారు కరువొస్తే తాత్కాలికంగా నెలకొల్పిన సివిలుసప్లయిశాఖ, అప్పుడు స్థిరంగా నుండెడిదన్నమాట.

రాజకీయార్థికవ్యవహారములే కాక, కౌటిల్యుడు ఆనాటి సాంఘికజీవితంయొక్క నియమములు కూడ విధించి, యుగాంతరములందు ప్రజలకు జ్ఞానప్రదాయి యగు శాస్త్రమును లిఖించెను.

(మద్రాసు ఎ. ఐ. ఆర్. సౌజన్యంతో)

# మీరు మెక్లీన్‌తో
# నేడు పళ్లు తోముతున్నారా?

నెలరోజుల క్రిందట మీ పెరా
క్సైడ్ టూత్ పేస్టు వాడు
క ప్రారంభించాను. అది
నాకెంతో బాగుంది. ఇది
వరకు నాపళ్లు గారకట్టి
వుండేవి. కాని, మీ టూత్
పేస్టును వాడుతున్నప్పటి
నుంచీ అవి ముత్యాలవలె
మెరుస్తున్నవి.



నోటిని పరిమళభరిత మొనర్చి
దుర్వాసనను
నివారిస్తుంది

ఆమ్లాలను విరిచివేసి
మీ ఇగుళ్లను
సంరక్షిస్తుంది

పళ్లమీది మరకలను తొలగించి
వాటిని ధవళతర
మొనర్చుతుంది

సామాన్యమైన వాటికన్న భిన్నమైన టూత్ పేస్టు కావలసినచో, మెక్లీన్సు పెరాక్సైడ్ టూత్‌పేస్టును వాడండి, దంతాలను ధవళతర మొనర్చే శక్తిగల పెరాక్సైడు ఈ మెక్లీన్స్‌లో మాత్రమే ఉన్నది. ఇది విశిష్టమైన సూత్రం ప్రకారం తయారైనది గనుక, నోటిలోని అదనపు ఆమ్లాలను విరిచివేయుటం మూలంగా దంతక్షయాన్ని అరికట్టడానికి, దంతశోభను మసుగుపరిచే మరకలను తొలగించడానికి, దంతాలను ముత్యాలవలె మెరిసే మెరుగు పెట్టడానికి రమ్యమైన పెప్పర్‌మింట్ రుచితో శ్వాసను పరిమళభరిత మొనర్చి, ఆహ్లాదం కలిగించడానికి ఇది తోడ్పడుతుంది.

**నేడే మెక్లీన్సు కొనండి!**




MTX-ST6

# మా బామ్మ



శ్రీమతి నందివాడ పుతలీబాయి

నా చిన్నప్పటి చిలిపిచేష్టలు తల్చుకుంటే మళ్ళీ అప్పటిఅంత సంతోషాన్ని అనుభవిస్తాను. నిజంగా అవే సుఖంగా గడిపిన రోజులు. అందుకనే అంటారు, ఎప్పుడూ జరిగిన రోజులే మంచివని! చీకూ చింతా లేకుండా హాయిగా తిరిగానప్పుడు.

ఎంత అల్లరి చేసేవాడిని! అందుకనే మా అబ్బాయి ఏమైనా కొంటెపనులు చేస్తే సాధారణంగా కేకలు వెయ్యను. మావాడి అల్లరి నేను చేసిన అల్లరిలో ఎన్నోవంతు! అసలు పట్నటూరి పిల్లలకి తెలిసిన అల్లరులు పట్నవాసపు కుర్రకుంకల కేం తెలుసు?

మా ఊళ్ళో నా చెయ్యి లేకుండా ఏ అల్లరిపనీ జరగలేదు. ఆటలు చాలా బాగా ఆడేవాడిని. గమ్మత్తులు చేయడంలో ఘట్టు నేను. మా ఊరి పిల్లలందరం ఒక జట్టుగా ఉండేవాళ్లం. ఆ జట్టుకి నాయకుణ్ణి నేను. ఒకసారి అట్లతద్దికి మేం చేసిన అల్లరి ఎప్పటికి మరచిపోలేను.

అట్లతద్దినాడు తెల్లవారుఝామున నేనూ లేస్తానన్నాను. మా పిన్ని 'ఆడపిల్లలా నీ వెందు' కని కసిరింది. నాకు మా పిన్నిమీద భలే కోపం వచ్చింది. లోపల తిట్టుకున్నాను పైకే అంటే కొట్టుందని భయం మరి! ఏడుపు మొహంతో మా బామ్మపక్కన చతికిలబడ్డాను. ఆవిడకి జాలేసింది పాపం. 'అదేమిటే బొడ్డూడని వెధవకూడా మగవాడేనా! ఇంతట్లోకి ఆడపిల్లయిపోడు. ఏదో సరదాపడుతున్నాడు పసివెధవ! తెలవారుఝామున లేపు పాపం!' అంది.

"ఈయనగారికోసం నేను తెల్లవారుఝామునే లేవలే"నంది మా పిన్ని బొమలు ముడుస్తూ. అందుకనే అంటారు తల్లిలేని బిడ్డ లోకానికంతకీ బరువని. "చిన్నబాబు అడుగుతే పంపనంటావా! ఏదో పాపం చేసుకున్నావుకనక నే తల్లి పోయిందిరా నాయనా. ఏడవకురా వెర్రివెధవ! నేను లేపుతాలే. నేనున్నన్నాళ్లూ నీకు తక్కువ చేస్తాననుకున్నావా బాబూ!"

అని గుడ్లనీరు కుక్కుకుంది. ఇంట్లో ముసిలివాళ్లు ఉండడం పిల్లల కెంతో లాభ మనుకోండి!

తెల్లవారుఝామున ౪ గంటలకి మా బామ్మ నన్ను లేపి గోంగూరపచ్చడి, ఉల్లిపాయపులుసు పెరుగుతో అన్నం పెట్టింది. వీధిగుమ్మందాకా వచ్చి నేను వెళ్ళిపోతూంటే చెప్పింది. "అల్లరిపనులు చేయకు. ఆ వెధవ-శాస్త్రిగారబ్బాయి లేడూరా, వాడితో వెళ్లకు. ఏదేనా అల్లరి చేసినట్టు నాన్నకి తెలిసిందంటే పుపిరగకొట్టాడు.' పాపం ఆవిడకి తెలియదు వాడు చేసే అల్లరిపనులన్నీ నే చెప్పినవే నని!

అందరం చెరువుపక్కన ఉన్న రావిచెట్టు క్రింద కలిశాం. చెయ్యావలసిన పనులన్నీ ఆలోచించుకున్నాం. వీధి లాంతరు ముక్కలు చేసేశాం. 'డస్టబిన్' (*Dust Bin*) కాలవలోకి త్రోశాం. అన్నట్టు చెప్పడం మరిచిపోతూను. వీటన్నిటికంటే సుందర సీతగారింటిముందర పళ్లేరులు జల్లేసి, గప్‌చిప్‌గా, ఏమీ ఎరగని నంగనాచిలాగ వచ్చేశాం.

అన్నిటికన్న గొప్ప పని! రఘురామయ్యగారి నేమ్‌బోర్డు (*Name Board*) రంగసాని యింటి గోడకి కొట్టాం. అందువలన వీధివీధంతా గడబిడ అయిపోయింది. మంచిపని జరిగిందని చాటుగా కొంతమంది నవ్వుకున్నారు. పిల్లలు మీరిపోతున్నారని చాలామంది కేకలేశారు.

యింట్లోకి వెళ్తోంటే మా బామ్మ రహస్యంగా 'వెధవ! లోపలికి పో! పుస్తకం పుచ్చుకుని కూర్చో. నాన్న కోపంగా ఉన్నా' డంది.

నేను వెళ్లి అలమారు తీసి పుస్తకాలు తీసుకుంటున్నా. వెనకగా మా నాన్న వచ్చి రెక్క పట్టుకున్నాడు. హడిలిపోయాను.

"వెధవా! నువ్వేనా రఘురామయ్యగారి బోర్డు గంగసానింటికి తగిలించింది! అని ఊరిమాడు."

నేను తొణకలేదు.

'ఏమిటి నాన్నా? బోర్డు తగిలించడ మేమిటి!' అన్నాను ఆశ్చర్యంగా.

"వేషం వెయ్యకు. నాకు నిజం తెలిసిపోయింది. అబద్ధా లాడక ఒప్పుకో."

"నా కేం తెలియదు నాన్నా" అన్నాను బిక్క మొహంతో.

"దబాయించకు. నిజం చెప్పేయ్. లేకపోతే సున్నంలోకి ఎముక లేకుండా తంతాను. రంగసానింటికి నువ్వు ఆయనబోర్డు కొట్టలేదూ!"

"ఎవతెరా అది అసలు!" అంది బామ్మ.

"ఆయన రోజూ వెళ్లే భోగంది!"

"బాగుందిరా నాయనా! ఇది మరీ బాగుంది! ఆ భోగందానితో వాడి కేం పని! పసివెధవ! కుర్ర సన్నాసి! వాడి కెలా తెలుస్తుందిరా!" అంది చేతులు తిప్పుతూ.

"నువ్వూరుకో అమ్మా! నీ అలుసే వాడిని తగలేస్తోంది! చదువు సంధ్య లేకుండా దున్నపోతులా తిరగడం నేర్చాడు. అన్నం చారవేగాని అక్షరం వారవ లేదు. అబ్బాయిగారికి!" అని రెండు దెబ్బలు వేశాడు వీపుమీద.

"ఊరుకోరా! వట్టి అసంభావం మనిషి వైపోయావ్! వట్టి పుణ్యాన గొడ్డుని బాదినట్టు వాడిని అలా కొట్టడ మెందుకు? నీ కుందిరా బుద్ధి!" అని గదమాయించింది.

"అదుగో! అలాగే అనవద్దన్నది. అన్నాడు సుశ్లోకం చేసి."

"ఆ మరీ లెస్తూ! ఆ పంతులు చెప్పడానికి వచ్చేటప్పటికి పత్తా లేకుండా ఎక్కడికో పోయేవాడివి. గడబిడ సుర్రం! కాలు జారి ఏ కాలవలో పడ్డావో అని హడిలిచచ్చేదాన్ని. పన్నెండేళ్లు వచ్చినా అల్లరి మానావా? అప్పటిమా టెందుకు? యిప్పుడు వింటున్నావా ఏమిటి! ఏమిటో వాడిని హద్దులో పెట్టాలని పెద్ద కబుర్లు చెప్తావ్! ఆ చదివే దేమిటో పూర్తయ్యాక కాని వాడు ఆగుతాడా. పోరా పిచ్చితండ్రీ, వెళ్ళి చదువుకో, పో."

అని తల నిమిరి అవతలికి పంపింది. అమ్మయ్య అని గుండె తడుముకుని వెళ్లిపోయాను.

మా నాన్న మాట్లాడకుండా ఈజీచైరులో కూర్చున్నాడు.

యిరవై నాలుగుగంటలూ దానిదగ్గర పడిగాపులు పడితే తప్పలేదు కాని వీళ్లు బోర్డు కట్టారని పుస్సొచ్చింది ఆయనకి! అని నవ్వింది.

మా నాన్నకికూడా నవ్వొచ్చింది! రామం వచ్చి మా నాన్నని మీ బాబు ఏడండీ అని అడుగుతున్నాడు.

"ఏం కావాలో చెప్పు అన్నారు" నాన్న. పని ఉందన్నాడు వాడు.

'నాతో చెప్పకూడని పనా అది?' అన్నాడు మా నాన్న. పంపించేస్తాడేమో నన్న భయంకొద్దీ చేతిలో వున్న పుస్తకం క్రింద పడేసి వాడిదగ్గరకి వెళ్లాను.

ఇద్దరం తోటలోకి పోయాం.

"ఒరేయ్ మా నాన్న చితకతన్నాడురా. ఐనా నేను చెప్పలేదు" అన్నాను.

"మంచిపని చేశావ్. నన్నూ నిలవదీసి చెప్పమని మా నాన్న కేక వేశాడు. నేను చెప్పలేదు."

వాడి ధైర్యానికి మెచ్చి ఒక సపోటాకాయ కోసిచ్చాను వాడికి. ఇంతలో సూర్యం వచ్చాడు.

"పాపం వాడిని చెప్పేదాకా అన్నం పెట్టనని కొట్టిందిరా వాళ్ల పిన్ని" అన్నాడు రామం.

"ఔన్రా. కాని నేను చెప్పలేదురా! అసలు నన్ను వెళ్లద్దంది. చెప్పకుండా అన్నం తినకుండా వచ్చేశాను. పొద్దున చద్దన్నం పెట్టలేదు వెళ్లానని! యిప్పుడు కూడా పెట్టదుట! ఎలా కొట్టిందో చూడు!" వీపు చూపించాడు సూర్యం. పాపం వేళ్లు తేలినై వీపుమీద. వాడి కళ్లంట నీరు వచ్చింది నాకు జాలేసింది. వాళ్లని వుండమని పిల్లిలాగ మా బామ్మ బుట్టదగ్గరికి వెళ్లి కర్జూరం పండు తెచ్చి వాడి కిచ్చాను.

రఘు వగర్చుకుంటూ వచ్చి "ఒరేయ్! వాళ్ల నరసింహులు చెప్పేశాడురా!" అన్నాడు.

"ఆరి వెధవా!" అన్నా ముక్కుమీద వేలేసుకుని.

వాళ్లత్త చితకబాదింది. పాపం వేపబెత్తంతో కొట్టే రక్తం వచ్చిందిరా, యింక దెబ్బలు తినలేక

చెప్పేవాడు." అన్నాడు రఘు ఊడిపోతున్న లాగు పైకి లాక్కుంటూ.

ఇంక నా ఒంట్లో ప్రాణం లేదు. మా నాన్న నన్ను బతకనివ్వడని భయమేసింది, ఏవో నాలుగు కబుర్లు చెప్పి పంపేశాను వాళ్లని.

అనుకున్నట్టుగానే మా నాన్న ఉగ్రుడై పోయాడు. పిన్నితో నా కన్నం పెట్టద్దని చెప్పి ఆఫీసుకి వెళ్లిపోయాడు. అసలే నేనంటే ఎప్పుడూ ఆవిడ కళ్లల్లో కారం జల్లుకుంటుంది. యింక ఆవిడ సంగతి యిప్పుడు వేరే చెప్పక్కర్లేదు.

'పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. పుండు వెంటనే కంపు కొట్టుంది. నువ్వు పనికివచ్చే దలాగా లేదు వెధవా! చిహ్నాలు కనిపిస్తూనే ఉన్నై.' అంటూ అష్టకం చదివేసింది. మా పిన్ని కొడుకు నాలుగేళ్ల వాడు. వాడికి నేనంటే ప్రాణం. నా తెలివితేటలకి వాడు ఆశ్చర్యపడేవాడు. నేను చేసే తమాషాలు, బొమ్మలు చూసి, వాడు నేనెంతో తెలివైనవాడి ననుకునేవాడు. వాడికవన్నీ యివ్వడంవలన వాడికి నామీద మంచి అభిప్రాయం ఏర్పడింది. నా కన్నం పెట్టమని తల్లితో చెప్పాడు. ఆవిడ వాణ్ణికూడా తిట్టింది. కిక్కురుమనకుండా ఊరుకున్నాడు. ఆవిడ దొడ్లోకి వెళ్లి ఏదో పని చేసికొంటోంది. నిమ్మళంగా వంటింట ఉన్న అలమారులోంచి గండు అరిసెలు తీసి చొక్కా క్రింద దాచాడు. పరుగెత్తుకుంటూ వచ్చి నాకిచ్చాడు. ఎక్కడినించి చూసిందో మరి ఆవిడ! శక్తిలాగ విరుచుకుపడిపోతూ వాణ్ణి రెక్క పట్టుకు యీడ్చింది. నీకూ వచ్చిందీ పోగాలం! అని బుగ్గసాగదీస్తూ లాక్కుపోయింది.

కాని మళ్లీ ఒక పావుగంటకల్లా చిన్న నాదగ్గిరికి వచ్చాడు. మాట్లాడకుండా అవి పడేసి వెళ్లబోతున్నాడు. నేను తీసికొనలేదు. మాటలేదనుకొని 'యింది' అన్నాడు రహస్యంగా. నాకు వద్దన్నా.

'ఆకలేస్తోంది నీకు. తీసికో అన్నయ్యా మళ్లీ అమ్మ వస్తుంది' అని గుసగుసలాడాడు.

"అమ్మ చూస్తే నిన్ను చావకొట్టుందిపో" అన్నా కోపంగా.

"ఈ రెండూ తిను. మళ్లీ అమ్మ చూడకుండా తెస్తా ఆకలివెయ్యదు."

వెళ్లిపో! అని గట్టిగా అన్నాను. వాడి కళ్లు నన్ను బతిమాలుతున్నై.

పోరా! లేకపోతే అమ్మ యిందాకలాగే గిల్లుతుంది అన్నాను విసుగ్గా.

చిట్టిమంత మొహం చేసికొని వెళ్లిపోయాడు చిన్న.

సాయంత్రం నాలుగయింది. నాకు పిన్ని పెట్టలేదు. నేను అడగలేదు. ఆకలి దంచేస్తోంది. యింక చేసేది లేక పచ్చిజామికాయలు మింగాను, కాసిని నీళ్లు తాగి పడుకున్నాను. నిద్రపోతోంటే మా బామ్మ నన్ను లేపి పిన్నిని తిట్టుకుంటూ కంచం వాల్చి అన్నం పెట్టింది. తిని మళ్లీ పడుకున్నా ఆ తోటలోనే. బామ్మ నన్ను ఎత్తుకొని తీసికెళ్లి మంచంమీద పడుకో బెట్టింది కాబోలు! పొద్దున్న చూస్తే గదిలో మంచం మీదున్నాను!

మర్నాడే మా బాబాయి వచ్చాడు. ఆయనకి నేనంటే ఎంతో అభిమానం. తల్లిలేని పిల్లాడివని జాలిపడేవాడు. మా అమ్మపోలికట నేను. తల్లిపోలికున్న మొగపిల్లవాడు అదృష్టవంతుడౌతాట్ట. గ్రహచారం చాలక అమ్మపోయినా నేనెంతో అదృష్టవంతుడననీ గొప్ప ఉద్యోగినౌతాననీ పొగిడేవాడు. ఆఖరికి ఆయనమాటలే నిజమయాయి!

మా అమ్మా, బాబాయి ఒకే యీడువారట. మా బాబాయి అమ్మతో గవ్వలు, చదరంగం మొదలైన ఆటలు ఆడేవాడట. అంతా అన్యాయం ఆట ఆడేవాడట. అయినా అమ్మ కోపగించేది కాదని చెప్పాడు బాబాయి. బాబాయికింకా పిల్లలు లేరు. అందుకని పిల్లలంటే మహా ఉబలాటపడ్తాడు.

నువ్వు మా ఊరు వస్తావురా అని అడిగాడు. ఎగిరి గంతేశాను.

"వస్తాను బాబాయ్. నన్ను తీసికెళ్లవూ. నేనేం బెంగపెట్టుకోను. పిన్ని ముట్టయితే వంట కూడా చేస్తాను." అన్నాను అందరూ నవ్వారు.

బాబాయితో వెళ్లడానికి సామానంతా సర్దుకున్నాను. పాపం చిన్న వెళ్లద్దని ఏడ్చాడు. వాడికి నా యీలా, పిస్తోలు, బొమ్మలు, చిల్లపెంకులూ అన్నీ యిచ్చేశాను. వెళ్లేటప్పుడు కొంచెం ఏడుపొచ్చిందికాని రైలెక్కగానే ఏడుపు ఎక్కడికో ఎగిరిపోయింది.

మా పిన్ని నన్ను చూసి నిర్ఘాంతపోయింది. బాబాయి నన్ను తీసికొనివస్తాడనుకోలేదు ఆవిడ. రెండు మూడు రోజులదాకా ముభావంగా ఉంది. తర్వాత రాసిరంపాన పెట్టడం మొదలెట్టింది. పల్లెటూరి గొడ్డునేది. నాజూకు తెలియదని ఏవగించుకునేది. ఏమాటంటే వెక్కిరిస్తుందో అని నేను ఆవిడతో మాట్లాడడానికే భయపడేవాణ్ణి. మాది గోదావరిజిల్లా అవడంచేత నాతో ఏదేనా చెప్తోంటే 'అయ్యా, అయ్యా' అనడం అలవాటు నాకు. 'ఏమిటబ్బీ అలా అంటావు అసహ్యంగానూ? యిక్కడ నౌకర్లుకూడా అనరు. అలా అనకు. ఎవరేనా వింటే నవ్వుతారు. నిన్ను చూస్తే సిగ్గేస్తోం' దనేది. మరి ఆవిడ అబ్బీ అనడం లేదూ! అబ్బీ అని నన్ను పిలిచినప్పుడల్లా నాకు కోపం వచ్చేది. మా చాకలిపేరు అబ్బి. చాకలి అబ్బినా నేను? కాని ఆవిడని అలా పిలవవద్దని చెప్పడానికి ధైర్యం చాలేదికాదు.

ఒకరోజున ఆవిడ నా క్రాపులో ఉన్న పిలక చూసింది. మా నాన్న క్రాపు చేయించినా, పేరుకి మాత్రంగా బుల్లిపిలక ఉంచాడు. నేను పిలక ముడెట్టుకోడం చూసి 'ఛీ అది తీయించుకోరాదూ!' అంది. నాకు సిగ్గేసింది. ఆవిడ అలాగ అడిగినందుకు కోపం కూడా వచ్చింది.

బామ్మకి కోపం వస్తుంది అన్నాను. తర్వాత క్షౌరం చేయించుకునేటప్పుడు మంగలి పిలక తీసేశాడు. వాడు తీస్తున్నట్టు నాకు తెలియదు. తీరా చూసేసరికి పిలక లేదు. నేను చెప్పకుండా నా పిలక కత్తిరించడానికి వీడెవడు? అరికాలిమంట నెత్తికొచ్చింది నాకు. ఎందుకు కత్తిరించావ్ నా పిలక? అని కోపంగా అడిగాను. మీ అమ్మగారు కత్తిరించమన్నారండీ, అని నవ్వాడు వాడు. యింకేం చెయ్యను నేను! మా బాబాయితో పిన్ని లేనప్పుడు చెప్పాను. పోనీలేరా అని పకపక నవ్వాడు.

నేను అష్టపదులు చాలా బాగా పాడగలను. బామ్మ నేర్పింది నాకు. ఒకరోజున 'రాధికాకృష్ణ' పాడుతూంటే మా పిన్ని పాడమంది. పాడాను. పాడినంతసేపు బాగా లేదంటుందేమో నని అనుకున్నాను. యింత బాగా పాడుతావనుకోలేదు సుమా అబ్బీ అంది. ఛీ, ఈలాగ అబ్బీ అనకుండా ఉంటే ఎంత బాగుండును. నేను మొహం కొంచెం చిట్లించుకున్నాను. తర్వాత ధైర్యం చేసి "నన్ను బాబు అనక అబ్బీ అంటావేమిటి?" అన్నాను.

"అబ్బీ అంటే ఏం. అదేం తిట్టుకాదులే" అని నవ్వింది. యింకా ఏదైనా అంటే కేకలేస్తుందేమో నని ఊరుకున్నాను. మర్నాటినించీ నేను అష్టపదులు పాడుకునేవాడిని. ఆవిడకి నా పాటలు నచ్చలేదు కాబోలు.

"ఏదైనా హిందీపాటలు పాడు. లేకపోతే అసలు పాడకు. పక్కభాగంలో ఉన్నామె నిన్న నీపాట విని నవ్వింది" అంది.

అష్టపదులు పాడడం మానేశాను. యీల వేస్తే గొల్లకాపరిలాగ యీలేమిటనేది. అక్కడమా పిన్ని అనుకుంటే, యిక్కడ ఈవిడ ఆమెకన్నా మించిపోయింది నన్ను సతాయించటంలో. నాకు యింక యిక్కడ ఉండా లనిపించలేదు. ఇంటికి వస్తే బాగుండుననుకున్నా. ముఖ్యంగా చిన్నని చూడా లనిపించింది. వారంరోజులలోనే మొహం మొత్తింది. అక్కడ ఉండదల్చుకోలేదింక.

ఇంతలో మా పిన్నికి జ్వరం వచ్చింది. బాబాయి ఉత్తరం వ్రాస్తే బామ్మ వచ్చింది. బామ్మని చూడగానే ప్రాణం లేచివచ్చింది నాకు. ఇక్కడ ఉండనని చెప్పా నావిడతో. నాకు కష్టం తోచిన విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాను. తల్లి లేని బిడ్డా, ఉద్యోగం లేని మొగవాడూ అందరికీ లోకువే నాయనా అంది బామ్మ. మా బామ్మ నాకేం లోటు జరిగినా తల్లి లేదుకనక జరిగిం దనేది.

మా బామ్మతో మా ఊరు వచ్చేశాను. చిన్న నన్ను చూడగానే తినే అన్నం వదిలేసి పరుగెత్తుకుని వచ్చాడు. మళ్లా అల్లరి మొదలెట్టాను.

బామ్మకి ఉబ్బసందగ్గు. అందుకని ఉమ్మెత్త గొట్టంతో పొగ పీలుస్తుంది. ఆవిడ పొగపీల్చుకుంటూంటే ముక్కులోంచి తెప్పించమని ఆవిడని వేధిస్తున్నా. ఇంతలో మా నాన్న వచ్చాడు. నన్ను తిట్టాడనుకున్నాను. కాని నవ్వుతూ "ఏరా అల్లరి చేస్తున్నావు. మళ్లీ బాబాయిదగ్గరికి పంపెయ్యనా" అన్నాడు.

"ఇంకెప్పుడూ చెయ్యనులే నాన్నా" అన్నాను. అలాగే అలాంటి అల్లరి ఎప్పుడూ చెయ్యలేదు.

---

# సర్దార్ పటేల్ జన్మలగ్నము

●

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఈ విక్రృతిసంవత్సర మార్గశిర శుక్ల సప్తమీ శుక్రవారము (౧౫-౧౨-౧౯౫౦) మన భారతభూమికి గొప్ప దుర్దినము. హిందూదేశమునందలి వందలకొలది స్వదేశసంస్థానములలో ప్రజాసత్తాక రాజ్యాంగస్థాపనమునకు ప్రబల ప్రతిబంధకములుగా ఏర్పడి ప్రజాసముదాయపు రక్తమును పీల్చుచుండిన రాచరికపు సంస్థను నామావశేష మొనర్చి 'అభినవ పరశురాము' డను ఖ్యాతి గాంచిన తేజశ్శాలి, బార్డోలీవీరుడు, సర్దారు వల్లభభాయి పటేలు బొంబాయినగరములో పశ్చిమసముద్రతీరమున అస్తమించిన దిన మది. మహాభారతయుద్ధనిర్వాహకు డగు సవ్యసాచికి భీమునివలె, స్వతంత్రభారత రాజ్యాంగనౌకాకర్ణధారు డగు శ్రీ నెహ్రూపండితునికి కుడిభుజమువంటి మహనీయు డితడు. ఇతని పరలోకప్రయాణముచే, నేటి క్లిష్టపరిస్థితులలో, భారతభూమికి తీరని లోటు కల్గినది. దైవగతి దుర్నివారము!

గూర్జరదేశములో నాదియాడ్ పురసమీపమున కరంసాద్ అను గ్రామములో జనించిన మహనీయు డితడు. ఇతని తండ్రి ఒక భూస్వామి. అతని పుత్రులు ఐదుగురిలో ఇతడు మధ్యముడు. ఇతని జ్యేష్ఠభ్రాత సుగృహీతనాము డగు వి. జే. విఠ్ఠలభాయిపటేల్. నాదియాడులోని ఉన్నతపాఠశాలలో మెట్రిక్ పరీక్షలో కడతేరి న్యాయవాదిపట్టము నార్జించి ౧౯౦౧లో బొర్సాద్ నగరమందు న్యాయవాదవృత్తిలో ఇతడు ప్రవేశించెను. ఆ నగరములోని న్యాయాధికారులకు ఇతని పేరన్నచో గుండియ లదరెడివట! నడివయస్సులోనే కళత్రవియోగము కలుగుటచే, ఇతని వైవాహికజీవితము అంత జయప్రదమైనది కాదనవచ్చును. దేశకళ్యాణార్థమై దీక్షవహించి కర్మయోగిగా, ఇతడు ప్రఖ్యాతికి రావలసిన ఉత్తమకార్యరంగము దైవికముగా వేరొక్కటి సిద్ధముగ నుండిన కాల మది. భారతభాగ్యవిధాతయగు మహాత్మాగాంధీగారి స్వార్థరహిత పవిత్రజీవితము ౧౯౧౭ లోనే ఇతనికి ఆదర్శప్రాయమైనది. ౧౯౨౦లో, ఆర్థికముగా జయప్రదముగా నిర్వహించుచుండిన న్యాయవాదవృత్తిని సత్యాగ్రహోద్యమముకొరకై ఇతడు పరిత్యాగము కావించినాడు. ౧౯౨౨లో బొర్సాదులో కర్షకనాయకుడై 'నోటాక్స్' ఉద్యమమును కొనసాగించిన దితడే.

అహమ్మదాబాదునగరములో పురపాలకసంఘాధ్యక్షుడై ౧౯౨౪ నుండి ౧౯౨౮ వరకు ప్రజాహితకరముగా ప్రవర్తించి కీర్తినార్జించినా డితడు. ౧౯౨౮లో బార్డోలీలో సత్యాగ్రహసమరసందర్భమున ఇతని సంకల్పశుద్ధికి, కార్యదీక్షతకు మెచ్చి మహాత్ము డితనికి 'సర్దార్' అను బిరుదము నిచ్చి బహూకరించుట! తరువాత, మహాత్మునితోకూడ ఎర్రవాడలో కారాగృహవాసమును ఈ దేశసేవకు డనుభవించవలసివచ్చినది. ౧౯౩౪ నుండి కాంగ్రెసు సంస్థలో ప్రముఖకార్యనిర్వాహకత్వము నవలంబించి, అనేకసమయములలో తన పట్టు నెగ్గించుకొనగలిగినా డితడు. నారిమన్, ఖేరు, సుభాషచంద్రబోస్, మున్నగు కాంగ్రెసువీరులు సయితము ఇతని దండశాసనత్వమునకు తాళజాలక కాంగ్రెసుసంస్థనే విడిచిపోవలసివచ్చెను. కాంగ్రెసు 'హైకమాండు' సంప్రదాయము ఇతని సృష్టి. ౮-౮-౧౯౪౨లో 'క్విట్ ఇండియా' తీర్మానమును జయప్రదముగా ప్రతిపాదించి బ్రిటిష్‌దొరతనమువారి కంటికి నెరసుగా ఏర్పడిన కారణముచే, ఆ మరుదినమే ఇతడు మరల కారాగారము చేరవలసివచ్చెను. కాని, ౧౫-౬-౧౯౪౫లో ఇతడు జైలునుండి బైటికి వచ్చునప్పటికి భారతదేశములో రాజకీయవాతావరణమున గొప్ప మార్పులు త్వరలో రానుండినవి. ౨-౯-౧౯౪౬ నాడు భారతకేంద్రప్రభుత్వమున కార్యనిర్వాహకసభ్యుడుగా చేరి ౧౪-౮-౧౯౪౭ నాటి రాత్రి బ్రిటిషువారు భారత

భూమికి స్వాతంత్ర్యప్రదానము చేసి జారుకొన్న వెంటనే, ఈ మహనీయుడు శ్రీ నెహ్రూపండితునికి కుడిభుజముగా ఉపప్రధానియై రాజ్యాంగభారమును నిర్వహించుటకు నడుముకట్టి నిలిచినాడు. ఆంతరంగికశాఖామంత్రిగా ఇతడు చూపిన కార్యదక్షత, గుండెనిబ్బరము, అచంచలదీక్ష, దేశాభిమానము, నిరుపమానమైనవి. ఇతని కార్యశూరత్వమునకు హైదరాబాద్ సంస్థానములో అల్లరి, రజాకార్ల దుండగములను రూపుమాపిన పోలీసుచర్యయే సాక్షి. ఇతని రాజనీతి నైపుణ్యమునకు భారతదేశములోని నానావిధములైన ౫౬౨ స్వదేశసంస్థానములలో అడపొడ కానరాక అంతర్ధానమైన రాచరికపు సంస్థయే నిదర్శనము. బాహ్యాడంబరము లేని గంభీరమైన ఆకారము, పైపూత మెరుగులకు పోని అర్థవంతమైన భాష, ఒడుదుడుకులు కానరాని కార్యకారియగు ఆత్మవిశ్వాసము, జంకు గొంకులకు లోబడని ప్రజాహితతత్పరమగు చండశాసనము, ఈ సామగ్రితో భారతరాజ్యాంగశిశువును క్లిష్టసమయములో బాలారిష్టముల పాలుకాకుండ కాపాడిన కీర్తికాయుడితడు; సత్యసంకల్పుడు; కర్మయోగి.

"రథస్యైకం చక్రం, భుజగనమితాస్సప్తతురగాః,
నిరాలంబో మార్గః, చరణవికల స్సారథిరపి,
రవిర్యాత్యేవాంతం, ప్రతిదిన మపారస్య నభసః,
క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం, నోపకరణే."

అను సుభాషితమునకు లక్ష్యమీ మహనీయుని జీవితము.

ఇట్టి లోకోత్తరపురుషుని జాతకము ఆదర్శప్రాయమై జ్యోతిశ్శాస్త్రవిద్యార్థులకు అమూల్యదృష్టాంతమగుటలో ఆశ్చర్యము లేదు. కాని, అనేకసందర్భములలో ఇట్టి వ్యక్తుల జన్మకాలము తెలియకపోవుటో, సందేహాస్పదమగుటో, తటస్థించుచున్నది. జన్మదినము తెలిసిననేమి, జన్మకాలము నికరముగ తెలియకపోవుటచే, అనేక సందర్భములలో, లగ్ననిర్ధారణము చేయుట చాల కష్టము. మహాత్మ గాంధిగారియొక్కయు, నేతాజీ సుభాషచంద్రబోసుయొక్కయు, జన్మలగ్నములనుగూర్చి పండితులలో కలిగియున్న భిన్నాభిప్రాయములకు కారణమిదే.

కీ. శే. పటేలుగారు జనించుట 1875 వ సంవత్సరము అక్టోబరునెలలో 30 వ తేదీనాడని బెంగుళూరు ఆస్ట్రొలాజికల్ మేగజైనుసంపాదకులు శ్రీ. బి. వి. రామన్ గారు వ్రాసిరి. కాని, ఇటీవల వార్తాపత్రికలయందు పటేలుగారినిగూర్చి వ్రాయబడిన జీవితచరిత్రములలో వారి జననము 31-11-1875 నాడని పేర్కొనబడుట చదువరు లెరుగుదురు. జన్మకాలమో, అసలే తెలియదు. సర్దారు పటేలువంటి అసాధారణవ్యక్తి జాతకమునుగూర్చి ఇట్టి అవ్యవస్థ కానవచ్చుట విద్యార్థుల అభాగ్యంపు ఫలము. జ్యోతిశ్శాస్త్రాభ్యున్నతికై పాటుపడువారగు శ్రీ రామన్ గారు తగినంత కారణము లేదే జన్మదినమును, నాటి గ్రహస్థితిని, ప్రకటించియుండరను నమ్మకముతో, ప్రస్తుతము 30 వ తేదీనే మనము వాడుకొందుముగాక.

పటేలుగారు కీర్తిశేషులగుట 15-12-1950 నాడు, ఉదయము 9-37. A. M. (I. S. T.) గంటలకని మనకిపుడు నికరముగా తెలిసియున్నది. కనుక యీ సామగ్రిఆధారమున అతని జన్మకాలమును తేల్చుట సాధ్యమా యని చర్చింతము.

ఆ మహనీయుని నిధనకాలమున బొంబాయి నగరములో ఆ కాశరంగమున గ్రహస్థితి ఇట్లుండును:-

| | | | |
|---|---|---|---|
| రా 23-40<br>చ 9-51<br>గు 1-50 | | | |
| | నిధనకాల<br>కుండలి<br>[సాయనము] | | వ 8-4 (వ) |
| కు 29-50<br>I 28-25<br>బు 13-1<br>శు 0-15 | | | యము<br>19-44 (వ) |
| ర 22-25 | X 10-20 | శ 1-40<br>ఇ 19-9 | క 23-40 |

మరణకాలమునకు బొంబాయినగరములో అష్టమభావము కన్యారాశిలో రెండవభాగలో నుండును. దానికి ఎదురుగా మీనరాశిలో నిలిచి బృహస్పతి అష్టమభావఫలమును, అనగా మృత్యువును, ఆహ్వానించుచున్నట్లు చూపట్టుచుండుట పాఠకమహాశయులు గమనించియుందురు. తాత్కాలికలగ్నాధిపతియగు శనికి నిండు షష్టాష్టమస్థితిలో ద్వితీయమారకస్థానమునందు ఈ బృహస్పతి యుండుట విశేషము! ఇంతే

కాదు. తాత్కాలిక దశమకేంద్రము పటేలుగారి జన్మదినమందు బృహస్పతి యుండినస్థానమునే (వృశ్చికరాశిలో 10-56.) చేరుకొనియుండుట కాకతాళీయ మనరాదు. అగుటచే, పటేలుగారి మరణవిషయమున బృహస్పతియొక్క కైవాటను సమృద్ధిగా నుండవలెనని మన మూహించుట తప్పు కాదు. అనగా, అతని జాతకరీత్యా బృహస్పతికి మృత్యుభావసంబంధము ప్రబలముగా నుండితీరవలయు ననుట.

జన్మదినమున బృహస్పతి సాయనవృశ్చికరాశిలో నుండెను. ఆ గ్రహమునకు మృత్యుభావముపై అధికారము రావలయునన్నచో, వృశ్చికరాశి అష్టమభావము కాగల మేషమో, లేక, ఆ బృహస్పతికి అష్టమాధిపత్యము వచ్చు వృషభమో, కాక సింహమో, పటేలుగారి జన్మలగ్నము కావలసియుండుననుట స్పష్టము. మేషము లగ్నమైనయెడల, కేంద్రము లన్నియు గ్రహశూన్యము లగును. అట్టి దుర్బలలగ్నములో సర్దారుపటేలువంటి కార్యశూరుడు జనించియుండడని నిస్సందేహముగా తీర్మానించవచ్చును. కాక, అతని గంభీరాకారము, నియమితభాషణ, దృఢసంకల్పము, కర్కశస్వభావము, ఇవి గమనించితిమేని, స్థిరరాశియే అతని జన్మలగ్నము కావలయునని తోచుట సహజము. ఆదినమందు వృషభములో యముగ్రహము, సింహములో వరుణుడు, వృశ్చికములో బుధ, గురు, శుక్ర, చంద్రులు, కుంభములో కుజశను లునుకలరు. అగుటచే, స్థిరరాశియే లగ్నమగుపక్షమున, కేంద్రములన్నియు గ్రహయుక్తములనుట సిద్ధించును. కాని, వృషభ, సింహములకుమాత్రమే బృహస్పతి అష్టమాధిపతి కాగలడుకదా? కనుక ఈ రెండురాసులలో నొక్కటియే జన్మలగ్నము కావలసియున్నది. సింహలగ్నమునకు రాజస్థానములో యముగ్రహము, సప్తమభావములో కుజ శనులు, ఉండుటచే ఒకవిధముగా జీవితములో సరిపోవచ్చునని తోచును. కాని, లగ్నాధిపతియగు రవి నాల్గింట పడి పాతాళమునకు పోవుట, అను లోపము కానవచ్చుచున్నది. వృషభము లగ్నమగునెడల, లగ్నాధిపతి శుక్రుడు వర్గోత్తమాంశలోనుండి జాతకుని ఉత్తమశ్లోకతను తెల్పగలడు. మరియు, దశమాంగారకయోగముచే రాజ్యస్థానమునకు వన్నె హెచ్చుచున్నది. దీని ప్రభావమును చమత్కారచింతామణి ఇట్లు వర్ణించెను:—

"పతే తస్య కిం మంగళం మంగళో నో,
జనై ర్ధ్యాయతే మధ్యభావే యది స్యాత్,
స్వతస్సిద్ధ వీవావతంసీయతే సౌ;
వరాకోపి కంఠీరవః కిం ద్వితీయః?"

ఈ యోగ మొక్కటియే చాలునని కాదు! వృషభలగ్నమునకు రాజయోగప్రదుడు శని. రాజ్యభాగ్యాధిపతియై, ఈ శని తనమూల త్రికోణభవనమందు మహాబలసంపన్నుడై, రాజ్యభావమందే యుండుట ప్రబల రాజయోగము. రాజ్యాంగములో కీర్తిప్రతిష్ఠల నార్జించిన వ్యక్తికి ఈమాత్రపు గ్రహసౌకర్యమైన వలదా?

ఇక, లగ్నాధిపతి శుక్రుడు సప్తమభావములో నుండుటచే,

"లగ్నేశే సప్తమే యస్య,
తస్య భార్యా న జీవతి;
విరక్తోవా, ప్రవాసీవా,
దరిద్రోవా, నృపోపి వా."
(బృహత్పరాశరహోర.)

అను విధి ననుసరించి, ఇతనికి కళత్రవియోగక్లేశము వచ్చుట యుక్తమే. కాక, మృత్యుభావాధిపతి యగు బృహస్పతి, కళత్రభావములో ఉండుట నయితము అనుభవమునకు తగియే యుండును. లగ్నమందలి యముగ్రహము, శని, చంద్ర, వరుణ వేధాఫలముగా, చండశాసనుడను ప్రఖ్యాతి ఇచ్చిన దశ వచ్చును.

పై సామగ్రివలన పటేలుగారి జన్మలగ్నము వృషభమైయుండుట సయుక్తికముగా నుండు నని ఊహ. కాని, ఆనాడు జన్మప్రదేశపు అక్షాంశలో (౨౨°-౫౧' ఉత్తరను) ౫-౦ మొదలు ౬-౪౪ *P.M.* (*L.M.T*) గంటలవరకు పూర్వదిశా హంశములో వృషభరాశి ఉండగలదు. ఆ రాశిలో ముప్పది భాగలలో ఏ విశిష్టభాగకే పటేలుగారి జన్మలగ్నము కాగల భాగ్యము అబ్బినది? ఈ సమస్య ఇంకను మిగిలియున్నది.

ప్రశంసలో నున్న దినమున కుంభములో ౫వ భాగలో కుజుడు, ౨౦వ భాగలో శని, ఉండిరి. ఈ ఇరువురును దశమభావమందే నిలువవలసియున్నది. కాని, పటేలుగారి రాజ్యకార్యదక్షతను గుర్తించితిమేని, శనికంటే కుజుడు దశమభావబిందువునకు అత్యంత సన్నిహితుడుగా నుండుట సమీచీనముగా

కన్పట్టగలదు. ఈ కుజుడు వృశ్చికనవాంశలో ప్రబలుడుగ నున్నాడు కదా? అదే నవాంశలో నే దశమ కేంద్రము నిలుచుట పరిస్థితులకు ఎంతయు తగియుండు నని చదువరు లూహింపగలరు. అయినచో, కుంభములో ౫, అథవా ౬వ భాగలో దశమ కేంద్ర మున్నదని భావించినచో, వృషభరాశిలో ౧౪ - ౧౭ భాగల ప్రాంతము జన్మలగ్నము కావలసివచ్చును.

అది యట్లుండనిండు. ఆరోగ్యము చెడి అతి క్లిష్టముగా నుండిన కారణమువలననే, హుటాహుటిగా, సర్దారుగారిని ౧౨-౧౨-౧౯౫౦ నందు బొంబాయినగరమునకు కొనివచ్చినారు. డిసెంబరు ౧౪ వ తేదీ రాత్రి 3-౧౦ A. M. (I. S. T.) గంటల సమయములో వ్యాధి ఆకస్మికముగా విషమించి పటేలు గారికి బాహ్యజ్ఞానము నశించెనని వింటిమి. అప్పటికి తాత్కాలిక దశమ కేంద్రము కర్కాటకరాశిలో 29వ భాగలో 'గండసంధి'లో ఉండును. ఏమి విశేష మందురేమో? నాటి యమ వరుణ స్థానముల 'పాప కర్తరి' మధ్యబిందువు అదేయనియు, తాత్కాలిక కుజుడు దానికి నికరముగా సమసప్తవేధాస్థానమందే ప్రత్యక్షమైనాడనియు, ప్రాణోత్క్రమణకాలమునకు అదే కుజస్థానమే ఉదయలగ్నముగా ఏర్పడిన దనియు, గమనించితిమేని, ఆ విశిష్టభాగకు జాతక రీత్యా మరణవిషయమున గొప్ప సంబంధ ముండవలెనని ఊహించుట సహేతుక మగును. అందాజుగా మనము నిర్ణయించిన వృషభరాశిలోని ౧౭ వ భాగయే జన్మ

| | | | |
|---|---|---|---|
| శ 27-40 | X 24-17<br>రా 2-41 | ఇ 0-17 | |
| శ 24-26<br>శు 19-59<br>బు 4-0 | | | ♆ 29-18 |
| ర 22-47 | | | పు 11-0<br>మృ 16-30<br>వ 19-1<br>చ 25-51 |
| | గు 26-11 | కే 2-41 | |

| | | | |
|---|---|---|---|
| | రా 9-39 | ఇ 1-31(వ)<br>I 18-28<br>యమ<br>22-4 (వ) | పు 3-7<br>మృ 9-28 |
| శ 19-28<br>X 6-9<br>శు 4-24 | సర్దార్ పటేలు గారి<br>(సాయన)<br>జాతక గ్రహభావ<br>కుండలి | | |
| | | | వ 19-44 |
| | బు 6-8<br>ర 6 43<br>గు 10-56<br>శు 16-23<br>చ 21-22 | కే 6-39 | ప్ర 2-9 |

సూచిక :—

(i) ౧౯౫౦ డిశెంబరుకు చలితగ్రహాదులు దేవమానదశతో బైటి కుండలిలో చూపబడినవి.

(ii) పు = పుణ్యసహమము.
మృ = మృత్యుసహమము.
ప్ర = ప్రగతిసహమము.
యమ = ప్లూటో గ్రహము.
వ = వరుణుడు.
ఇ = ఇంద్రుడు.

లగ్నముగా గైకొని మృతతిథికి దైనికజాతకమును గుణించితిమేని, దైనికమృత్యుభావబిందువు మకరరాశి ౨౨ భాగసమీపముననే రాగలదు. కనుక, ఏకాలమును జన్మకాలముగా గ్రహించినచో, నాటి దైనిక జాతకమున తాత్కాలిక కుజస్థానము నికరముగా అష్టమభావబిందువుగా ఏర్పడగలదో, దాని నే స్పష్ట జన్మకాలముగా గ్రహించుట యుక్తాయుక్తముగా నుండగలదు. పాశ్చాత్య హోరాతంత్రపద్ధతులలో హెచ్చుగా ప్రచారములో నున్న, 'ఆధానకాల పద్ధతి' ననుసరించి ఆ కాలమును సద్ధతరచినచో, స్థానిక మధ్యకాలమున సాయంకాలము ౬ గంటలపైన ౧౦ సెకండ్లు స్పష్టజన్మకాల మగును.

ఈ కాలమునకు సాధించిన సాయనకుండలి పైపటములో నున్నది:—

దశమకేంద్రము కుజునినుండి 1⅛ భాగదూరము పోయినమాట వాస్తవమే. కాని, ఈ రెండును వృశ్చిక నవాంశయందే ఉన్నవనుట విశేషము. అప్రమత్తతతో, దూరదృష్టితో, వెనుకంజ వేయక, నెమ్మదిగా కార్యము నిర్వహించవలెనని భావాధిపతి యగు శని ఆజ్ఞ. భావఫలము నిర్వహించు కార్యము భావస్థగ్రహములదే కదా? ఇచట ఆ అధికారము శనికుజుల కున్నది. శ్రీసత్యాచార్యుని మతము ననుసరించి, ఈ భావముపై నాటికి ౨౬ వంతులు శని, నాటికి ౧౫ వంతులు కుజుడు, తమతమ శక్తిని ఉపయోగించుచున్నా రనుట గమనింపదగిన విశేషము. ఈ తారతమ్యమున కనుగుణముగనే రాజ్యస్థానఫలము నడుచుచుండుట, దూరదృష్టి కల మంత్రినైపుణ్యము, జాగరూకత కల ప్రభుత్వశక్తి, నిరంతరాయమగు కార్యదీక్ష, శాంతియుతమైన పట్టుదల, ఉద్వేగరహితమైన ప్రగతివాంఛ, ఈ ధర్మములతో రాజ్యాంగభారమును నిర్వహించిన సర్దారు పటేలుగారికి రాజ్యస్థానమందలి ప్రబల శుభులగు శనికుజుల సమ్మేళనము ఎంతో తగియున్న దనవచ్చును. అందులో, కుజునికి నిండు త్రికోణదృష్టిలో నున్న పుణ్యసహమము ప్రాక్తన సత్కర్మపరిపాకము ఏవైపున నున్నదో చూపుచున్నది.

పోనిండు. మహాత్ముని జాతకములో బృహస్పతి వృషభరాశిలో ౨౦ భాగలు ౧౦ కలలలో నున్నాడు. ఈ గ్రహము వక్రి అగుటచే, కొంతకాలమునకు వెనుకకు జరిగి, పటేలుగారి లగ్నస్థానమునకు రాగలడు కదా? మధ్యవయస్సులో మహాత్ముని పౌరోహిత్యము లభించిన దీతనికి. బృహస్పతికంటె ఉత్తము డగు పురోహితు డెవడు?

"పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి, పార్థ, బృహస్పతిం."

అనికదా శ్రీకృష్ణభగవానుని యుపదేశము?

ఇంతే కాదు. మహాత్ముని లగ్నాధిపతియగు ప్రబలకుజుడు వృశ్చికరాశిలో (౧౭°—౨౪') అనగా, నికరముగా పటేలుగారి సప్తమభావబిందువు నందే ఉన్నాడు. ఎంతటి శక్తిమంతు డయినా, ఎంత స్వాతంత్ర్యప్రియు డయినా, పటేలు మహాత్ముని ఆజ్ఞకు లోబడియుండె ననుటలో వింత లేదు.

మరియొక్క విశేష మేమనగా, పటేలుగారి లగ్నాధిపతియైన శుక్రుడు సప్తమభావము (వృశ్చికరాశి ౧౬°-౨౩') నున్నాడు కదా? అదే స్థానమందే మహాత్ముని సప్తమాధిపతియై లగ్నములో నున్న శుక్రుడు (వృశ్చికరాశి ౧౬°—౨౮') నిలిచియుండెననుట వింతలలో వింత! ఈ వ్యక్తులకు కల పరస్పరసంబంధము జీవాత్మపరమాత్మల సంబంధము వంటిదని సహృదయులు గ్రహించగలరు!

మరియొక్కటి! నెహ్రూపండితుని రాజ్యస్థానము వృషభరాశిలో ౧౮ వ భాగప్రాంతములో నున్నది. ఆ ప్రదేశమే సర్దారుపటేలుగారి జన్మలగ్నము. ఆ కారణమువలననే కాబోలు, రాజ్యాంగభారము నిర్వహించువిషయమున, చిన్నవాడయినా, నెహ్రూపండితుని నాయకత్వము నే ఇత డపేక్షించుట.

ఏమి సృష్టిచిత్ర మిది?

అది యట్లుండనిండు. దేహావసానసమయమునకు దేవమానపద్ధతిలో దశాపరిపాకక్రమ మెట్లుండెనో, చూతము:—

(౧) చలితలగ్నము గండసంధిని జేరుకున్నది. మరణదినమున తాత్కాలిక కుజుని సమసప్తక వేధ దీనికి కలదు;

(౨) లగ్నాధిపతి శుక్రుడు చలనవశమున జన్మ శనిసంయోగమును బొంది లగ్నవరుణుని సమసప్తక

వేశపా లయినాడు; చాలదని, తాత్కాలికయముడు సయితము వరుణానికి తోడయినాడు;

(౩) తాత్కాలిక యమగ్రహము జన్మవరుణ స్థానమును, ఒక్కకల అయినా వ్యత్యాసము లేకుండ, ఆక్రమించి జన్మశని సమసప్తకముచే దుష్టుడై, లగ్నమును, లగ్నాధిపతిని సహా, కేంద్రవేధచే పీడించుచుండగా, చలితరవి జన్మయమునినుండి ఆ దుష్టఫలమును కోణదృష్టిచే ఆకర్షించుకొనుచున్నాడు;

(౪) చలితచంద్రుడు చలితశని సమసప్తక దృష్టిచే విద్ధుడై, మృత్యుభావాధిపతి యగు చలిత గురువుయొక్క కేంద్రవేధపా లయినాడు;

(౫) చలితమృత్యుసహమము జన్మచంద్రునికి (అనగా, లగ్నాధిపతికి) నికరముగా కేంద్రదృష్టికి బోయి తన ఫలము నందిచ్చినది;

(౬) చలితపుణ్యసహమము మృత్యుస్థానాధిపతి యగు బృహస్పతి కేంద్రవేధను పొంది ప్రారబ్ధక్షయమును సూచించినది.

ఈ దుర్దశాయోగములు ఆయుర్దాయవిషయమున చాల క్రూరములైనవని వేరుగా చెప్పనవసరము లేదు. సింహములో నున్న వరుణునికి శనిఘర్షణ యుండగా, ఆ వరుణునిపైకి నికరముగా తాత్కాలికయముడు వచ్చుటచే, పటేలుగారికి హృదయసంబంధమగు వ్యాధి ప్రబలి అదే కడకు మృత్యుకారణమైనది.

ఇక, పైవిధముగా మనము సాధించిన జన్మకాలము ముఖ్యములగు జీవితానుభవములను సూచించగలదా యని పరీక్షించుట ముఖ్యము. ఆవిధమగు సాక్ష్యము లభించనిచో, ఇది యంతయు వ్యర్థప్రయాస యగును. ఈ క్రింది నిదర్శనములు పరిశీలింపుడు:—

(i) చలితలగ్నము జన్మరవిబుధుల శుభత్రికోణ దృష్టికి ౧౯౨౪ లో వచ్చినది. అహమ్మదాబాదు పురపాలకసంఘాధ్యక్షుడై జాతకుడు ప్రసిద్ధికి వచ్చుట అప్పటినుండియే.

(ii) చలితదశమకేంద్రము మహాత్ముని జాతకములో లగ్నాధిపతి యగు కుజునితో ప్రత్యక్ష మిత్రదృష్టి నార్జించుట ౧౯౧౬ లో. అప్పుడే జాతకుడు మొట్టమొదట మహాత్మునితో ఆకర్షింపబడుట. తోడనే, చలితలగ్నము కటకప్రవేశము చేసినది. జాతకుని జీవితాదర్శములన్నియు నూతనమార్గ మవలంబించసాగెను.

(iii) ౧౯౨౨ లో జాతకుడు ప్రథమమున కారాగృహప్రవేశము చేయుట. చలితలగ్నము ఆకాలమున చలిత రాహుకేతువుల మధ్యమం దుండినది.

(iv) ౧౯౨౮ లో చలితలగ్నము జన్మగురువు నుండి కోణదృష్టి నార్జించెను. బార్డోలీలో చట్టము నుల్లంఘించి సత్యాగ్రహసమరము జరుపుట కారణముగ కీర్తిగడించినాడు జాతకుడు.

(v) చలిత కుజునినుండియు, జన్మచంద్రుని నుండియు, ఏకకాలముందే, పూర్ణ త్రికోణదృష్టికి చలితలగ్నము ౧౯౪౨ లో వచ్చినది. జాతకుడు 'క్విట్ ఇండియా' తీర్మానము నుపపాదించి సాధించిన కాలమదే.

(vi) ౧౯౪౬లో జన్మవరుణుని శుభదృష్టికి చలితదశమములోగా, చలిత బృహస్పతినుండి అనుకూలదృష్టిని చలితలగ్నము సంపాదించెను. కేంద్రప్రభుత్వములో కార్యనిర్వాహక సభ్యుడుగా జాతకుడు చేరుట అప్పుడే.

(vii) ౧౯౪౭లో ఉపప్రధానిగా స్వతంత్రభారతరాజ్యాంగములో ప్రవేశించినపుడు జాతకుని చలిత కుజుడు చలిత బృహస్పతితో పరిపూర్ణ త్రికోణ శుభదృష్టిలో నుండెను. ప్రగతిసహమము చలనవశమున జన్మగురువుతోటి సంతోషమును పొందుట సయితమప్పుడే.

(viii) శ్రీనెహ్రూపండితునితో కలిసి మంత్రిపదవిని స్వీకరించిన కాలములో అతని చలిత బృహస్పతితో జాతకుని చలితరవి సంయోగమును పొందుట ఎంతో రమ్యముగా నున్నది.

స్థాలీపులాకన్యాయమున పై దృష్టాంతములు చాలు ననుకొందును.

జన్మకాలము సిద్ధమైనచో, జీవితములో సుప్రసిద్ధ ఘట్టములు గల దినములకు దైనికజాతకములను సాధించితి మేని, అనుభవములకు సరిపడిన గ్రహకేంద్రయోగములు కానరావలయును గదా? మనము సాధించిన కాలమునే ఉపకరణముగా నుంచుకొని కొన్ని విశిష్టానుభవములు గల దినములను పరీక్షింతము కాక;—

(అ) ౮-౮-౪౨ :— 'క్విట్ ఇండియా' తీర్మానము.

ద్వై. దశమము.....(వృశ్చికము ౧౯వ భాగ) జన్మశనివరుణుల మధ్య బిందువదే.

ద్వై. సప్తమము.....(కుంభము ౬వ భాగ.) తాత్కాలిక యమసంయోగము.

కేంద్రములు చెడినవి. చేసిన ప్రతిజ్ఞ కఠినము. వెంటనే కల్గిన కారాగృహవాసముసయితము కఠినమే.

౨౯-౩-౧౯౪౯ :— విమానప్రయాణములో ప్రమాదపరిస్థితి.

ద్వై. లగ్నము... (మూల ౬వ భాగ) జన్మకేతు సంయోగము.

ద్వై. సప్తమము... (మేషము ౬వ భాగ) తాత్కాలిక కుజ, జన్మరాహువులతో సంతోషము.

ఇది గండమువంటిది. చలితరవియు, చలితదశమకేంద్రమునహా, శుభగ్రహదృష్టిలో నుండుట కారణమున, విషాదాంతముగా పరిణమించలేదు.

(ఇ). ౧౫-౮-౧౯౪౭ :—మంత్రిపదవీ స్వీకారము.

ద్వై. దశమము... (వృశ్చికము ౨౫వ భాగ) చలితగురుసంయోగము.

ద్వై. సప్తమము... (సింహము ౧౩ వ భాగ) తాత్కాలిక శనియములతో సంయోగము.

పదవిలోగల అసామాన్య గౌరవప్రాభవములు బృహస్పతి తెలుపగా, కార్యనిర్వహణమునందలి క్లేశమును, అంతరాయములును, శనియములు సూచించినారు.

(ఈ) ౧౫-౧౨-౧౯౫౦ :-నిర్యాణము.

ద్వై. లగ్నము... (కర్కటకములో 3 వ భాగ) చలిత రాహుకేతువుల 'పాపకర్తరీ' వేధ.

సర్దారు భానుబింబము రాహుగ్రస్తమైనది.

ఆతని ఆత్మకు సర్వేశ్వరుడు శాంతిని ప్రసాదించుగాక !

ఒక్క మనవి. జాతకములలో నూతన గ్రహముల ప్రభావము ఇంత ప్రబలముగా, స్పష్టముగా, కానవచ్చుచున్నప్పుడు, ఆచారము లేదని, వానిని వదలుట శాస్త్రదృష్టిలో లోపమనుట. శాస్త్రీయ విజ్ఞానము వికసించుకొలది, సృష్టిమర్మరహస్యముల నెన్నియో క్రొత్తగా కనుగొనుచున్నాము. వానిని మన నిత్యజీవితములో ఉపయోగించుకొనుచున్నాము కూడ. మన తాతలనాటి గ్రంథములలో లేదని, ఎలెక్ట్రిసిటీని ఉపయోగించుట మానుకున్నామా ? రేడియోను పరిత్యజించినామా ? నూతనముగా శాస్త్రజ్ఞులు కనుగొన్న గ్రహములకు మాత్రము అస్పృశ్యతాదోషమును అంటగట్టుట అన్యాయ్యము గదా ? అది యట్లుండె.

ఏ సామగ్రిఆధారముతో పటేలుగారి జన్మకాలము (జన్మలగ్నముసహా) సాధింపబడినదో, దాని వివరములు పాఠకమహాశయులకు నివేదించితిని. జీవితానుభవములతో అది ఎట్లు సమన్వయము చేయుట సాధ్యమో, కొంతమట్టుకు పరిశీలించితిని కూడ. ఇంతకంటె భిన్నమయిన కాలము మరి యేదయినా, జీవితమునకు సరిపడునది, శీలస్వభావములకు యుక్తమైనది, దశలతో అతుకునది, దైనికఫలములు సూచింపగలది, సాధించుట సాధ్యమగునేని, తద్జ్ఞులు సహేతుకముగా దానిని ప్రకటించి హోరాశాస్త్రవిద్యార్థులకు ఉపకరింతురని ఆశ. నూతన గ్రహములను వదలిపెట్టి ఫలములు సాధించినా, మంచిదే. కాక, కేవల రాశికుండలితోనే ఆ పని నెరవేరగల్గినచో, మరియును సంతోషమే !

"అర్కే చేన్మధు విందేత,
కిమర్థం పర్వతం వ్రజేత్."

అనికదా పెద్దలనిరి?

కథానిక:

# స్మశానం చిగిర్చింది

●

శ్రీ మునిపల్లె రాజు

బాలచంద్రయ్య ఏడవలేదు. కళ్ల నీళ్లుకూడా తిరగలేదు. కొడుకు శవం చూస్తూ నిలబడి పోయాడు - శిలా ప్రతిమవలె. ఆదిశేషు వచ్చి చచ్చిపోయినవాడి తల ప్రక్కన కొత్త ప్రమిదలో దీపం పెట్టి దానిమీద బుట్ట బోర్లించటంగూడా గమనించలేదు. హంపి శిధిలాల్లో నిల్చిన తలలేని రాతి చెక్కడంవలె వున్నాడు—దుప్పటి కప్పుకొని శాశ్వతంగా నిద్రిస్తూన్న కొడుకు ముందు.

కళేబరం మీది ముసుగును చీల్చుకొని, అతని కళ్లు ఆరడుగుల ఆజానుబాహువు,—కొడుకు గుండెల మీది కత్తిపోటును పరికిస్తున్నై. ఆ చూపులో భావం లేదు. ఆవేదన లేదు. చైతన్యం ఒక్కటే సుప్తమై కనిపిస్తున్నది.

చచ్చిపోయిన సుబ్రమణ్యం గుండెమీది గాయం లోతుగా వుంది; నెత్తురు ద్రవించటం లేదుగాని, నోరులేని దుఃఖం నిశ్శబ్దంగా ప్రవహిస్తున్నది. ఎర్రగా విప్పారిన మందార పువ్వు-సాంబయ్య పెట్టిన గాయం!! ఆరడుగుల మనిషిని, చెట్టంత నిండు జీవాన్ని, ఒక్క కొడుకును - చంపిన సాంబయ్య !!!

బాలచంద్రయ్యకు కొడుకు ఛాతీ మీది గాయంలో సాంబయ్య కనిపిస్తున్నాడు. రెప్ప లార్పకుండా హంతకుడు సాంబయ్య - నల్లటి విగ్రహాన్ని, క్రౌర్యానికి, మోసానికి చిహ్నాలుగా మెలి దిరిగిన కోర మీసాల్ని పరీక్షిస్తున్నాడు. భావాలూ, బాధలూ నలిబుచ్చని చైతన్యం అది.

* * * * *

బాలచంద్రయ్యకు బలవంతపు చావులు చూసి భరించటం కొత్తగాదు. పాతికేళ్ల కిందట భార్య కానుపు నొప్పులు నాలుగురోజులు విన్నాడు. ఐదో రోజున సీతమ్మ మంచానికి కరుచుకొని నెత్తురు మడిలో కనిపించింది. అప్పుడే పుట్టి చచ్చిన నెత్తురు గుడ్డును చాకలిమంత్రసాని చూపించింది. అప్పుడు తను లబోదిబో కొట్టుకొన్నాడు. నెల రోజులు లంకణాలు చేశాడు జబ్బుపడి.

సీతమ్మ చావునాటికి సుబ్రమణ్యానికి మూడేళ్లు.

పెళ్లాం చచ్చి రెండో సాలు తిరక్కముందే కూతుర్ని అల్లుడు ఏలుకోనన్నాడు. ఆ దిగులుతో లక్ష్మి భావిలో దూకి ప్రాణం తీసుకొన్నది. రాత్రింబగళ్లు వాపోయాడు. లక్ష్మి తిరిగి రాలేదు.

కాని సుబ్రమణ్యం అప్పటికే చిలిపిమాటలనటం నేర్చుకొన్నాడు. జీవితం వుంటే ఆశలు వుంటాయి. ఆశలకు రూపాలూ, కలలూ వుంటే-వాటికి మూర్తిగా ముద్దుల కొడుకునిలిచాడు. ఆ కొడుకుకోసం బతికేడు. ఆ కొడుకుకోసం సీతమ్మను మరిచిపోయాడు. ఆ కొడుకుకోసం లక్ష్మిని తలవలేదు. ఆ కొడుకుకోసం దయలేని అల్లుడితో జగడానికి పోలేదు.

కొడుకు గుండెలోతులో, సీతమ్మ పసుపూ, కుంకమా వంటినిండా పులుముకొని కనిపించింది. కొడుకు గుండె లోతుల్నుండి, భావిలో గుక్క తిరగక మునుగుతూ మునుగుతూ లక్ష్మి అరిచిన అరుపులు వినిపించినై. మళ్ళీ ఎనుబోతును మించిన సాంబయ్య ......వాడి ఎర్రటి గుడ్లూ.........

కాని బాలచంద్రయ్యకు ఏడుపు రాలేదు. కొడుకు దుర్మరణం చూసి తండ్రి కళ్లలో నీళ్లు ఎండిపోయినై.

* * *

సాయంత్రానికి మునసబు వచ్చిపోయాడు. మునసబు కేసు లేదన్నాడు—కేసుల సంగతి బొత్తుగా తెలీదు బాలచంద్రయ్యకు. జీవితం అన్ని చిక్కుల్ని ఆహ్వానించి ఎరగదు.

వెదురు బొంగులు చీల్చి ఆదిశేషు పాడె గట్టేడు. దానిమీద యింత తులసి దుబ్బు పరిచాడు.

నకం సెట్టి బట్టల దుకాణానికి పోయి మూడు గజాల సైను తెచ్చాడు. శవాన్ని తడికెకు ఆనబెట్టి బింగలతో నీళ్లు తెచ్చిపోశాడు. చివరకు యిద్దరూ కలిసి ఆరడుగుల సుబ్రమణ్ణాన్ని, మందార పువ్వును మించిన గాయాన్ని, పాడెకు అంటగట్టేరు. పైన సైనుపంచె కప్పారు. సుబ్రమణ్ణెం సైనం తే పడి 'సచ్చే' నాడు.

స్మశానానికి ఎవ్వరూ రాలేదు. వచ్చిందల్లా ఆదిశేషు బావమర్ది అప్పలనర్సు ఒక్కడే. సాంబయ్యంటే అంత కర్కోటకుడు. అంత కంటకుడు. అంత నిరంకుశుడు. "సుబ్రమణ్ణెం పీనిగమీద చెయ్యేసినవాడు యీ భూమ్మీద నూకలకు ఆశ లొదులుకోవాల్సిందే" నని వూళ్లో చాటింపు జేయించాట్ట. సాంబయ్యను పెంచినపల్లె, సాంబయ్యను తెలిసిన వూరు గనక—ప్రాణంమీద ఆశ గల వాడెవడూ పాడె కొమ్ము బట్టలేదు. పదిదా మనుకొన్న జాలిగుండె గల వాళ్లందరికీ తమ వానుల దొడ్లూ, పెద్ద మనుషులైన తమ కూతుళ్లే మానాలూ స్మృతికి వచ్చినై. ప్రగతిలేని ఆ గ్రామీణ జీవన వాతావరణంమీద ప్రభుత్వపు న్యాయస్థానాల నీడలు గూడా సోకలేవు. సోకినా సంఘద్రోహులను మరుగు పరచగల భయంకరమైన కోరలు దానికి లేవు.

అప్పల నర్సూ, ఆదిశేషూ—చిన్నతనపు కోతి కొమ్మచ్చుల దినాలు మరిచిపోలేదు. బాల్యస్నేహితుణ్ణి అవ్యక్తపు వీడ్కోళ్లతో ఉత్తర దిక్కుకు మోశారు.

* * *

బండెడు కట్టెల్లో సుబ్రమణ్ణెం కాలేటప్పటికి చుక్క బొడిచింది. గుండెమీద కట్టె బెట్టబోయే ముందుగూడా కొడుకు గాయం ఆకాశమంతై అగుపించింది బాలచంద్రయ్యకు. అందులో సాంబయ్య తాగుబోతు అడుగులతో నృత్యం జేస్తున్నాడు. లక్ష్మి బావిలో మునిగిపోతోంది. సీతమ్మ రక్తపు మడుగులో నిద్రిస్తోన్నది.

చుక్క బొడిచింది. మూగ వెన్నెల్లో రంజూకో లేని అంత్య కొష్ఠాల వెలుగు వెలా తెలా పోతున్నది. దూరాన రక్తమాంసాలు లేని మనుషులవలె నక్కలు కొరకుతున్న పుర్రెలు కదులుతున్నాయి. బాలచంద్రయ్య నిరక్షరకుక్షి. వేదాంతి అసలే కాడు. కాని స్మశానం నలుదిక్కులా చూశాడు. సంక్రాంతి నెలలో వరిపొలాల కళ్లం కాదది. కాని కొత్తధాన్యం లాగా అన్ని వేపులా బూడిద కనిపించింది—వేదాంతి కాని బాలచంద్రయ్యకు. తొలికోడి కూతకు చెట్లచాటున గుడ్లగూబలు మేల్కొని స్మశానపు నిశ్శబ్దాన్ని భంగం చేశాయి.

* * *

ఇల్లు జేరేటప్పటికి గుమ్మంముందు నాగరత్నం కూర్చొని వుంది. నాగరత్నం ఆదిశేషు మరదలు. తనకు కాబోయే కోడలు.

"మాఁవాఁ !"

నాగరత్నం కళ్లు మెరుస్తున్నై అశ్రువుల్తో—మసక చీకట్లముందు. నాగరత్నానికి బావ యిక లేడు.

ఆ పిలుపుకు ఏ లోకంనుండో మేల్కొని యీ లోకానికి వచ్చాడు బాలచంద్రయ్య. నాగరత్నం తలమీద చెయ్యి వేశాడు ఏ ప్రయత్నమూ చెయ్యకుండానే. జుట్టు నిమిరాడు. ముంగురులు సరిదాడు. గడ్డం పుణికాడు. ఆమె వేడి కన్నీళ్లు తన చేతిమీద పడ్డై. నిశ్శబ్దంలో నిశ్శబ్దమయిపోయి నాడు.

"బావను పంపి...వచ్చాను..." వృద్ధుడి కంఠం వణికింది.

నాగరత్నం తలెత్తి చూసింది. గుండె పెకల్చుకొని గొంతులోకి వచ్చింది.

"మాఁవాఁ! బావ నాకోసం...వచ్చాడు..." ఇక నాసు తేరు ఆగలేదు. గుండ్లకమ్మవలె వరదలయింది. చంద్రవంకవలె పొంగింది. అఖండ గోదావరివలె అలలతో వూగింది. కృష్ణమ్మ లోతులు చూసింది. నాగరత్నం ఎక్కిళ్లు ఆపుకోలేకపోయింది.

* * * * *

నాగరత్నం అంతి చక్కటి పిల్ల. ముక్కుపుడక దగ్గిర్నుండి కాళ్ల కడియాలదాకా తీర్చి దిద్దిన బొమ్మ. పదిహేడేళ్ల వయస్సులు పొంగి, నిండు పమిటె పనక దాగుడుమూత లాడుతూ, సుబ్రమణ్ణెంబావను బెట్టిన కితకితలు?! బావ తన మెళ్లో మంగళసూత్రం గట్టినట్టు రాత్రి కలగని ప్రొద్దున్నే బావ కాడికి ఒక్క గంతులో వచ్చి, సిగ్గుపడి, కలసంగతి చెప్పలేక, చిలిపికళ్లతో మాట్లాడించి, బావ మెలిదిరిగిన నల్ల కండరాలు చూసి, తనకు తాను మరిచిపోయి, తిరిగి వచ్చి నంతలోనే మాయమైపోయే నాగకన్య. ఊళ్లో ఎల్లమ్మదేవత జాతరకు బావ కుట్టించిన వూదా

"రెయికె" యెంత ముద్దుతో దాచుకొన్నది. మెరప తోటలో 'దచ్చినమూర్తుల' నాగులపుట్ట వెనక నక్కి "బావా!"—అని దిశలు శివాలెత్తినట్లుగా పిలిచి బావచేత వెతికించుకోటం. అవి భూలోకపు రోజులు కావు. దేవతా దినాలు. నాగరత్నానికి అంత ఆలోచన! అనుకొంటున్నది—'ఏలోక పున్నం' వెళ్లిన పంచమినాటికి 'పెళ్లి లగ్గం' కుదర్చారు. ఇంకొక్క... పదిరోజులు...పది!! పెళ్లిలో తనకు చదివించేందుకు బావ పట్నం వెళ్లి, మొన్న బేస్తారం తెచ్చిన కాసులు...నాలుగు బంగారం కాసులు......బావ మొల్లో దాచుకొన్న నాలుగు కాసులు...మొన్నటి బేస్తారం. ఇంకా పదిరోజుల్లో లగ్నం......నాగరత్నానికి సన్నాయి స్వరాలూ, డోళ్లు ప్రతిధ్వనించి చింత తోపుల్లో వినిపించిన శబ్దం, తోరణాలూ, పసుపు గుడ్డల బావా, తలంబ్రాలూ కళ్ల ముందు, చెవుల్లోనూ చిందులు తొక్కినై.

బాలచంద్రయ్య మెల్లగా దగ్గినాడు; నురు క్షణంలో నాగరత్నం కొల్పనిక జగత్తు మారిపోయింది. ......బావ మాయమై, యీ పృథ్వినుండి తొలగిపోయాడు. బావ తెచ్చిన కాసుల్ని మాత్రం తన చేతిలో చూసుకొన్నది—నాగరత్నం.

* * * * *

నాగరత్నం వెళ్లబోయేముందు, మళ్ళీ దగ్గరకు చేర్చుకొన్నాడు, బలం లేని చేతుల్తో బాలచంద్రయ్య.

"అమ్మా... ఆమాట ఆదిశేషుకు జెప్పేవు గనక..."

ఆమె వృద్ధుడి కళ్లల్లోకి చూసింది. శాంతమహాసముద్రపు గర్భంలో దాగిన విశాలత్వం... ఆకళ్లలో బాధలగాథ నాగరత్నానికి అర్థం అయింది. మెల్లగా తలవూపింది.

తనమానం, తన గౌరవం!

తన బావను మోసం చుపించిన తన మానం!!

తన కేపటి ఆనందాన్ని, ముందు కలలనూ, తన కాసుల అనురాగాన్ని బూడిద చేసిన తన గౌరవం!

నాగరత్నం జీవం లేని కంఠం నుండి ఒక్కసారిగా వెనుకేక వెల్లగిలి వచ్చింది—

"మాఁవాఁ"

మామ అక్కడ లేడు. మామ విశాలత, దూర దృష్టి మాత్రం ఆలోచనగల నాగరత్నానికి హత్తుకు పోయినై. బావ, దుష్టసర్పం సాంబయ్య కాటుకు చచ్చాడు. ...నాగరత్నం మెదడు చీకట్లోకి పరుగెత్తింది. మామ తన అక్క అయిదవతనం నిలపాలని అనుకొన్నాడు.

ఆలస్యమే లేదు— బానిసలై పుట్టి, వెలుగు చూడని జీవిత సంగ్రామంలో నలిగి, ఓడి, బ్రతుకు కోసం మాత్రమే బతుకుతున్న కోటాను కోట్ల భారతస్త్రీలలో... తానూ ఒక్కతైపోయింది చితికిపోయిన నాగరత్నం.

* * *

పెరుగూ విరుగూ లేని గ్రామీణ జీవంలో శాంతిని న్యాయాన్ని నిర్మలత్వాన్ని మాత్రమే చూసినట్లుగా భావించి భ్రమించే మూర్ఖుల్ని మరిచిపోతేనేం?

సాంబడి విష నేత్రాలు నాగరత్నంమీద వున్నవని సుబ్రమన్నెంకు చాలా రోజుల్నుండి తెలుసు. తల్లి దండ్రుల్లేని పిల్ల తాను ఏ గడ్డికిపోయే [illegible]ంకదారిలోనో కాచి, వచ్చిపోయేటప్పుడు సాంబయ్య చిలిపి మాటలనటం, తను తిట్టి మొటికెలు విరవటం ఎన్నిసార్లు దాచినా బావకు తెలియక పోలేదు. తనకు ఆశ్చర్యం వేసేది—బావకెట్లు తెలిసిందో? అని—బావను తన ప్రేమతో కాని అంగరక్షకుడిగా నియమించుకొన్న సంగతి మరిచిపోయింది. ఒకటి రెండుసార్లు బావతో సాంబడికి ఘర్షణ జరిగిందిగూడా. బావ బెదిరించాడు

"అరె నీతిజాతిలేని తొత్తుకొడకా... సిగ్గులేని... యెదవా...ఆడదాన్ని..." సాంబడు కోర మీసం మెలికలు తిప్పేవాడు.

ఆదివారం నాడు తను పుత్తరం పొలంలో మోళ్ళేరుతున్నది. పొద్దు తిరగ్గానే మబ్బులేసినై చినుకులు సాగకముందే యింటికి పోదామని అనుకొంటున్నది. వెనగ్గావచ్చి, ఎవరో కళ్లు మూశారు. అరె, ఆ చుట్టూ ఎవరూ లేరె, ఇంతదూరానికి ఎవరూ రాబోరనీ, పెద్దమోళ్ళతో గంప నింపొచ్చనీ వచ్చింది తను.

సాంబయ్య!!! కళ్ళలో పసుపులూ!!

'ఛీ... నీకు చెల్లెళ్లు లేరూ" అని విదిలించుకొని ఘోరంగా జరిగింది.

"ఇదుగో నాగా... ఒక్కసారి..." బుగ్గకొరికాడు. తను కెవ్వుమని కేక వేసింది. అడివి పందివలె మీదకొచ్చాడు.

"అన్నా... సాంబయ్యన్నా... నీకు అప్ప జెల్లెళ్లు..." ఇకిలించాడు—అడివి దున్న

అదిమి...రెక్కలు విరిచాడు గట్టిగా. భయంతో కేక వేసింది. ఆతర్వాత తనకు తెలీలేదు బావ వచ్చిందాకా.

అర్జునుడివలె బావ వచ్చాడు. తను చూస్తుండగానే బావసింహమైనాడు. దూకి సాంబడి మెడ విరిచాడు. దుష్టుడు నేలబడ్డాడు మోళ్లమన్య. బావతన్నులకు గాలిగాడు. లేచిపళ్లు కొరికాడు.

తన మానరక్షణ బావగుండెమీద చెలియలి కట్టలు లేని పౌలువుగా నిల్చింది మరుసటి నెలలోనే. చెలియలి కట్టలు లేని చిన్న చెలువు— నెత్తురి చెలువు !!

* * *

సాంబడికీ, బావకూ మన్యతగాదా యుందని తెలిసినవాళ్లు తనూ, మామా, బావ...ముగ్గురే. నాగరత్తం అనుకొన్నది... యిద్దరేమిగిలారు... వెంటనే కాసుల సంగతి జ్ఞప్తికి వచ్చింది. జ్ఞాపకాల దుఃఖంలో కాసులు తడిసి పోయినై.

* * *

జరజరా పొద్దు జాము దాటింది-దానికి దుఃఖంతో కాలయాపనతో విరోధమైనట్లుగా, బాలచంద్రయ్య నిద్రపోలేక పోయినాడు. కాని కళ్లు మూసుకున్నాడు—"స్మశానంలో మచ్చుకు గూడా యింత పచ్చిగడ్డి లేదు. అంత బూడిదలో తన సుబ్రమణ్ణెం గూడా భాగం పంచుకొన్నాడు...ఎంత గాయం....బూడిద గుప్పిటకు వస్తుంది. ప్రాణాలు వదలబోయే ముందు (సీతమ్మకు) పచ్చిగడ్డి తెచ్చిమని చెప్పాడు...."

పచ్చిగడ్డి!

ఎవరో కొట్టి లేపినట్లు వులికిపడి లేచి దొడ్లోకి వెళ్లాడు. అరవై ఏళ్ళ బరువు కింద శరీరం వంగిపోతున్నది. కరువువచ్చి ముసలితనాన్ని మచ్చికచేసి పోయింది. దొడ్లో 'సీతమ్మ'కు మేతవేస్తూ, యీ లోకంలోని ఆనందాలతో సంబంధం లేని శోకదేవతలాగా నాగరత్తం వున్నది.

సీతమ్మ యీ భూమిమీద సుబ్రమణ్ణెం విడిచి పోయిన కోడెదూడ. సీతమ్మ ఆ యింటి స్వేదపు సొమ్ము. సుబ్రమణ్ణెం 'కస్తూరోరింట్లో' ఆరేళ్లు జేసిన కమతానికి తెల్లని బింబం. యింటి యిల్లాలు, చచ్చిపోయిన సీతమ్మ స్మృతి. అది ఆంధ్రదేశపు వ్యవసాయ కూలీల కుటుంబపు గర్వ చిహ్నం.

సీతమ్మ సీతమ్మే. మైసూరు కోడెల వాడి కొమ్ములూ, ఒంగోలు దూడల బిగువూ, దాని పాలవెన్నెల తెలుపూ, అహంకార పూరితమైన చూపులూ. కాని సీతమ్మ తోటిజాతితో జగడమాడి ఎఱుగదు. వేలెడు బుడతడి చర్నం గూడా రాచి యెరగదు. రవ్వంత గూడా కొమ్ము విసిరి యెరగదు.

అంత నాణ్ణెమైన సంతతి. అంతేనా? సుబ్రమణ్ణెం, కాబోయే 'సద్దకుడు ఆదిసేసు'తో 'జాయింటు యెగసాయం' బెట్టినాటి నుండీ, భాగస్తుడి వట్టిబోయిన గేదెతోపాటు కాడి మెడకేసుకొని బెట్టలు దున్నింది. బుఱద నాగలి మోసింది. యిరుసు విరిగిన బండిలాగింది. ఒక్కనాడుగూడా మారాం చెయ్యలేదు.

"సీతమ్మ గడ్డిపఱక కొఱక లేదు మామా"—

ఎక్కడో అగమ్యంలో చూస్తున్న బాల చెంద్రయ్య నాగరత్తం ముఖంమీదికి కళ్లు తిప్పాడు. ఎంత అమాయికపు కళ్లు! నాగరత్తం ముసిలివాణ్ణి ఎగాదిగా చూసింది. నిన్నా నేటికి యిరవై ఏళ్లు కొని తెచ్చుకొన్నాడు.

బాలచంద్రయ్య సీతమ్మ పలుపు ఎత్తలేక పోయాడు.

"అమ్మో్య, కళ్ల పుసిగట్టింది పిచ్చిముండకు." మోరమీద చెయ్యేసి నిమిరాడు. చేతులు కొమ్ముల మీదికి పోయినాయి. బాలచంద్రయ్యకు కొడుకు గుండెమీది గాయం స్మృతికి వచ్చింది.

* * * *

సూదుల అప్పన్న ముసలివాణ్ణి కసిరి వేశాడు.

"కొడుకు జచ్చాడంట. తీరుపు జెప్పాలంట—హూఁ. పనికిమాలిన...ముండల యెవారాల్లో జచ్చి గ్యామాన్ని పిసాచులై బట్టి..."

బాలచంద్రయ్య చెవులు మూసుకొన్నాడు. సుబ్రమణ్ణెన్ని ఎవ్వరూ అప్లానిందించలేదు. వాడిది మచ్చలేని బతుకు. సాంబయ్య కత్తిపోటుకు కొడుకు

గుండెల్లోంచి పొంగిన వేడినెత్తురు... గప్‌గప్‌మని ఛాతీని తపతపలం వినిపించింది.

ఆదినేసు జెప్పనే చెప్పాడు. అప్పన్న సాంబడు మనిసని. ఊరి పెద్ద, గామ పంచాయితీదారుడు... అప్పన్న.

గాళ్ల నరిచిమ్మలూ, కేచవలు నాయుడు, బాల చంద్రయ్య క్షోభ విన్నారు.

"ఇదుగో చంద్రయ్యా...వాడా 'అసగాయ సూరుడు'—అప్పన్న జూడబోతిమా—?"

ఎవరు కూసినా అదే కూత. బాలచంద్రయ్య గడ్డమీద వుమ్మేశాడు— "ఇది వూరు గాదు, అడివి..." అన్నాడు.

చచ్చేటప్పుడు సుబ్రమణ్ణెం తన్ను గ్రామపెద్దల కాళ్లు బట్టమని చెప్పలేదు. 'రగతం'లో నుడిచెయ్యి ముంచి, మీసం కొడికి చెయ్యిబోనిచ్చి "ఒరే, సాంబడా...మా అయ్య నిన్ను పాణాల్తో వదల్రా" అని కవ్వించి, శపించి చచ్చాడు. ఆ వీరుడిని తనిక అవమానం చెయ్యదలచుకోలేదు.

* * *

సాయంత్రం యింత వేడిగంజి 'జర్మను సిల్వరి' గిన్నెలో పోసుకొని నాగరత్నం వచ్చింది. సీతమ్మ కొమ్ములకు పలుపు జుట్టి, శక్తిలేని చేతిలో కొసలు బట్టుకొని మామ సుంచొని వున్నాడు ఆరుబయట.

"మాఁవాఁ!"—

"అవునమ్మా— యెళుతున్నాను— దిగులుబడ బోకు... యిదుగో తాళం చెయ్యి తిరిగొస్తానని ఆదిసేసుకు జెప్పు. అదుగో... కళ్లనీళ్లు దుడుచుకో..."

చిక్కని గంజిపొరలమీద నాగరత్నం కన్నీళ్లు తేలినై.— టార్పెడో దెబ్బకు మునుగుతూ అట్లాంటిక్ నీటిమట్టానికి పెట్రోలు గంధం పూసిన యుద్ధ నావలు. అట్లాంటి కన్నీళ్లు.

* * *

సీతమ్మ దిగులు కొద్దిరోజుల్లోనే పోయింది. బాలచంద్రయ్య సీతమ్మ పాలచర్మంమీద ఈగ వాలితే కొదమ సింగం అవుతాడు. మట్టి రవ్వ అవు పించితే కొడుకు జ్ఞాపకం వచ్చి నొచ్చుకుంటాడు.

కొండవాలులో మంచి పచ్చిక వుంది. కిందనే సెలయేరు పారుతున్నది— ప్రపంచంలో ఎప్పుడూ యుద్ధాలు జరగనట్లే. కుడిచేతివాలుగా చిన్న అడివి-తన అందానికి అద్దాలు లేకుండా. ఈ రాజ్యమంతా సీతమ్మదై పోయింది.

అడివి ఆకులకూ, మోకాలి ఎత్తు పచ్చికకూ, కొండగాలికీ, సెలయేటి నీటికీ... సీతమ్మ బిగువుకు కొత్త మెరుపు వచ్చింది. బాలచంద్రయ్య ముప్పై యేళ్లు చిక్కిపోయాడు— అమాడు సెల్లోనే. సీతమ్మ మెళ్లో మువ్వలు దూరపు కొండ లోయల్లో సంగీత నిస్వనాల్ని రేకెత్తించి సెలయేటి రొదలతో మిళితమై పోతాయి. కాని బాలచంద్రయ్య పెదిమలు కదపడు. కొరెంపూడి యుద్ధపదాలు పాడడు. నాయకురాలి దర్ప గీతాలు, పలకలేడు. ఆవులల ముచ్చట్లు తిరిగి రాగాలు తీయలేడు.

* * *

ప్రొద్దున్నే సీతమ్మ చెంగనాలు వేస్తున్నది. కదం తొక్కుతున్నది. వృద్ధుడి పెదిమలమీద చిన్న చిఱునవ్వు తొణికిసలాడింది. సీతమ్మ పిక్కమీద చరిచాడు. కీపు నిమిరాడు. "నా సీతమ్మవు—" అన్నాడు. బదులుగా సీతమ్మ అవునన్నట్లు తలవూపింది. రంకె వేసింది. రణరంకె అది.

బాలచంద్రయ్య యిక ఆలస్యం చెయ్యలేదు. గుడిసెలోకి పరుగులెత్తాడు. నిలువెత్తు గడ్డిబొమ్మను లో సుండి తెచ్చాడు. అది పెద్ద దిష్టి బొమ్మ. దూరానికి నిజమైన మనిషిగా భ్రమింపజేయగల బొమ్మ. ఆరు రేయింబవళ్లు వృద్ధుడు కష్టించిన బొమ్మ.

వృద్ధుడు గడ్డి బొమ్మను వేపచెట్టు మొదలుకు అంటగట్టాడు నిలువుగా. దానిగుండెలమీద అడివిలో ఎఱ్ఱపూలు తెచ్చి కుట్టాడు.

"సీతమ్మా..."

మంచి పిల్లవాడివలె సీతమ్మ దగ్గరకొచ్చింది. ...బుజ్జగించాడు.

"అదుగో... సీతమ్మా... సాంబడు... అదుగో... సుబ్రమణ్ణెన్ని పొట్టన బెట్టుకొన్న సాంబడు—"

సీతమ్మ మువ్వలు మోగించింది. వూపుగా కొమ్ములు విసిరింది. ముసలివాడికి కొడుకు గాయం కనిపించింది కొమ్ముల్లో.

"ఊఁ... సీతమ్మా... ఊఁ—" వృద్ధుడు అభినయం చేశాడు. తన తలతో గడ్డిబొమ్మకు తాకు యిచ్చాడు.

"ఊఁ...సీతమ్మా...అదుగో...సాంబడు..."

సీతమ్మ తిరిగి మువ్వల్ని వూపింది. కాలితో నేల రాచింది. మరుక్షణంలో గడ్డి బొమ్మమీది ఎఱ్ఱ పూలు సీతమ్మ కొమ్ముల పైకెక్కి ముద్దెట్టుకొంటున్నాయ్.

సీతమ్మ వృద్ధుణ్ణి చూసింది. వృద్ధుడు నీళ్లు

నిండిన కళ్లతో సీతమ్మ వేపు చూశాడు. "సీతమ్మ కొమ్మలకు కొత్తసనుపు వచ్చింది" అనుకొన్నాడు. అనుకొంటున్నంతలో చెట్ల ఆకులు రాలిపోయినై.

* * *

అప్పలనర్సు ఒక్క "లగూన" వచ్చి—

"బావోయ్, సెంద్రయ్య మామొచ్చి నాడ్రోయ్" అన్నాడు ఆదిసేసుతో, లోపల నాగరత్తం విన్నది. ఆదిసేసు పైన కంషెవా వేసుకొని వెళ్లాడు.

"మాఁవా— యింత కబురు లేకపోయే... ఆఁచ్చుచ్చుళ్ళా... ఎట్టయి పోయినవ్... ఎట్టయిపోయినవ్..."

"భద్రాచెలం పొయ్యానుగా" అన్నాడు బాలచంద్రయ్య కొద్దిగా నవ్వటానికి ప్రయత్నించి.

నాలుగు క్షణాలు...

"నాగరత్తంకు పెళ్లి జేసినాం"

"ఓసి... అట్టనా...?"

"నలుగురు పెద్దలు సెప్పిన మాటల పెకారం సాంబడికిచ్చి అంటగట్టినాం"

బాలచంద్రయ్యకు ఆకాశం కనిపించలేదు.

...నలుగురు పెద్దలూ... సూదుల అప్పన్నా. గొల్ల నరిసిమ్మలూ, ఆది కేచవులు నాయుడు... గోడ్డావారి పెద్దబ్బాయి... బాలచంద్రయ్య కళ్లు మీద కొత్తాడు. ఆకాంతిని 'ఆదిసేసు' గూడా గమనించలేదు. దొడ్లో మువ్వలు మోగినాయ్. రణని నాదం వినిపించింది. సీతమ్మ అంకెలో.

* * *

సాంబయ్యకు మంచి ఆలోచనే పోయింది. బాలచంద్రయ్య ఆ యిల్లు కొస్తా నాగరత్తానికి రాసిస్తాడని ఆశవుంది. సంజవేళ యింటికొచ్చి— "మీ బాలయ్య మాఁవ వచ్చాడంట—" అన్నాడు భార్యతో.

"నువ్వు తోడురా...పోయి సూసొద్దాం". సాంబయ్య సంతోషం కళ్ళెం లేని గుర్రంవలె పరిగెత్తింది.

"నేను బోతుండా...నువ్వు కొస్త తాళిరా..." అని సాగిపోయాడు.

* * *

యుద్ధం ఆగిపోయిననాటి రణస్థలిలాగా వుంది ఆ సాయంత్రం. ఏ మూల జూసినా ఆకాశపు ఎఱుపు ప్రతిఫలిస్తున్నది. సాంబయ్య—దొడ్లో మెల్లగా కాలెట్టాడు.

"బాలయ్య బాబా! ఓ బాలయ్య బాబా—" ఎంతో ఆప్యాయంగా పిలిచాడు?

సీతమ్మ నీళ్లు తాగుతోంది. బాలచంద్రయ్య గాబుమొగన నుంచొని సీతమ్మను నమురాయిస్తున్నాడు.

"ఎప్పుడొచ్చావే అంట బాలయ్య బాబా" ముసలివాడు తలెత్తి చూశాడు. సాంబన్న కోర మీసాలమీద ఎఱ్ఱపూలు నిల్చినట్టుగా భ్రమించాడు.

"ఎవరు...? సాంబన్నా! యిదిగో వస్తిని."

వృద్ధుడు సీతమ్మ పిక్కమీద చరిచాడు. కొమ్మను గోటితో కొట్టాడు.

సీతమ్మ మోరెత్తింది. చంగణాలు తొక్కింది. అడవిలో పాటలాగా రంకె వేసింది. మువ్వలు మోగించింది. మువ్వలు మోగినాయ్, దక్షయజ్ఞంలో వీరభద్రుడి రుంజలవలె. సీతమ్మ ఆగలేదు. ముందుకు దూకింది. శివాలెత్తింది.

"సాంబయ్య వచ్చాడు సీతమ్మా."

సాంబయ్య కదలలేక పోయినాడు—ఆ విద్యుద్వేగం ముందు. గుండెలో సీతమ్మ వాడి కొమ్ములు దూరింతర్వాత కదిలాడు.

"అయ్యో...సచ్చాను...బాబో... బాలయ్య బాబూ..." మువ్వలే జవాబు.

నాగరత్తం గడపలో కాలు పెట్టింది. సాంబయ్య పేగులు కొమ్ములకు పొగా జుట్టుకొని సీతమ్మ స్వాగతం యిచ్చింది.

గాబుపక్క నెత్తురుముద్ద సాంబయ్య కనిపించాడు.

"మాఁవాఁ!...నా పసుంకుంకమ—" గొల్లుగా యేడ్చింది.

సీతమ్మ రెండడుగులు వెనక్కి పోయింది. బాలచంద్రయ్య రెండడుగులు ముందుకు వచ్చాడు.

"ఎఱ్ఱిమొగమా, నీ పసుంకుంకం కేవేఁ? సుబ్రమణ్ణెం బావ సచ్చాడనుకొన్నావా?"

నాగరత్తం ముఖాన కప్పుకొన్న పమిట కొంగు తీసి ఆ పిచ్చివాణ్ణి చూసింది. సీతమ్మ మువ్వలు తిరిగి మోగినాయ్.

* * *

బారెడు పొద్దు పోయాక బాలచంద్రయ్య సీతమ్మను స్మశానంవేపుతోలు కెళ్లాడు. స్మశానంలో బూడిదంతా మాయమైపోయింది. పచ్చగా, మృత్యు సన్నిధిలో కల్యాణాన్ని పాడుతున్నది. వృద్ధుడు, కొడుకు బండెడు కట్టెలమీద కెక్కిన చోటు, గుర్తు బట్టాడు.

"ఎంత గడ్డి మొలిచింది సీతమ్మా."

సీతమ్మ మువ్వల మోతకు పచ్చిక మొనలన్నీ తలలూపినై. బాలచంద్రయ్యకు కంపం వచ్చింది. నిలవలేక పచ్చికలో కూలబడ్డాడు—కళ్లుమూసుకొని.

# ఆచార్య శ్రీ నందలాల్ బోస

శ్రీ వేలూరి రాధాకృష్ణ

భారతకళాప్రపంచంలో ఇద్దరేఇద్దరు విశిష్టపురుషులు ప్రపంచవిఖ్యాతిని పొందినవారు. వారిద్దరూ గురుశిష్యులు. ఒకరు శ్రీ అవనీంద్రనాథటాగూరు. ఆయన శిష్యులు శ్రీనందలాల్‌బోసు.

భారతకళోద్ధారకులు శ్రీఅవనీంద్రులు. నవభారతకళకు పిత యనికూడా చెప్పకతప్పదు. ఆయన ప్రథమశిష్యగణమే నవభారతకళను పోషించి వృద్ధి పొందించుచున్నది! ఆ శిష్యగణంలో ప్రథమశ్రేణిలో ప్రథమస్థానాన్ని ఆక్రమించుకున్నవారు శ్రీనందలాల్ బోస్. ఆయన శ్రీ అవనీంద్రులవద్ద శుశ్రూష పూర్తిచేసుకున్నప్పణ్ణుంచీ, వారివద్దనే ఇతర ఏ వ్యాపారవ్యాప్తులూ లేకుండా కళారాధన చేశారు.. ఆయన ప్రథమంలో ఇంజనీరింగులో తర్ఫీదు పొందుతూ, శ్రీఅవనీంద్రుల సందేశాన్నందుకొని, ఆవిద్యావ్యాసంగానికి స్వస్తిచెప్పారు. అలా చేయటం, ఆయన తల్లితండ్రులకు ఏమాత్రం ఇష్టం లేదు. అయినా ఆయన లెక్కచేయలేదు.. గురుదేవులు శాంతినికేతనం నెలకొల్పినవెంటనే అక్కడ శిల్పకళాభవనానికి ఆచార్యులుగా నియమింపబడ్డారు. నేటివరకూ కళాభవనానికి ఆచార్యులుగానే ఉండి కళాసేవ నిరంతరం చేసుకుంటూ, అనేక యువచిత్రకారులని తర్ఫీదు చేసి, వారిద్వారా, భారతదేశమంతటా భారతకళామహత్త్వాన్ని జనబాహుళ్యానికి తెలియజేస్తున్నారు. ఆయన కేవలం భారతీయ శిల్పాచార్యులలో ప్రప్రథములే గాక, శ్రీఅవనీంద్రులతరువాత ప్రపంచమంతటా ఏకైక విశిష్టశిల్పిగాకూడా ప్రఖ్యాతి గాంచారు.

శ్రీఅవనీంద్రులవలె మంచి పరిశీలనాశక్తి అంతకన్న మరింత మిన్నయైన కల్పనాశక్తి కలిగినవారు శ్రీనందాబాబు. ఆ పరిశీలన ఆ సృష్టీ రెండూ కలిసి ఆయనను మహాస్రష్టగా రూపొందించినయ్! ఆయన ఏ ఇతర కళారీతినీ అవలంబించకుండా భారతీయ సాంప్రదాయాన్ని, వేయిరెట్లు పెంపొందింపజేస్తూ వారి ప్రత్యేకమైన, అనుగుణమైన శిల్పశైలిని ఏర్పరచుకున్నారు....శ్రీఅవనీంద్రులు భారతీయ సాంప్రదాయసిద్ధమైన కళకోసం, ఇ. బి. హావెల్‌తో కృషి చేస్తూ, అజంతావిషయం అజంతాచిత్రాలని, లండనులో ప్రచురించిన హెర్రింగ్‌హామ్స్ పోర్టుఫోలియోలో చూసి ఆనందించి, శిష్యులతోసహా అజంతా వెళ్లినపుడు శ్రీనందాబాబు, ఆ కళావైభవాన్ని కనులార చూచి, తన్మయత చెంది, ఇంకా తను చేయవలసిన పనంతా ముందరే ఉందనీ, అలాటి విశిష్టమైన కళాఖండాలని సృష్టించినప్పుడే తన జీవితం ధన్యమవుతుందని అనుకున్నారట! ఇప్పుడు శాంతినికేతన్‌లో ఏ భవనం చూచినా మళ్లా అజంతా సరిక్రొత్తరూపంలో ఇక్కడ అవతరించిందా? అనే ఆనందంతో కూడిన ఆశ్చర్యం కలగకమానదు.

శ్రీనందాబాబు భారతీయ సాంప్రదాయాన్ని తెలుసుకొని తన భావనాకౌశలంచేత, దానిని నిత్యనూతనం చేయటమేకాకుండా పరదేశ శిల్పవిశేషాలనుకూడా పుంఖానుపుంఖంగా నేర్చుకొని ఆ విజ్ఞానాన్ని అంతర్జాతీయంగా ప్రవర్ధిల్లిన వారి కళాఖండాలను సృష్టించటానికి ఉపయోగించారు! ఈ సృష్టికి దోహదమైంది వారి జపాన్‌యాత్ర! గురుదేవులు తమ వెంట అప్పుడు శ్రీనందాబాబును తీసుకువెళ్లారు. జపాన్ దేశంకూడా కళావిశేషంలో ప్రఖ్యాతిగాంచిన దేశం. ఆ దేశంలో విశ్వఖ్యాతి నార్జించిన తైక్వాన్, క్వాన్‌జాన్, హిదీషా, అరాయ్ మొదలైన ప్రముఖుల సాంగత్యంలో శ్రీనందాబాబు చాలా నేర్చుకున్నారు. వారివారి శిల్పాలలో నున్న విశేషకౌశలాన్ని చాల సులభంగా అలవర్చుకున్నారు. కాని దేనినీ అనుకరించటంమాత్రం చేయలేదు.

శ్రీనందాబాబు శిల్పం, హైందవచారిత్రిక వైభవానికి నూటికి నూరుపాళ్లూ సరిపోయేది. విజాతీయకళ, ఆయన కళ నెప్పుడూ వన్నంటి, ఆయన విశిష్టత్వాన్ని ఎప్పుడూ కుంటుపరచలేదు. చిరస్థాయిగా శాశ్వతానందాన్నిచ్చే, భారతీయశిల్పాలలో ఉండే అద్భుతత్త్వమే ఆయనకళాఖండాలలో గోచరమవుతుంది.

కాని ఆయనను వ్యక్తిగా చూస్తేమాత్రం మనకు వింత అభిప్రాయం కలుగుతుంది. ఆ అభిప్రాయం కొంత పరిచయంమీదకాని పోదు! దేహచ్ఛాయ నలుపు. పొట్టిగా, సాదాదుస్తుల్లో నిరాడంబరంగా కనిపిస్తారు. కళాకారుడు అనిపించుకునే బాహ్యరూపకమైన విశేషాలేమీ ఆయనలో లేకపోవటం మూలాన, ఆయనవిషయం తెలియనివారికి, ఆయ నేదో

సామాన్యుడే, విశేషం ఏమీ లేదనిపిస్తుంది...అదే ఆయనలో ఉండే విశేషం...బాహ్యాడంబరం ఆయనకు వెగటు! నిరాడంబరజీవనం, విశేషజ్ఞానోపార్జనే ఆయన ముఖ్యాదర్శాలు. జాగ్రతగా అతిసన్నిహితంగా పరిశీలించిన నాకు ఆయన యోగిపుంగవుడని తోచింది! మితభాషి. నిత్యపరిచింతన చేసే ఆయన ముఖవైఖరి నన్ను ప్రథమంగా ఆకర్షించినవి. ప్రతివానిలో ఆ కళాతృష్ణ కలిగించే రహస్యశక్తి ఆయనలో ఉంది. ఆయనవద్ద నేర్చుకుండే ప్రతి విద్యార్థి చేత, తండ్రివంటి వాత్సల్యంతో, విశాలహృదయంతో ప్రశాంతంగా కళాభ్యాసం చేయిస్తారు. అందువల్లనే విద్యార్థులందరికీ ఆయనంటే విపరీత గౌరవం, అపారమైన భక్తి విశ్వాసాలూ!

అసహనం, పదవీవ్యామోహం, మోసం, అపరిమితంగా పెరిగిపోతున్న ఈరోజుల్లో నిరాడంబరుడైన, సత్యకాముడైన, సౌందర్యోపాసకుడైన కళాకారుడికి అసలు స్థాన మెక్కడిది? నియమబద్ధం కాని, సత్యదూరమైన, సౌందర్యవిహీనమైన, చిత్రాలను చౌకబారుగా వ్రాసి, ప్రజలను మోసపుచ్చి, చిత్రకారులుగా చలామణి అవుతున్న ఆడంబరుల కివి రోజులు! వారికే ప్రజలు జేజేలు పెడతారు!...అలాటి సమయంలోకూడా ఎవరిప్రసక్తి అక్కరలేకండా తన నిరాడంబరజీవనంలోనే పరితృప్తిచెందుతూ పదవి బిరుదు అనే వ్యామోహాకమైన వాటిని లెక్కచేయక, నిత్యమూ సత్యస్వరూపమైన కళాసేవ చేస్తున్న శ్రీ నందాబాబు ప్రజలహృదయాల్లో ఇంకా నిలిచే ఉన్నారు! వారి హృదయాల్లో ఆయనకు శాశ్వతమైన స్థానమే లభించిందని నా నమ్మకం. ఎవరి పేరు మాసినా ఆయన ఖ్యాతి చిరస్థాయిగా ఉంటుందని చెప్పగలను...

శాంతినికేతనానికి ఎప్పుడూ ఎవరో యాత్రికులు రావటం పరిపాటి. ప్రథమంగా, ఎవరొచ్చినా, శ్రీనందాబాబును దర్శిస్తారు. ఆయనను చూడంగానే, ఆయనయెదుట వయస్సువిషయంలో ఎంత పెద్దవాళ్లయినాసరే వినమ్రులై సాష్టాంగనమస్కారం చేసి, ఆయన పాదధూళి తీసుకుంటూరు. ఆయన్లో ఉండే అద్వితీయశక్తికి ఇంతకన్న తార్కాణం ఇంకేం కావాలి?

పూర్వకాలంనుంచీ భారతశిల్పం, మతమూ ధర్మమూ అధ్యాత్మభావాలమీద నిర్మాణమై ప్రపంచంలో అగ్రగణ్యమై వెలసింది. కాని ఈ సాంప్రదాయాన్ని వీడి సరిక్రొత్తపంథాలలో కళాభ్యాసం చేసి, క్రొత్తపోకడలు చూపించాలని తంటాలుపడుతూ అందులో ఉత్తీర్ణులై ఉన్న వాళ్లున్నారు. అదే ఆనందదాయక మనీ, అదే అత్యుత్తమమనీ వాదిస్తున్నవాళ్లున్నారు. శ్రీ నందాబాబుకు అవిషయంలో వివిధమైన భేదాభిప్రాయం లేకపోయినా ఆయన ఆదర్శం ప్రస్తుత కళాకారు లందరికీ భిన్నంగానే తోస్తుంది. "ఒక్కొక్కప్పుడు పురాతనమైన, దివ్యమైన ఆధ్యాత్మికభావాలకి నవ్యరూపం ఇవ్వాల్సిన బాధ్యతకూడా మన చిత్రకారులమీద ఉంది. ఆ భారం నామీద వేసుకున్నాను. ఆ మహాకార్యం నేను నిర్వర్తించాలి. అప్పుడే నాజన్మ ధన్యమవుతుం" దన్నాడాయన ఒకసారి! నిజం కనుక్కోవాలంటే చాలా కష్టమే కాని, కాలం ఎదుట, ప్రజ్వలంగా భాసిల్లేది నిజమొక్కటే!!

శివుడూ, విష్ణువూ, లక్ష్మి, సీత, రాముడు, కృష్ణుడు, రాధ మొదలైన దివ్య శక్తిరూపాలు మనకు మామూలువిగానే కనిపిస్తయ్! 'వీటిలో క్రొత్త ఏముంది?' అని అనిపించటం మామూలు. కాని ఈవిధమైన భావన భారతీయ ఆధ్యాత్మికచింతకే విరుద్ధమైంది! కాని ఆ రూపాలనే, సరిక్రొత్త భావనారూపాలలో మన కందజేసింది శ్రీ నందాబాబు ఒక్కరే...

'మహాదేవుడు' విశ్వపాలకుడూ, మహాయోగి ప్రతిరూపం అనికూడా. ఈ భావాలు రెండూ వేర్వేరు అయినప్పటికీ, ఒక మహాశక్తే ఇన్ని రూపాలు దాల్చినట్లు మనకు తెలుసు. మళ్లా ఈ శక్తే 'నటరాజు' గా రూపమొందింది. 'నటరాజు' నాట్యకళకి ఆదర్శరూపం. ఈ మహాశక్తియొక్క వేర్వేరు రూపాలను సరిగా ప్రతిబింబించింది భారతదేశంలో శ్రీ నందాబాబు ఒక్కరే. ఆ ప్రతిబింబించిన రూపంలో రేఖల్లో, ఎంతటి ఉదాత్తత! ఎంతటి సౌశీల్యత!! ఆ విధంగా భారత భాగవతాది ఉద్గ్రంథాలలోని మహేతిహాసాలను విశిష్టరూపంలో మన కందజేసిం ఆ 'మాష్టర్ మహాశయు' లొక్కరే! ఆయన 'శివుని సంతాపము' మహాద్భుతమైన సృష్టి. సాటిలేనిది కూడా! ఆ మహాచిత్రాన్ని చూడగానే మనం ఆలోచనాలోకంలోకి మనకు తెలియకుండానే వెళ్ళిపోతాము. ఆ రేఖలలో ఉండే శక్తీ, వేగమూ అట్టి ఉదాత్తమైనవి! మహాశివుడు సంతాపం ఘనీభవింపజేసే ధ్యాన

ముద్రలో ఉంటాడు. శిరోజాలు చెల్లాచెదరుగా ఉంటయ్. కంఠాన్ని చుట్టివున్న సర్పం కదులుతున్నట్లూ, జీవం మూర్తిమత్తులా ఉట్టిపడుతున్నట్టూ దాని కళ్లు, శివుని ముఖాన్ని కౌతుకంగా పశ్చాత్తాపంతో చూస్తున్నట్లనిపిస్తుంది. ఉమాదేవి ఆయన తొడపై ఉంటుంది. మరొక్క క్షణంలో ఆ మహాశక్తి ఏ ప్రళయతాండవం చేస్తాడో అన్నంత భయస్ఫురణ కలుగుతుంది !! ఆ వర్ణసమ్మేళనంలోనూ, ఆ రేఖాగతిలోనూ, అద్వితీయశక్తి ఉందని మనకు తేలిగ్గా తెలుస్తుంది. ఆయన పౌరాణికపాత్రల నిర్మాణంలో, అన్నీ విశిష్టమైనవే. 'కైకేయి' 'అహల్య,' 'కర్ణుడు' 'అర్జునుడు' 'ఊరుసంతాపం' 'సహగమనం' 'సుజాత' మొదలైనవి.. ఆయన కళయే ఒక మహాగ్రంథంలాంటిది !!

ఆయన శిల్పశైలిలో ఉన్న శక్తి అంతా రేఖారీతుల్లోనే ఉంది. రంగులు ఎన్నో కనిపించవు. కాని సంపూర్ణత్వాన్ని కలిగిస్తయ్ ! అజంతా చిత్రాలలో ఉన్న రేఖా విలాసమే ఆయన చిత్రలేఖనంలో కూడా కనిపిస్తుంది. అందువల్లనే ఆయన చిత్ర నిర్మాణమంతా భారతసాంప్రదాయసిద్ధమైనది. ఆయన చిత్రాలలో, కనిపించేది మరియొక శక్తి. అది బాహ్యాడంబరం లేక ఆత్మానుభూతిని కలగజేసే శక్తి ! పురుష స్త్రీల వివిధ రూపవిన్యాసాలలో వివిధభావ ప్రదర్శనలలో, వివిధ అలంకరణవిధానాలలో అంతా మూర్తిమత్తులా మన ప్రాచీనభారత శిల్పవైభవాన్ని స్ఫురింపజేస్తుంది.

శ్రీ నందాబాబు కేవలం భారత భాగవతపురాణేతిహాసాల నిరూపించటమే కాకుండా శ్రీ గురుదేవునికి కడు సహాయకారిగా ఉండి ఆయన రచించిన ప్రతిగ్రంథానికి, అత్యద్భుతమైన, అనుగుణమైన చిత్రాలని వ్రాశారు. గురుదేవుని సచిత్రగ్రంథాలు ప్రపంచ మంతటా ఖ్యాతిచెందినవి. అందులో 'నటీర పూజా' అనే బౌద్ధనాటికకు వ్రాసిన శ్రీ నందాబాబు చిత్రాలు అత్యుదాత్తమైనవి. ఆ చిత్రాలే మళ్లా శాంతి నికేతనంలోని చీనాభవప్రాంగణాన భిత్తిచిత్రాలుగా, అజంతా చిత్రశైలిలో వెలిసినయ్ !! ఆయన అలంకరణ విధానంకూడా సాటిలేని శిల్పం. సిస్టర్ నివేదిత రచించిన *'Myth and Legends on Vishnu'* అనే గ్రంథంలో ప్రచురించిన 'గరుడ' అనే అద్భుతచిత్రం దీనికి తార్కాణం.

శ్రీ నందాబాబు మంచి ప్రకృతి చిత్రాలను కూడా రచించారు. అందులో సంథాలుల దైనందిన జీవనవిధానం అంతా, కేవలం రేఖలలో ప్రతిబింబించారు. 'పల్లె కాపరులు' 'గోధూళి' 'దూర ప్రయాణం' 'సంధ్యాదేవి' మొదలైన చిత్రాలు ఇతర ప్రస్తుతకళారీతులకు విన్నమై, అతివాస్తవికమై, మనకు చిరంతనమైన ఆనందాన్ని కలగజేస్తయ్..

శ్రీ నందాబాబు నిరాడంబరజీవనానికీ, ఆయన ప్రతిఫలాపేక్ష లేని నిత్యకార్యదీక్షకూ, మహాత్ముడు చాలా మెచ్చుకుంటూ ఉండేవాడు. మహాత్ముడు హరిపురకాంగ్రెస్ సమ్మేళనకు ఏర్పరిచిన స్థలాన్నంతనీ అలంకరించటానికి శ్రీ నందాబాబును పిలిచాడు : ఆయన అద్వితీయకౌశలంతో ఎడారివలె నిర్జీవమైన ప్రదేశాన్నంతనీ, అచిరకాలంలో, భారతీయ శిల్పసాంప్రదాయాన్నంతా, ఒకచో చేకూర్చి, అద్భుత తోరణ మందిరాలతోనూ, అతిసుందరమైన సింహద్వారంతోనూ భూతలస్వర్గం చేశారనటంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు..

శ్రీనందాబాబు యావజ్జీవ కృషి, ఫలితమే ఈ శాంతి నికేతనం. శాంతి నికేతన్ అంటే మరియొక అజంతా అనుకున్నాను నేను.. ఆయన అన్నారు :

"నా జీవితాన్ని శాంతి నికేతనానికి అంకితం చేశాను. కళాభవనమే నా శిల్పం. అందులో తర్ఫీదు పొందుతున్న విద్యార్థులంతా నా బిడ్డలు. వాళ్లు ఈ గురుకులాన్ని విడిచివెళ్ళి నా సత్యస్వరూపమైన ఈ శిల్పసందేశాన్ని ఎల్లెడలా చాటుతే నా జీవితం ధన్యమవుతుందిన్నమాటే. శిల్పంద్వారా సత్యాన్ని తెలుసుకోవటమే నా పరమావధి" అని.

ఇటీవల హిందూ విశ్వవిద్యాలయంవారు స్పెషల్ కాన్వొకేషన్‌లో, శ్రీనందాబాబుకు గౌరవ బిరుదు నిచ్చి సత్కరించారు. ఆయనకు గల నవంబరుతో అరవయ్యొకటవ సంవత్సరం వచ్చింది.. శ్రీ అవనీంద్రుల యెదుటే, ఆయనంతటి ప్రపంచప్రఖ్యాతి చెందటం, అవనీంద్రులకూ, ఆయన వ్యక్తిత్వానికీ, ఎంతో నిండు చేకూర్చింది !!

---

# వర మీరాయుని వేలుపు



ఇగ్నేజియో సైలోన్

నవంబరుమాసంలో ఒకనాటి సాయంత్రము. అప్పుడే ఇటలీలో ప్రత్యేక రక్షణశాసనాలను అమలులోకి తెచ్చారు. మేము కొందరం కలిసి, ఆ రాత్రికి మిలన్‌నగర పరిసరాల్లో ఒక తోట యింటిలో తల దాచుకొని, పట్టుబడకుండా తప్పించుకొన్నాము. ఆ యిల్లు అంతకుముందే మా కామ్రేడ్ ఒకడు చిత్రలేఖనవృత్తి మాటు పెట్టుకొని, అద్దెకు తీసుకొనిఉన్నాడు.

కార్మికపేటలలో వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి. మద్యశాలలు మూసేశారేమో నిశ్శబ్దంగా ఉన్నాయి. ఇళ్ళన్నీ చీకటిలో మునిగిపోయాయి. చలిమంచుకు ఈ కారుచీకటి తోడ్పాటంతో వాతావరణం, మరింత గుబులు పుట్టిస్తోంది. పోలీసు సైన్యాలు, అనుమానం ఉన్న యిళ్ళవరుసలపై శత్రు శిబిరాలను ముట్టడిస్తూన్న సంరంభంతో, దాడులు చేస్తూ సోదాలు సాగిస్తున్నాయి. అప్పటికే అరె

---

**ఇగ్నేజియో సైలోన్:**—పై శీర్షిక క్రింది **కథకులలో** ఇతడు రెండవవాడు.

ఇగ్నేజియో సైలోన్, 1900. మే. 1 వ తారీఖున పెసినా డై మార్సీ అనే గ్రామంలో జన్మించాడు. ఈ గ్రామం దక్షిణ ఇటలీలోని అబ్రుజ్జీ అపినైన్సు రాష్ట్రంలోనిది. తండ్రి చిన్న భూస్వామి. తల్లి తరపు వారు సాలె కుటుంబీకులు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో, ఇతని పదునేడవ ఏట, అబ్రుజ్జీ జిల్లాలోని కర్షకోద్యమానికి కార్యదర్శిగా ఉండేవాడు. యుద్ధవ్యతిరేక ప్రదర్శనాలతో తీవ్రమైన తిరుగుబాటు లేవదీసినందుకు కోర్టులో హాజరు కావలసి వచ్చింది.

1921 లో ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ సంస్థాపనలో పాల్గొన్నాడు. రోమ్‌పట్టణంలోని, "అవన్ గార్డియా" అను వారపత్రికకు, ట్రీస్టిలో, "లేవొరేటరి" అనే దినపత్రికకు సంపాదకుడుగా ఉండేవాడు. ఫాసిస్టు ప్రతికూలులపై, ప్రత్యేక శాసనాలు అమలుపరిచాక కూడా ఇటలీలో ఉంటూ, చట్టవిరుద్ధ పత్రికలను ప్రచురిస్తూ ఉండేవాడు. 1930 లో జైలు శిక్ష పడి, విడుదలై, పెక్కుదేశాలలో బహిష్కృతుడయి, చివరికి స్విట్జర్లాండు చేరుకొని 1944 దాకా అక్కడే గడిపి, తర్వాత మళ్ళీ ఇటలీ చేరుకొన్నాడు.

1930 లో కమ్యూనిస్టుపార్టీనుండి వెలికి వచ్చేశాడు. పదేళ్ళ తర్వాత 1940 లో ఇటాలియన్ సోషలిస్టుపార్టీ విదేశ శాఖకు నాయకత్వం స్వీకరించి, రాజకీయ ప్రాబల్యం తెచ్చి "థర్డు ఫ్రంట్" నిర్మించాడు.

ఇతని గ్రంథాలు; ఫాంటమారా-నవల 1930; బ్రెడ్ అండ్ వైన్-నవల 1937; స్కూల్ ఫర్ డిక్టేటర్సు-సంభాషణలు 1938; సీడ్ బినీత్ ది స్నో-నవల 1940; అండ్ హి డిడ్ హైడ్ హిమ్సెల్ఫ్-నాటకం 1944.

స్టయినవాళ్ళ సంఖ్య చాలా ఉంది. సోదాల ఫలితంగా నైతేనేమి, గూఢచారులు ఇచ్చిన పట్టికలవల్లనేమి, పట్టుబడ్డవారిలో బలహీనులు పోలీసులబాధ పడలేక భయపడిపోయి బైటపెట్టిన పేర్లవల్ల నేమి, ఈ సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతోంది.

తక్కిన పట్టణాలలోనూ, రాష్ట్రాలలోనూ కూడా ఇదే జరుగుతూంది. ప్రభుత్వప్రతికూలపత్రికల నన్నిటినీ అప్పుడే అణిచేశారు. ప్రచురణలో మిగిలిన పత్రికలను, అరెస్టులవిషయం ప్రచురించక అందుకు బదులు ఇటాలియన్ నియంతృత్వాన్ని పొగడుతూ ఇతర దేశాల ప్రజాస్వామ్య నాయకులు చేస్తూన్న ప్రసంగాలను ప్రచురించవలసిందిగా తాఖీదులు వచ్చాయి.

అయినప్పటికీ, మా పార్టీ వార్తాహరులలో మిగిలిన లవాళ్లు ముగ్గురు నలుగురూ, ఆయా స్థానిక ప్రతినిధుల వద్ద సేకరించి కేంద్రనిగూఢకార్యాలయానికి చేర్చిన వార్తలను బట్టి, నియంతృప్రభుత్వము, ఏ స్వల్పప్రాతికూల్యాన్నిగూడా సహించబోదని, రూఢి అయిపోయింది.

ఏమాత్రమైనా సమర్థమైన నిగూఢసంస్థ అంటూ ఉంటే ఒక్క కమ్యూనిస్టులకే ఉంది. కాని వివిధ రాష్ట్రాలలోనూ కూడా, ఈ దాడులవల్ల, మా రహస్య ఉద్యమజాలాన్నంతను, తమకు తెలియకుండానే, పోలీసులు పూర్తిగా భగ్నం చేసేశారు.

పట్టుబడకుండా తప్పించుకొన్న కామ్రేడులనేకమంది, కొత్తపట్టణాలలో తమకు తలదాచుకొనేందుకు శాశ్వతమైన తావుగాని, ఎక్కడికన్నప్రయాణమయిపోయి మళ్ళీ ప్రారంభించేందుకు, దొంగప్రయాణపత్రాలను గాని, అమర్చిపెట్టమంటూ అడగసాగారు.

కొంతకాలంక్రిందటనుంచీ మారుపేర్లతో, ఏ అమాయికవృత్తో బురఖాగా తగిలించుకొన్న మాలో కొందరి పని కొంతనయంగానే ఉంది. కాని ఖైదులో పడ్డవాళ్లు చెప్పేసినా, లేక అజాగ్రత్తగా ఏమాత్రం ఆచోకీ అందిచ్చినా పోలీసులు మావెంట బడే ఆపత్తు ఉంది.

ఆరోజు సాయంత్రం, పోలీసులు మాయింటి చుట్టూ కాపలా కాస్తున్న అనుమానం వేసి, నన్ను యింటికి రావద్దని కబురుచేశారు. అందుకని, అదే స్థితిలో ఉన్న మరికొందరి కామ్రేడులతో కలిసి ఆ రాత్రికి, ఊరుబయట 'చిత్రలేఖకుని' ఇంటిలో తలదాచుకున్నాము. బైట పరిసరాల్లో ఒక మనిషిని కాపలా ఉంచాము. దాడి జరిగితే ఏమేమి చేయాలో ఎల్లా తప్పించుకోవాలో, అంతా నిర్ణయించుకొని, ఇంక కుర్చీలలో కూర్చుని, (ఆ చిన్న ఇంట్లో పడుకునేందుకు, ఒక్క మంచమినహా, పక్కలుగాని జాగాగాని లేవు) రాత్రంతా జాగరణం చెయ్యసాగాము.

మాలో ఒక 'దంతవైద్యుడు', ఒక 'స్పానిష్ విదేశసంచారి', ఒక 'తాపీమేస్త్రీ', ఒక 'జర్మనీ యువతి, విద్యార్థి' ఉన్నాము. ఇన్నీ మారుపేర్లే. బూటకపు వృత్తులే. అప్పటికి ఒక రెండేళ్ల క్రితం నుంచీ మాలో పరస్పరం పరిచయాలున్నాయి. కాని ఆనాటిదాకా నిగూఢఉద్యమ వృత్తిలో వివిధశాఖల సమన్వయపు పరిచయంమాత్రమే తప్ప, పరస్పర స్నేహాలు లేవు.

'దంతవైద్య' డన్నాడు.

"మధ్యాహ్నం సంగీతమహాలువీదుగా వస్తూ చూశాను. జనం మరుసటి కచ్చేరీకి టిక్కెట్లు కొనుక్కొనేందుకు, 'క్యూ'లో నిలబడి ఉన్నారు. ఒక్క నిమిషం ఆగి చూశాను. పిచ్చివాళ్లు బారుతీర్చి కదులుతున్నట్టనిపించింది."

"పిచ్చివాళ్ళెందుకని? సంగీతం, పిచ్చ అనా నీ అభిప్రాయం" అని "స్పానిష్ విదేశసంచారి" అడిగాడు.

"మామూలు రోజుల్లో కాదనుకో! కాని ఇల్లాంటి కాలాల్లో, జనం సంగీతకాలక్షేపాలు ఎల్లా చేయగల్గుతారు? నిజంగా పిచ్చివాళ్ళె అయి ఉండాలి" అన్నాడు దంతవైద్యుడు.

"సంగీతం, ఎల్లప్పుడూ, వట్టి కాలక్షేపం మాత్రమే కాదు" అన్నాడు సంచారి.

'చిత్రకారుడు' అందుకొన్నాడు.

"ఆ సంగీతం-పిచ్చివాళ్లే, ఇప్పుడు మన్ని చూసి, ఎవ రెవరము ఏం చేస్తున్నామో అంతా వింటే, వాళ్ళూ మనని పిచ్చివాళ్ళక్రిందే జమకడ్తారు. ఎవళ్లు నిజమైన పిచ్చివాళ్ళో కనుక్కోటం అంత తేలికైన పని కాదు. అది బహుకష్టమైన శాస్త్రం."

సంభాషణ పట్టుతున్న ధోరణి దంతవైద్యుడికి నచ్చలేదు.

"మనలాగా స్వేచ్ఛ వదులుకొని జీవితానికి తెగిస్తున్న వాడెవడూ, ఈ సంఘర్షణలో మనిషి కొనసాగు పైవాడిలాగా ఆలోచించటం కుదరదు" అన్నాడు తీవ్రంగా.

"సంఘర్షణలోకి ఉరకవచ్చు. శత్రువును దెబ్బలు కొట్టవచ్చును. కాని శత్రువును కాలికింద రాసి తుపాకి మడమతో చితగ్గొట్టవలసిన అగత్యం లేదు. తలకాయను అంతకన్నా మంచిపనులకై మిగుల్చుకోటం మంచిది కాదా" అని చిత్రకారుడు ఎదురు చెప్పాడు.

"మనం చేస్తున్న యుద్ధం భావాలతో మటుకు యుద్ధం కాదా ? ఇందులో నీ మెదడు మునగవలసిన పని లేదా" అని సంచారి అడిగాడు.

"ఇందులో తల మునిగిన మాట నిజమే, కాని నా కళ్లు మూంచలేదు." అంటూ చిత్రకారుడు చిరునవ్వుతో జవాబు చెప్పాడు. "అంటే ఏం చేసినా కళ్లు తెరిచి మాస్తూనే ఉంటాను."

"నువ్వు చేసే కొత్త పనికి, మాతో ఉండటం వల్ల కలిగే ఇంతటి మహా అపాయానికి ఎందుకు తెగిస్తున్నావో నాకు అర్థం అవటంలేదు" అన్నాడు దంతవైద్యుడు.

అందరూ కొద్దిగా విన్నబోయి ఊర్కొన్నారు. రోడ్డుమీద మిలిటరీ సిపాయిల సమ్మర్దంతో పరుగెత్తుతున్న మోటారు ట్రక్కులు, కిటికీలోంచి కనబడుతున్నాయి. ఇంటి ఇల్లాలు కిటికీతలుపులు మూసేసి, మా కందరికీ మంచి కాఫీ తయారుచేసి యిచ్చింది.

కొత్త కామ్రేడులలో ఉల్లాసం చేకూర్చేందుకు మళ్ళీ సంచారి అందుకున్నాడు.

"మన శకంలో అన్ని మార్గాలూ కమ్యూనిజానికే చేరుస్తాయి. కాని, అందరమూ ఒకే దోవను బట్టి కమ్యూనిస్టులం కాలేము."

"నా జీవితాన్ని, కార్మికవర్గ విప్లవానికై ఒడ్డాను." అంటూ చిత్రకారుడు చెప్పసాగాడు. "అయితే నా కన్నులుకూడా ఒడ్డేయలేదంటే, నా జీవితానికి ఏం జరుగుతుందో చూసుకొంటూండే హక్కుమాత్రం మిగుల్చుకొన్నాను. కాని, జీవితం పూర్తిగా ఒడ్డేయటంమాత్రం ఎప్పుడో జరిగిపోయింది. ఇల్లాగే నా చిన్నప్పటి స్నేహితురాలొకర్తె, ఆముష్మిక సౌఖ్యానికోసం జీవితాన్ని ఒడ్డి, ఐహికసౌఖ్యజీవితాన్నంతా ఒగ్గేసి సన్యాసినిగా చేరిపోయింది. ఇల్లా ఒడ్డిన నా జీవితాన్ని మళ్లీ వెనక్కు మరల్చుకొనేది లేదని మీకు హామీ యిస్తున్నాను. ఎందుకు వెనక్కు తీయాలి? నా నిజాయితీ శంకించవలసిన హక్కు ఎవరికీ లేదు."

"కార్మికవిప్లవం జూదపు ఆట కాదు" అంటూ దంతవైద్యుడు తీవ్రంగా అన్నాడు.

"ఈ ఆట నెగ్గటం, అదృష్టంమీద ఆధారపడి లేదనీ, మన పార్టీబడులలో చెప్పే, విషయాలమీదా, ఆటగాళ్ల శక్తి చాకచాక్యాలమీదా ఆధారపడిఉందనీ నాకూ బాగానే తెలుసును. అందుకనే, కేవలం జూదగాడిగానే కాకుండా, ఆటలో ఒకణ్ణిగా, మునిగిపోయి తన జీవితసర్వస్వాన్ని ఆటలో నిమగ్నం చేసినవాడిగా, పాల్గొంటున్నాను. సర్వస్వం అంటే, కన్నులు మినహా అనిమాత్రం చెప్తున్నాను."

"నా కర్థంకావటం లేదు" అన్నాడు దంతవైద్యుడు.

"అంటే, నేను కళ్లకు గంతలు కట్టుకోటానికి ఒప్పుకోనంటున్నాను. నానుంచి మీరు ఆశించే పనులన్నీ చేస్తాను. కాని, కళ్లు తెరుచుకొనిమాత్రం చేస్తాను."

"సరే పోనీ ! కాని, నువ్వు ఏ జూదం ఆడుతున్నావో అందులో నిజంగా నీకు కుతూహలం ఉన్నట్లు నాకు అవగతం అవటంలేదు. క్షమించితే ఒక టడుగుతాను. ఇతరపరిస్థితులలో అయితే నువ్వు నీ జీవితాన్ని, ఇంక దేనిమీదో—యుద్ధమో, దక్షిణ ధృవానికి ప్రయాణమో, కుష్ఠువాళ్లకు సేవో, తార్పుడువృత్తో, దొంగనాణాలు చెయ్యటమో—దేనిలోనైనా పణంగా పెట్టి జూదం ఎందుకు ఆడి ఉండకూడదూ?—" అంటూ సంచారి అడిగాడు.

"ఎందుకు కూడదు ? కాని, నువ్వు అన్న ఈ ఉద్యోగాలు ఏవి చేసినా, నా కళ్లు తెరుచుకొని

ఊంచుకొనేందుకు, అర్థం చేసుకొనేందుకే ప్రయత్నించి ఉంగును." అంటూ పకపక నవ్వుతూ చిత్రకారుడు జవాబు చెప్పాడు.

"కమ్యూనిస్టు అవటం పుటకతోనే వస్తుంది" అంటూ జర్మన్ అమ్మాయి ఉద్ఘాటించింది.

"కాని, పెరిగి మనిషి అవుతాడు కదా" అన్నాడు చిత్రకారుడు.

"సరే, అయితే కమ్యూనిజానికి నీ జీవితాన్ని ఒడ్డిన పరిస్థితు లేమిటో మాకు చెప్పగలవా?" అని దంతవైద్యుడు అడిగాడు.

"అదంతా ఒక పెద్ద గాథ. అదీ కాకుండా, ఉన్నమాట చెప్పాలంటే కొన్ని విషయాలు మీకు అర్థం అవవుకూడా!" అని బరువుగా అన్నాడు చిత్రకారుడు.

"ఆ అర్థం అవని పెద్దగాథ కాస్త చెపుమా— అందరం కాఫీలు త్రాగి వింటూ జాగరణం చేస్తాం" అంటూ జర్మన్ అమ్మాయి పట్టుపట్టింది.

చిత్రకారుడు చిరునవ్వుతో, "మరి మీరంతా కూడా మీ కథలు చెప్తారా" అని అడిగాడు.

"ఓ! సమ్మతే! అందరం కాఫీలు త్రాగి మేలుకొని కూర్చుందాం" అన్నాడు దంతవైద్యుడు.

"సరిగ్గా ఆలోచించుకోండి," అంటూ చిత్రకారుడు హెచ్చరించాడు. "యుద్ధమధ్యంలో ఉన్న మనకు, నాకుకూడా—ఇప్పుడు వెనుదిరిగి చూసుకొని, ఏమిటి, ఎందుకు, అంటూ తర్కించుకోవటం చాలా ప్రమాదకరం కావచ్చును. ఆట మొదలయి ఒక స్థితి వచ్చాక ఇక వెనక్కు తిరగటానికి వీ లుండదు. మధ్యలో నృత్యం వదిలిపోతా ననేందుకు వీలులేదు."

"సంఘర్షణనూ, సంఘర్షణలో చేరటానికి కల ఉద్దేశాలనూ ఎవరైనా వేరు వేరుగా ఎల్లా విభజిస్తారు? కమ్యూనిజంలోకి మనని తెచ్చిన ఉద్దేశాలను జ్ఞాపకం తెచ్చుకోటం ఎల్లా ప్రమాదకర మవుతుంది" అంటూ సంచారి అడిగాడు.

"రాత్రి ఇంకా చాలా ప్రొద్దుంది. మన మన "అర్థం కాని" కథలనూ అందరమూ చెప్పుకొందాము. కాఫీ త్రాగి మేల్కొని ఉందాం" అంది జర్మన్ అమ్మాయి.

అల్లా ఒక్కొక్కళ్లమే ఎల్లా, ఎందుకు, కమ్యూనిస్టుల మయిందీ కథలు చెప్పుకొంటూ రాత్రి గడిపాము. ఎల్లాగ, ఎందుకు, అన్న ఆ వివులీకరణలు మాత్రం పరిపూర్ణం కావు. కాని, సూర్యోదయమయే టప్పటికి అందరం స్నేహితుల మైపోయాము. "ఈ రోజుల్లో ఏదోవను పట్టయినా కమ్యూనిజానికి జేర వచ్చు ననేది నిజమే" అని ఒకళ్లకొకళ్లం చెప్పుకొని విడిపోయాము.

మసుసటి సంవత్సరమే ఆ బూటకపు దంతవైద్యుని పట్టుకొన్నారు. స్నేహితులపేర్లు చెప్పమని నానాహింసలు పెట్టారు. అతను చెప్పలేదు. జైలులోనే చచ్చిపోయాడు.

బూటకపు చిత్రకారుడు ఫాసిజం నిర్మూలమయి, యుద్ధం ఆఖరయేదాకా తన రాజకీయ కార్యకలాపాలు సాగించుకొంటూనే వచ్చాడు. ఆతర్వాత తన మామూలు జీవితంలోకి మరలిపోయాడని అనుకొంటాను. 'జర్మన్ అమ్మాయి' విషయం తర్వాత విననే లేదు.

ఆ రాత్రి చెప్పుకొన్న విషయాలమీద తర్వాత చాలామాట్లు ఆలోచించాను. అప్పటికి, నా కార్యకలాపంలో నాటినాటికీ వస్తున్న మార్పులనూ, ఈ కార్యదీక్ష గైకొన్ననాటి ఉద్దేశాలనూ, అర్థం చేసుకొని, పోల్చి చూచుకొని, యాథార్థ్యం తెలిసికోవలసిన గట్టి అగత్యం కలుగుతూ వచ్చింది. నేను చేసిన స్వల్ప సాహిత్యసేవకు సార్థకత ఏమైనా ఉందా అని పారచూసుకొంటే, క్రియకు—తేలిన సారాంశ మిదీ; ఎంతో బాధాకరంగా జరిగిన తెగతెంపులకు, తెగతెంపులు జరిగినా ఇంకా విస్తృతంగా ఉన్న భక్తికీ, అర్థ మేమిటో, స్వరూప మేమిటో, పరిమితు లేమిటో, స్పష్టంగా నిర్వచించి, విప్పి చెప్పుకొని, ప్రామాణిక మొనగ్చుకొంటే తప్ప, మనస్సుకు శాంతి కలగని అవసర సమయం ఒకటి నాలో కల్గింది. ఏవో కొన్ని పుణ్యముహూర్తాలలో తప్ప, రచన సాగించటం, కేవలం కావ్యానంద విషయంగా నాకు అనుభూతం కాలేదు. ఎప్పుడూ, ఏకాకిగా బాధ అనుభవించవల్సిన సంఘర్షణగానే తయారయింది. ఒకొక్కప్పుడు ఎంతో యాతనపడి సాగించే, నాభావ ప్రకటనలో, చిక్కులూ, అసమర్ధతలూ, సంభవిస్తే, అవి సత్కావ్యనిర్మాణ సూత్రాలు

తెలియకపోవడంవల్ల వచ్చినవి కావు. అంతరాత్మవల్ల కలిగినవి. మనసులో ఎన్నటికీ మానని గాయాలకు మందు రాచి ఉపశాంతి చేసేందుకు ఆ అంతరాత్మ ఎంతో ప్రయత్నిస్తూనే ఉంది. కాని నిత్యం తన పారిశుద్ధ్యాన్ని మాత్రం గౌరవించి తీరవలసిందే, అని మొండిపట్టు పట్టుకొని కూర్చుంటుంది. ఋజుత్వం ఉండాలంటే, కేవలం శ్రద్ధామాత్రులం అయినంతతో చాలదు.

## ౨

౧౯౧౪ నుంచీ నేను సోషలిస్టు యువజన సంఘ సభ్యుడను. ౧౯౨౧ లో, లెగ్‌హార్న్‌లో ఇటాలియన్ కమ్యూనిస్టుపక్షు స్థాపన జరిగినప్పుడు, దాంట్లో చేరి యువజనసంఘంలో ఎక్కువ భాగం నాతోపాటు లాక్కొని వచ్చేశాను. యుద్ధకాలం నుంచీ కూడా సోషల్ - డెమోక్రసీ - సరిదిద్దుడు విధానాన్ని తీవ్రంగా విమర్శిస్తూవచ్చినవాళ్లమేమో, మేము కమ్యూనిస్టుపార్టీలో చేరటం ఎవడికీ ఆశ్చర్యం కల్గించలేదు.

ఆ నవంబరునాటి రాత్రి, నా కథ స్నేహితులకు చెప్తూ, ౧౪ వ ఏట విద్యార్థిగా ఉండగానే 'జిమ్మర వాల్డు' సామ్యవాదానికి ఎల్లా భక్తుడ నయానో వివరించాల్సి వచ్చినప్పుడు, నాలో వ్యక్తిత్వం వచ్చిననాటి విషయాలను ఒక్కొక్క అడుగే వెనక్కు తవ్వుకొంటూపోతూ, జ్ఞాపకానికి తెచ్చుకోవలసివచ్చింది. రాజకీయరూపం అందుకొనేటప్పటికి తీవ్రరూపం తాల్చక తప్పకవచ్చిన, ఏ సాంఘిక దృక్పథం నాలో ఏర్పడుతూ వచ్చిందో, దానిని పునః పరిశోధించుకోటంలో పసితనంలో జరిగిన విషయాలుకూడా చెప్పుకొంటూరావలసి వచ్చింది.

దక్షిణ ఇటలీలో కొండజిల్లాలలో నేను పుట్టి పెరిగాను. కొత్త నాకు బుద్ధి తెలిసేటప్పటికి, నా మనస్సుకు ఒక విషయంమాత్రం బాగా హత్తుకుపోయింది. కుటుంబ వ్యక్తులుగా, సక్రమ శిక్షణతో, ధర్మబుద్ధితో, న్యాయవర్తనులై సజ్జనులుగా ప్రవర్తించటం—సంఘంలోకి వచ్చేటప్పటికి మొరకులై, పరస్పర విద్వేషాలతో, కుట్రలతో, మోసంగా వ్యవహరించటం—మనుష్యులలోని ఈ విపరీత ఘోర, అసంబద్ధ, అమానుష, అనర్థక వ్యత్యాసం నా మనస్సుకు హత్తుకుపోయింది.

దక్షిణరాష్ట్రాల దారిద్ర్య నైరాశ్యాలను గురించిన మహా బీభత్సకరమైన కథలు అందరికీ తెలిసినవే చాలా ఉన్నాయి. నేనూ కొన్ని వ్రాశాను. కాని ఇక్కడ అల్లా తుఫానులు రేపిన ఘట్టాలను కాక, దైనందిన జీవితంలోని చిన్న చిన్న సంఘటనలనే చెప్పదలచుకొన్నాను. ఈ మామూలు చిన్న విషయాలవల్లే, ఏ జనాభామధ్యంలో నేను పెరిగానో, ఆ జనుల ద్వంద్వజీవితం నా కన్నులబడి, ఎదిగే ఈడున, నా మనస్సును చాలా క్షోభపెట్టింది.

నా చిన్నప్పుడు, ఐదో ఏట, ఒక ఆదివారం నాడు మా అమ్మచెయ్యి బట్టుకొని నడుస్తూన్నాను. మా ఊరిమధ్య కూడలి దగ్గరకు వచ్చి, ఇటునుంచి అటు దాటుతున్నాము. ఒక క్రూరదృశ్యం నా కళ్లబడ్డది. ఊరి పెద్ద ఒకాయన తన పెద్ద పెంపుడు కుక్కను, ఒక బీద దర్జీఅమ్మి మీదకు ఉసికొల్పాడు. కుక్క ఆ అమ్మిని కిందపడేసి ఒళ్ళంతా కరిచి బట్టలన్నీ చించేసింది. ఊరందరికి మహా చెడ్డకోపం వచ్చింది. కాని ఎవళ్లూ కిక్కురు మనలేదు. ఆ పెద్ద మనిషిమీద దావా వేద్దామని ఆ అమ్మికి ఎల్లా ఊహ కలిగిందో నాకిప్పటికీ అర్థం కాదు. కాని దావా వేసింది.పక్ష పాటుకు, కోర్టు న్యాయ విచారణ నాటకపు వెక్కిరింత తోడయింది. ఆమె తరఫున వకాలతీ, పుచ్చుకొనే ప్లీడరు లేకపోయాడు. మేజస్ట్రేటు ముందర చెప్పేందుకు ఆమెతరఫున ఒక్క సాక్షీ కూడా దొరకలేదు. 'వామపక్షవాది' అంటూ ఊళ్లో పలుకుబడిఉన్న ప్లీడరుగారు, ఊరిపెద్ద తరఫున వకాలతు పుచ్చుకొని సరిగ్గా వేళకు తయారయాడు. ఊరిపెద్ద తరఫున కూటసాక్షులు కావలిసినంతమంది దొరికారు. ఆ అమ్మే, ముందర కుక్కను రెచ్చగొట్టి అల్లరి పెట్టిందని సాక్ష్యంలో తేలిపోయింది. మేజిస్ట్రేటు, కేసు కొట్టేసి, పెద్దమనిషికి ఆ అమ్మి ఖర్చులు ఇచ్చుకోవలసిందిగా తీర్పుఇచ్చాడు.

ఉద్యోగరీత్యా కాకుండా మామూలుగా చూసుకొంటే ఆ మేజస్ట్రేటు చాలా సత్పురుషుడే. ధర్మభీతి, దయాబుద్ధీ కలవాడే. ఎప్పుడో మా యింటికి వచ్చినప్పుడు అన్నాడు. "నిజంగా ఆ కేసులో నాకు చాలా బాధే వేసిందంటే నమ్మండి. కాని ఉద్యోగ

ధర్మం, తప్పదు: ఎందుకూ, నేను స్వయంగా నిజంగా జరిగిన దంతా చూసి ఉన్నాకూడా, తీర్పు మాత్రం ఇల్లాగే ఉండక తప్పదు. న్యాయాధిపతి, న్యాయ విచారణలో తన స్వంతభావాలకూ, రాగ ద్వేషాలకూ తావియ్యకూడదు." అంటూ నీతిబోధన కూడా మేళవించిచెప్పసాగాడు.

"చూశారా! ఎంత అభాజనపు ఉద్యోగమో! మన మానాన మనం ఇంటిపట్టు చూసుకోవాల్సిందే తప్ప ఇల్లాంటి వృత్తుల కెగబడకూడదు. అబ్బాయి! పెద్దవాడి వయాక ఏ ఉద్యోగం అయినా చెయ్యిగాని జడ్జీపనిమాత్రం చెయ్యకు" అంటూ మా అమ్మ నాకు హితవు గరిపేది.

ఇల్లాంటివే చిన్న చిన్న విషయాలు ఇంకా చాలా చెప్పవచ్చును. కాని వీటివల్ల మాకు ఉత్తమ సత్య ధర్మసూత్రాలు, తెలియవనిగాని, అవంటే తిరస్కార మనిగాని భావించకూడదు. పైపెచ్చు, బడిలో, దేవ సన్నిధిలో, ఉత్సవసమావేశాలలో, నిత్యం ఈ మహ ద్విషయాలన్నిటినీ బోధచేస్తూ చర్చిస్తూనే ఉండే వారు. కాని ఆ చర్చలూ, బోధలూ నిర్గుణపద జాలంలోనే జరిగేవి. మా పరిస్థితిని ఇంతకన్నా స్ఫుటంగా నిర్వచించాలంటే, లోకతంత్రము అంతా పిన్నలూ పెద్దలూ అందరికీ తెలిసిన, మాయానటన మీద ఆధారపడి ఉండేది. అందరికీ తెలుసు. కాని మనుష్యుల అజ్ఞాన మూఢత్వాలమీద కాక, ఇంకా బలీయమైన, వేరేదో ప్రాథమిక ప్రకృతిమీద ఆధార పడిందేమో, ఆ మాయానటన అల్లా సాగిపోతూనే ఉండేది.

మా బడిపంతులే చర్చిలో పూజారికూడా. మమ్మల్ని, పిల్లల్నందరినీ ఒకసారి వీధినాటకానికి తీసి కెళ్లాడు. ఆ నాటకంలో ఒక చిన్న పిల్లవాణ్ణి రాక్షసుడు పెట్టే హింసలు వస్తాయి. నాటకరంగంమీదికి పిల్లవాడొక్కడూ వచ్చాడు. రాక్షసుడు తరుము కొస్తున్నాడని భయంతో వణికిపోతున్నాడు. ఎక్కడ దాక్కుందామా అని ఇటూ అటూ చూసి, రంగం మారుమూలనున్న ఒక బల్లక్రింద నక్కాడు. రాక్షసుడు ఉరుముకొంటూ రంగంమీదికి ప్రవేశించి పిల్లవాడికోసం వెదుకుతున్నాడు. పిల్లవాడు కనబడ లేదు. "ఇక్కడ సభాసదులలో సత్పురుషుల నడుగుతా" అంటూ మావంక తిరిగి, "చిట్టిబాబులూ, ఈ కొంటెపిల్లాడెల్లా వెళ్లాడో తెలుసునా" అంటూ మమ్మల్నడిగాడు. పిల్లలందరమూ ఐక్యకంఠంతో "ఇక్కడ లేడు—అటు వెళ్లిపోయాడు" అని చెప్పాము. ఆ మాటలు మాకు ఒకళ్లు చెప్పి పెట్టినవి కావు. నాటకంలో ఇల్లా జరుగుతుందని మాలో ఒక్క పిల్లకాయకూ తెలియదు. కాని, అందరం హృదయాలలోనుంచి పుట్టుకొచ్చినట్టుగా ఒకేసారి ఐక్యకంఠంతో ఆ మాటలు అన్నాం.

మర్నాడు క్లాసులో నాటకరంగందగ్గిర మా ప్రవర్తననుగురించి పంతులకూ, మాకూ వివాదం జరిగింది. పిల్లలం అబద్ధం ఆడామనీ, ఎప్పుడూ అబద్ధం ఆడకూడదనీ పంతులన్నాడు. అటు రాక్షసుడు పిల్లవాడిని హింస పెట్టున్నాడు. మేం అమాయకపు పిల్లవాడిపక్షాన చెప్పాం. మేం చెప్పింది న్యాయమే నని మేము వాదించాం. ఉద్దేశం మంచిదయినా ఆడింది అబద్ధమే అంటూ పంతులు వాదించాడు. సత్యం, అసత్యం వీట్ల స్వరూపాన్ని మాకు వివరించసాగాడు. "పిల్లవాడెక్కడ దాక్కున్నాడో రాక్షసుడికి చెప్పాలా, అక్కర్లేదా ఒక్కమాట చెప్పండి" అన్నాం. "అది కాదు సంగతి. అబద్ధం అబద్ధమే. అది మహాపాపమూ, మామూలు పాపమూ, కొద్ది పాపమూ అని కాదు ప్రశ్న. అబద్ధం పాపం; నిజం పుణ్యం. అదీ నేను చెప్పేది" అంటూ చిరాకుతో సాగించాడు.

ఆగబట్టలేక నేనొక ప్రశ్న వేశాను. ఆ ప్రశ్న ఈడుకి మించిన వాగుడే కావచ్చును.

"అక్కడ పసిపిల్లవాడుకాక పంతులుగారే ఉన్నారనుకోండి మరి అప్పుడూ రాక్షసుడికి నిజం చెప్పేయాలా?" అని అడిగాను.

పంతులుకు చాలా కోపం వచ్చింది. ఆ గంట సేపూ నన్ను తనప్రక్కనే గోడకుర్చీ వేయించాడు. పాఠం అయిపోయాక "బుద్ధి వచ్చిందా" అని అడిగాడు. "వచ్చిందండి. ఈమాటు రాక్షసుడు పంతులు ఎక్కడున్నాడని అడిగితే మీ రెక్కడుండేదీ తప్పకుండా చెపుతానండి."

అయితే బడిలో ఇల్లాంటి చర్చలు సామాన్యంగా జరిగేవి కావు. ఇంటిదగ్గిరా, మా స్నేహితులలోనూ ఇల్లా చర్చించుకొంటూనే ఉండే

వాళ్ళము. కాని; ఈ విజ్ఞానచర్చలు పసరుకట్టిన మా సాంఘిక జీవనములో ఏమాత్రమూ కదలికలు తెచ్చేవి కావు.

## 3

అంతకు కొన్నాళ్ల పూర్వమే—మా ప్రజాస్వామ్యపు పేరిటి ప్రభుత్వం, ప్రభుత్వ పౌరజన బాంధవ్యాలలో ఒక చిన్న నూతనపు మార్పు తెచ్చింది. ఎన్నికలలో రహస్యపు వోటింగుపద్ధతిని ప్రవేశపెట్టింది. సంఘపరిస్థితులను తీవ్రంగా మార్చేయలేకపోయినా, ఈ రహస్యపు ఓటింగ్ వల్ల ఒక్కొక్కప్పుడు చాలా ఆశ్చర్యకరమైన ఫలితాలు కలిగేవి.

నాకు జ్ఞాపకం ఉన్నంతలో మా జిల్లా మొదటి ఎన్నికల సంరంభం నా ఏడవఏట జరిగింది. అప్పటికి మాకు రాజకీయపక్షాలంటూ లేవు. అందుకని ఎన్నికలు వస్తున్నాయంటే ఎవళ్లకీ అంతగా పట్టేది కాదు. కాని, ఎన్నికలకు నిల్చున్న ఒక అభ్యర్థి "రాజా"గారని తెలిసేటప్పటికి ప్రజలలో కలకలం బయలుదేరింది. ఈ రాజాగా రెవరో అర్థమయేందుకు కులగోత్రాదికంగా ప్రవర చెప్పక్కర్లేదు. ఆయన అక్కడిపెద్ద జమీందారు. గత శతాబ్దంలో 'ఫ్రాన్సినో' సరస్సు, మేట వేసినప్పుడు చెరువుభూములు వేలకు వేల ఎకరాలు నిరంకుశంగా ఆక్రమించుకొని ఆయన పూర్వులు జమీందారులయ్యారు. మా ఊళ్ల జనాభాలో ఎక్కువభాగం, ఎనిమిది వేల కుటుంబాలదాకా ఇప్పటికీ ఆ జమీను భూముల కమతాలమీదే ముప్ఫదిఐదు వేల ఎకరాలు సేద్యం చేసుకొంటూ జీవనం పోసుకొంటున్నారు.

రాజుగారు 'తమ కుటుంబా'లైన వీరందరికీ పార్లమెంటులో ప్రాతినిధ్యం వహించేందుకై 'తమ జనాన్ని' వోటుకై అభ్యర్థించారు. ఎస్టేటు ఉద్యోగస్థులు 'మన' రాజాగారికి ఓటియ్యమనేందుకు చాలా ఉదారమైన మాటలలోనే ప్రచారం సాగించారు. "రాజాగారికి ఓటియ్యమని ఎవళ్లనీ ఎవళ్లూ బలవంత పెట్టేది లేదుకదా! అది తెలిసిన విషయమే. అదేమాదిరిగా ఓటియ్యనివాళ్లను మళ్లీ తమ భూములలో దున్నుకోనియ్యాలని రాజగారినీ ఎవరూ బలవంతపెట్టేదీ లేదు. అది ఎంత రాయితీయో, ఇదీ అంత రాయితీ. ఇష్టం వచ్చినవాళ్లకు ఓటిచ్చుకునే స్వేచ్ఛ మీకు ఉంది. ఇష్టము వచ్చినవాళ్లను సేద్యంలో ఉంచుకొనే స్వేచ్ఛ రాజాగారి కుంది. ఇదంతా స్వేచ్ఛాయుగం, మీరూ స్వతంత్రులే; రాజాగారూ స్వతంత్రులే."

ఈ ఉదారసూత్రాలు రైతులలో చాలా అలజడి కలిగించాయి. అసలు మావైపున, ప్రతివాడికీ పరమద్వేషం ఎవరిమీదైనా ఉంటే, 'రాజా', మీదే. ఆయన మేఘాలలో దేవతలాగా కనబడకుండా కోటలో ఉండే మహారాజాగా ఉన్నంతకాలమూ (అప్పటిదాకా ఆ ఎనిమిదివేలమంది రైతులలోనూ దూరంనుంచైనా రాజాగారిని చూడ నోచుకొన్నవాడు లేడు.) ఏదో అరిష్టదేవత అంటే ఉండేమాదిరి జనద్వేషం, అంత పాటింపులేకుండా ప్రబలిఉండేది. జ్యేష్ఠాదేవిని తిట్టుకొన్నట్టే, రాజానూ తిట్టుకొంటూ, ఇతర ప్రయోజనం లేకపోయినా, మనస్సుకు ఊరట కల్గించుకొనేవారు ప్రజలు. కాని, ఇప్పుడా మేఘాలు విచ్చుకొని, రాజాగారు 'నరమానవుల'మధ్యకి దిగి వస్తున్నాడు. అందుచేత ఇకనుంచీ కోప తాపాలన్నీ ఇంటి గోడలమధ్యా, జనాంతికాలలోనూ తప్ప ఏమాత్రమూ ప్రకటించటానికి వీల్లేదు. వారు వచ్చేటప్పటికి పల్లెటి వీధులలో మేళతాళాలతో వారిని గౌరవంగా ఎదుర్కొని స్వాగతపత్రాలు చదవవలసిందే.

మా తండ్రికి ఈ పద్ధతి నచ్చలేదు. వాళ్ల అన్నదమ్ములందరిలోకీ చిన్నవాడేమో కాస్త పెంకి. కాస్త ఎదురుతిరిగే గుణం ఆయనకే ఉంది. అన్నదమ్ములందరూ అక్కడే చిన్నచిన్న భూస్వాములు. ఒక సాయంత్రం మా పెత్తండ్రులంతా వచ్చి, అందరి మేలుకోసమైనా, మా తండ్రి కొంచెం తెలివిగా, జాగ్రత్తగా ఉండకతప్పదంటూ బోధచేశారు.

"రాజాగారు ఎన్నికకు నిల్చోటం అవకతవకే అనుకో. రాజకీయ అభ్యర్థిత్వాలు ప్లీడర్లకూ, అల్లాంటి డబ్బాగాళ్లకూ వదిలేసెయ్యాలన్నమాట నిజమే. కాని, మరి రాజుగారు నిల్చున్నాడుగా. అందుకని మనమంతా అతనికి సాయం పట్టాలి." అన్నారు.

"రాజు ఎన్నికకు నిల్చోటం, అవకతవకైతే, ఓటెందుకియ్యాలో నాకు బోధపడటంలేదు," అని మా తండ్రి వాదించాడు.

"మనం ఆయనమీద ఆధారపడిఉన్నాం అని నీకూ బాగా తెలుసునుగదా?" "రాజకీయాలలో ఆధారపడిలేమే? రాజకీయాలలో స్వతంత్రులమే."

"మనం భూములు దున్నుకొంటున్నాము గాని, రాజకీయాలు దున్నుకోటం లేదుగదయ్యా! రైతులుగా రాజామీద ఆధారపడే ఉన్నామాయె."

"మన కౌలుకత్తులలో ఇన్ని బంగాళాదుంపలియ్యాలి; ఇన్ని ఇతర సరకు లియ్యాలి అని ఉంది గాని, రాజకీయాల ప్రసక్తే లేదే? ఓటర్లుగా మనం స్వతంత్రులమే." "మన కౌలుకత్తులు పొడిగించకుండా ఉండేందుకు రాణేదారూ స్వతంత్రుడే! అందుకే కదా మేమంతా రాజాపక్షాన ఉంది!"

"బెదిరింపుకు జడిసి ఓటియ్యాలంటే నాకు నామర్దా వేస్తుంది. నే నాపని చేయలేను" అన్నాడు మా తండ్రి.

"ఓరి, నువ్వు నో టెవరి కిచ్చావో పోలింగ్ పెట్టెదగ్గిర రహస్యపు ఓటింగులో ఎవరికి తెలుస్తుందిరా; ఓటు రహస్యంగా నీ ఇష్టమొచ్చినట్టే ఇచ్చుకో; కాని బయటికిమటుకు మాతోపాటే రాజాపక్షాన ప్రచారానికి తిరుగు."

"ఏమో! అల్లా చెయ్యాలంటే నాలో నాకే చాలా సిగ్గుగా ఉంటుంది; చెయ్యలేను."

చివరికి మా తండ్రితో వాళ్లు ఒక సమాధానానికి వచ్చారు. రాజాకు అనుకూలంగాగాని, ప్రతికూలంగా గాని బైటపడనని మా తండ్రి హామీ ఇచ్చాడు.

'రాజాగారి' ఎన్నికల పర్యటనకు ప్రభుత్వోద్యోగులు, పోలీసులు, రిజర్వు, జమీఉద్యోగులూ అంతా చాలా సంరంభ సన్నాహాలు చేశారు. ఒక ఆదివారం జమీలో, ముఖ్యమైన పల్లెలలో ఊరిమధ్య నుంచి ఉపన్యాసాలు-గిపన్యాసాలు ఏమీ లేకుండా ఎక్కడా ఆగకుండా ఒక్కసారి హుటాహుటి ప్రయాణం, చేయటానికిమాత్రం రాజాగారు ఎల్లాగో దిగివచ్చారు. ఈ ప్రయాణంకూడా మా ఊళ్లల్లో చాలానాళ్లు చెప్పుకొనేవారు. కారణం ఆయన మోటారుకారులో ప్రయాణం చేశాడు. మేము ఆ బండి చూడటం అదే మొదటిసారి. 'మోటారుకారు' అన్నమాట మాకు నిత్యవ్యవహారంలో లేదు. రైతులంతా 'గుఱ్ఱాలులేని బండే' అనేవాళ్ళం. దాని పరుగూ, వాయువేగం, దెయ్యపు శక్తీ, అది వెళ్లినంత మేరా పొలాలన్నీ ఎల్లా నిర్ధూమధామంగా తయారయేదీ, ఆ కంపూ, ఇవన్నీ విచిత్రపు కట్టుకథలుగా చెప్పుకొనేవారు.

ఆ ఆదివారంనాడు ఊళ్లో జనమంతా మోటారు వెళ్లే బాట కిరుప్రక్కలా క్రిక్కిరిసి బారులుతీర్చి నిల్చున్నారు. రాజాగారంటే ఎంతో భక్తిప్రపత్తులూ, గౌరవమూ జనంలో వెల్లివిరిసి కనబడుతున్నాయి. అంతా పండుగముస్తాబై వచ్చినట్టు వచ్చారు.

ఎంతోసేపయాక 'గుఱ్ఱాలు లేని బండీ' పెద్ద హోరెత్తుకొంటూ వచ్చి, ఎక్కడా ఆగకుండా, జోరైనా తగ్గకుండా వెనుకంతా దుమ్ము రేగకొట్టుకొంటూ సఱ్ఱున వెళ్లిపోయింది. జమీందారుగారి ఉద్యోగులు గుఱ్ఱాలు లేనిబండీ పెట్రోలు మంటవల్ల నడుస్తుందనీ, పెట్రోలు అయిపోతేనేగాని మరి ఆగదనీ విన్నవాళ్లకు చెప్పుకొచ్చారు. "గుఱ్ఱాల బండికి మల్లే కళ్లాలు గిళ్లాలు ఏం ఉండవే!- ఎక్కడైనా కళ్ళెం కనబడిందా." అంటూ విశదీకరించారు.

రెండురోజులతర్వాత రోమ్‌నుంచి ఒక ముసిలాయన వచ్చాడు. కళ్లకు జోడుంది. చేతులో ఒక నల్ల చేతికఱ్ఱ, ఒక చిన్న సూటుకేసూ ఉన్నాయి. 'రాజా'కు ప్రతిగా ఎన్నికలో నిల్చున్నానని చెప్పాడు. వింత చూడటానికి అతని చుట్టూ కొందరు జనం మూగారు. చాలామటుకు ఆడవాళ్లూ, చిన్నపిల్లలే; ఓటు లేనివారే. ముసలాయన్ను ఉపన్యాసం ఇయ్యవలసిందంటూ మేమంతా అడిగాం. "మీ పెద్దవాళ్లకు, ఓటింగ్ రహస్యంగానే జరుగుతుందని మాత్రం జ్ఞాపకం చెయ్యండి. అంతకన్నా వేరేం లేదు" అన్నాడు. అని. "నేను పేదవాడిని. కళ్ల వైద్యం వృత్తిగా బ్రతుకుతాను. మీలో ఎవళ్లకైనా కంటిజబ్బు లుంటే ఉచితంగా వైద్యం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను" అని చెప్పాడు. కూరలమ్మే ముసిల్దాన్ని కళ్లజబ్బున్న దానిని, ఒక రైతు తీసుకొచ్చి చూపించాము. ఆ అమ్మ కళ్లు కడిగి ఒక చిన్న సీసాలో మందిచ్చి ఎన్నెన్నిచుక్కలు ఎల్లా

వాడాలో చెప్పి పంపించాడు. పిల్లలమంతా చుట్టూ ఉన్నాము. మళ్ళీ మావంక తిరిగి "మీా పెద్దవాళ్లకు ఓటింగ్ రహస్యంగా జరుగుతుందని జ్ఞాపకం చెయ్యండి. అంతే" అంటూ వెళ్లిపోయాడు. కాని, "రాజా"యే ఎన్నికవుతాడనీ అంతా అనుకొన్నాము. ఆయన నెగ్గినప్పుడు ఎల్లా ఊరేగించాలో, ఏ ఉత్సవము చెయ్యాలో అదంతా ఒక పెద్ద కార్యక్రమం తయారుచేసి, సన్నాహాలన్నీ చేశారు. మా తండ్రి మాత్రం ఎన్యూమరేటర్ (ఓట్లలెక్కల)పని వేయించుకొని ఉభయత్రా తప్పుకోగలిగాడు.

చివరికి పోల్ అయిన ఓట్లు లెక్క పెట్టేటప్పటికి ఆ అనామక నేత్రవైద్యుడికే ఎక్కడలేని మెజారిటీ వచ్చింది. జనం అంతా ఎవరికివారు రాజాకు ప్రతికూలంగా ఆ ప్రత్యర్థికి వోటు చేసినటు తెలిసేటప్పటికి అంతా ఆశ్చర్యపోయారు. రాజా అల్లరిపాలయి పోయాడు. అధికారులు "పద్దమోసం" అంటూ మొదలెట్టారు. కాని, ఇంత పెద్దపెట్టున జరిగిన మోసానికి ఏ ఒక్కరిమీాదా ఎస్టేటు ఉద్యోగులు చర్య తీసుకోలేకపోయారు.

మళ్లీ సంఘజీవనం మామూలుపాటలో పడిపోయింది.

"ప్రజాభిమతం, ఇల్లా పొంగులా, ఎప్పుడో ఒకప్పుడుమాత్రమే వెలువడటమేం? ప్రజాజీవన పునర్నిర్మాణానికి, శాశ్వతమైన ప్రాతిపదికగా, పునాదిగా ఎందుకు ఏర్పడదు?"

అని ప్రశ్నించుకొన్నవారే లేరు.

కాని, ఈ కథనుబట్టి కేవలం భయమే ఈ ప్రజ అభ్యుదయానికి అభ్యంతరంగా నిలచిందేమోనని అపార్థం చేసుకోటం చాలా తప్పు. మా ప్రజలేనాడూ, వెన్నెముక లేని భయస్థులూ, పిరికిపందలూ కానేకారు. పైగా అతి సాహసులుకూడా. అక్కడి శీతోష్ణస్థితి తీవ్రత, పనిపాటులలో ప్రయాస, బ్రతుక్క పడాల్సిన కష్టం, ఇన్నిటినిబట్టే, మా జిల్లాల జనం, తక్కిన ఇటలీప్రజ ఎవరికన్నాకూడా, ఎక్కువ జీవదార్ఢ్యం, కాఠిన్యం, సాహసం, అమితఓరిమీా కలవాళ్లయారు. అందుచేత అక్కడి విశేషాలలో, స్థానిక తిరుగుబాట్లకు, ఉన్నంత ప్రాముఖ్యం రహస్య వోటింగ్ ఫలితాల రాజకీయాలకు లేదు. ఆ తిరుగుబాట్లు, బహు క్షణికాలైనా, అతి తీవ్రంగా విలయహింసతో, నాశనకరంగా మహోత్సాహంగానే ఉండేవి. అవమానితులూ, పరపాద దళితులూ అయిన జనం, దుర్భరహింసలను, పీడలను, అవమానాలను, కిమ్మనకుండా సహిస్తూనే, ఎప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగా గప్పున రాజినట్లు రాజి పేలి మండేవారు.

మా ఊళ్లో, జనాభా అయిదు వేల మంది మాత్రమే. ఈ కొద్ది పల్లెలోనే 'ఆజ్ఞ'నిభాయించటానికి ఒక లెఫ్టినెంటూ, ఇరవైమంది రిజర్వు పోలీసుల సిబ్బందీ ఉండేవారు. ఇంతమంది పోలీసులున్నారంటేనే మా జనం సంగతి తెలిసివస్తుంది.

మొదటి ప్రపంచయుద్ధకాలంలో సోల్జరులకూ, ఈ రిజర్వు సిబ్బందికీ పడేదికాదు. కారణం ఈ రిజర్వు సిబ్బంది అంతా ఎక్కడో యుద్ధాని కివతల డ్యూటిలో ఉంటూండేవారు. అదీకాక సోల్జర్లు యుద్ధముఖంలో నానా అగచాట్లు పడుతూంటే, ఈ రిజర్వువాళ్లు వెనకఉండి, వాళ్ల భార్యలతోనూ ప్రియురాళ్లతోనూ ప్రణయగాథలు నడుపుతూచేవారని అపవాదులుకూడా ఉండేవి. చిన్నచిన్న పల్లెలలో ఇలాంటి అపవాదులు, ఫలానా, ఫలానా అంటూ రూపొంది యథార్థ వ్యక్తులకు చుట్టుకొంటాయి.

ఇల్లా ఒకనాడు ముగ్గురు సోల్జర్లు కొద్ది సెలవుమీాద యుద్ధరంగాన్నించి ఇంటి కొచ్చారు. వాళ్లకు, రిజర్వువాళ్లకు కొట్లాట జరిగి రిజర్వుపోలీసులు వాళ్ల ముగ్గురినీ జైలులో పెట్టారు. ఇల్లా చెయ్యటం చాలా దౌర్జన్యంగాను, అన్యాయంగానూ కన్పించింది. పైపెచ్చు రిజర్వుకమాండరు, ఈ ముగ్గురి సెలవూ కొట్టేయించి వాళ్ళను వెంటనే వెనక్కు మళ్ళీ పంపించే ఆర్డరు వేశాడు. ఆ సోల్జర్లలో ఒకడు నాకు చాలా సన్నిహిత మిత్రుడు (తర్వాత యుద్ధంలో చచ్చిపోయాడు కూడా!) అతని ముసిలి తల్లి ఏడుస్తూ నా దగ్గరకు వచ్చి సంగతంతా తెలియపరిచింది. ఊరి ఛైర్మనుకూ, మేజస్ట్రేటుకూ, పూజారిపంతులకూ అందరికీ చెప్పి, ఇందులో కలుగచేసికోవలసిందని బతిమాలాను. ఎవళ్ళకు వాళ్లు మా పని గాదని మొరా

యించారు. 'ఇట్లాగే అయితే ఇక 'విప్లవం' ఒకటే, మార్గం' అన్నాను. మావాడుక భాషలో ఈ భీకర చారిత్రకపదాన్నే ప్రతి చిన్న తిరుగుబాటుకూ వాడే వాళ్ళం. ఉదాహరణకు, ఆ యుద్ధపు రోజుల్లోనే, అప్పటికే రెండు 'విప్లవాలు' జరిగాయి. రేషనింగ్ అమలు విషయంలో, పురసంఘాన్నెదిరిస్తూ ఒకటి జరిగింది. మా ఊరి 'మతాధిపత్యం' మరొక ఊరికి మార్చినప్పుడు మరొకటి జరిగింది. ఇప్పుడు నేను వర్ణించబోయేది మూడవది. "ముగ్గురు సోల్జర్ల విప్లవం" అంటూ పేరుగాంచి చరిత్ర కెక్కింది.

ఆ సోల్జర్లను ఐదుగంటల జైలుకు తీసుకెళ్తారు. అందుకని 'విప్లవం' ఒక అరగంట ముందర రిజర్వు బారకాసుల కెదురుగా జరిపేటట్టు నిర్ణయించుకొన్నాం. అనుకొన్నవాళ్ళం మొదట ముగ్గురు కుఱ్ఱాళ్ళమే. అదయినా అల్లరికే. అనుకున్న వేళకు మాలో ఒకడు వెళ్ళి ఊళ్ళో జేగంట మోగించటం ప్రారంభించాడు. ఎక్కడైనా అగ్నిప్రమాదంగాని మరేమైనా జనప్రమాదంగాని జరిగితేనే ఆ జేగంట మోగిస్తారు. తక్కిన ఇద్దరం పొలాల్లో పరుగెత్తి కేకలేసుకొంటూ జనానికి సంగతి తెల్పసాగాం. జేగంట మోగేటప్పటికి రైతులు కంగారుపడి, పొలాల్లో ఎక్కడి పని అక్కడ ఆపేసి అంతా పరుగెత్తుకొంటూ ఊళ్ళోకివచ్చి పడ్డారు.

కొద్ది నిముషాల్లో జనమంతా గోలగా బారకాసులముందు చేరి, పట్టరాని ఉద్రేకంతో రిజర్వును బెదిరించి అట్టహాసం చెయ్యసాగారు. పెద్దపెద్ద రంకెలేసుకొంటూ, రాళ్ళూ రప్పలూ విసురుతూ బారకాసుల తలుపులూ, కిటికీలూ పగలగొట్టేశారు. జనం ఉద్రేకులై పట్టశక్యంకాని స్థితిలో ఉన్నారు. సోల్జర్లను వదిలేసి, సిపాయీలు చీకటిమరుగున పొలాల్లో తోటల్లో దూరుతూ, కాలికి బుద్ధిచెప్పి ప్రాణాలు కాపాడుకొన్నారు. అంతా అయాక ఎవళ్ల మానాన వాళ్ళు వెళ్లిపోయారు. ఇంతకూ కారణమైన ముగ్గురు సోల్జర్లు, జనం అజలోకే రాలేదు. వాళ్ళూ చల్లగా వాళ్ళ ఇళ్ళకి చేరుకొన్నారు.

ఇంక అక్కడ సర్వాధికారులంగా పిల్లవాళ్ళము మాత్రం మిగిలాము.

"ఇంకిప్పుడేం చేద్దాం?" అని పిల్లలు నన్నడిగారు. నాకు కొంత 'లాటిన్' భాష వచ్చిఉండటంవల్ల నాకు మాలో నాయకత్వం దానంతట అదే ప్రాప్తించింది.

"రేపు పొద్దున్నకల్లా, పట్టణాలనుంచి రిజర్వు దళాలు పోలీసులూ, మిలిటరీ సిపాయిలూ, తుపాకులు దట్టించుకొంటూ వందలకొద్దీవచ్చి ఊరిమీద పడుతా" రని వాళ్లతో అన్నాను.

"అయితే మరి వాళ్ళొచ్చేలోపలే, ఇప్పుడీ రాత్రి ఇంక ఏం చేద్దాం" అంటూ పిల్లలు పట్టుబట్టారు.

వాళ్ల అభిప్రాయం నాకు తెలుసు. ఊరంతా నిద్రపోతుందికదా ఆ అనువు తీసికొని ఈ రాత్రిలో "సోషలిజం" తేలేమా అని వాళ్ళ ఊహ. ఆ స్థితిలో ఏదైనా సంభవమే అనే వాళ్ళు అనుకుంటున్నారు.

"నూతనపరిస్థితులు సంభవమయ్యేటట్లు చేయటానికి ఒక్క రాత్రి చాలదుకదా! ఊరంతా నిద్రపోతున్నాకూడా రాత్రికి రాత్రి సోషలిజం తెప్పించగలమన్న నమ్మకం నిజంగా నాకు లేదు" అని విశదపరిచాను. (ఒక్కరాత్రిలోనే 'సోషలిజం' తెప్పించవచ్చునన్న వాదం అప్పటికింకా పుట్టలేదు కాబట్టి ఇందులో నా తప్పు లేదు.)

"పోనీలే సోషలిజం రాకపోతేమాని, జైలు కెళ్ళేలోపల హాయిగా ఇళ్ళల్లో పడుకోనేందుకు ఒక్క రాత్రి అయినా చాలులే" అంటూ ఒక బాలుడన్నాడు. అతను చెప్పింది బుద్ధిగా బాగుందని అందరం ఇళ్లకుపోయి పడుకొన్నాం.

ఇలాంటి కొట్లాటల తిరుగుబాట్లు - వాటిని విధాయకంగా అనుసరించే, అరెస్టులు, విచారణలు, కోర్టు ఖర్చులు, కారాగారశిక్షలు, మొదలైన ఈతిబాధలవల్ల- జనానికి అపనమ్మకం, అధైర్యం నిస్పృహ కల్గించేవి. వాళ్ల హృదయాలలో 'ప్రభుత్వం' అంటేనే పైశాచికపు అవతారము. అందులో మార్పు చస్తే తేలేము. సజ్జనుడైనవాడు పాపం అంటకుండా తన్నుతను రక్షించుకోవాలంటే ప్రభుత్వపు వాసన తగలనీకుండా తప్పించుకు తిరగాలి. మోసము, కుత్సితం, దొంగతనం, వంచన ప్రత్యేకసౌకర్యాలు, మెహర్బానీలు, వీట్లన్నిటికీ గడ్డకట్టిన రూపం ప్రభుత్వం. ఎప్పుడైనా ప్రభుత్వమే ఏ కాసింతయినా పట్టుబడడం, పాపఫలం అనుభవించటం జరి

గితే, భగవంతుడి లీలవల్ల జరగాల్సిందే తప్ప ఇతరత్రా జరగటానికి వీల్లేదు.

## ౪

౧౯౧౫ లో మా రాష్ట్రంలో, పెద్ద భూకంపం వచ్చింది. అనేక పల్లెలు, పట్టణాలు నాశనమయిపోయాయి. ముప్ఫై సెకనులలో దాదాపు ౫౦ వేల జనం ఇళ్లు కూలిపోయి చచ్చిపోయారు. ఇంతటి మహా విపత్తునూ, మావాళ్ళు ఏదో నిత్య నైమిత్తిక సాధారణ విషయంలాగా స్వీకరించటం నాకు విభ్రమం గొల్పింది. పేపర్లలో భూగర్భశాస్త్రజ్ఞులు, భూకంపకారణాలను వివరిస్తూ వ్రాసే తికమకవ్రాతలన్నీ వాళ్లకు ఏవగింపు కల్గించాయి.

మా జిల్లాలాంటి జిల్లాలో, నిరంతరంగా సాగే అన్యాయాలనూ, అక్రమాలనూ, అఘాయిత్యాలనూ, తీర్చిదిద్దే నాథుడు లేని జిల్లాలో, పాపం, భూభారం పెరిగిన జిల్లాలలో, ఇల్లాంటి భూకంపాలు మళ్లీమళ్ళీ సంభవించటమనేది, ఇతరత్రా వివరించవలసిన అవసరమే జనంలో కల్గదు. అసలు ఇంతకన్నా తరుచుగా భూకంపాలు ఎందుకు రావటంలేదా అనేదే ఆశ్చర్యం గొలిపే విషయమవుతుంది. భూకంపం, ధనికులనూ, బీదలనూ, పండితులనూ, పామరులనూ, అధికారులనూ, నౌకర్లనూ, ఏమాత్రం విచక్షణ లేకుండా, అందరినీ సమానంగా పూడ్చిపెట్టేస్తుంది!

ప్రకృతి విలయశక్తుల పాలయినప్పుడు, ఇంతటి గొప్ప ఓరిమి, ఈ ఇటాలియన్ ప్రజల్లో ఎల్లా ఉందో ఈ విషయమే విశదపరుస్తుంది. చట్టాలు, ప్రభుత్వాలూ, "సర్వసమత్వ" ధర్మం నెరుపుతామని పూట పడుతాయి. కాని వ్యవహారంలో చెల్లించుకోలేవు—ఆ మాట 'భూకంపం' చెల్లించుకొని, సర్వ మానవ సమానత్వాన్ని పాలించుకొంటుంది.

మా పొరుగున ఉన్న ఒక రొట్టెలు చేసే అమ్మ కూలిపోయిన ఇంట్లో పడి పూడిపోయింది. కొద్దిగా దెబ్బలు తగిలాయిగాని చావలేదు. నాలుగైదు రోజుల దాకా ఆమెను బైటికి లాగలేదు. అంతవరకూ తన ఇల్లొక్కటే కట్టడంలో లోపంవల్లో, లేక ఇతరులెవరో శాపం పెట్టడంవల్లో కూలిపోయిందనుకొంటూ, చాలా నిర్విణ్ణురాలైపోయింది. ఆ యిటుకల గుట్టల మధ్యనుంచి, బైటికి తీసేందుకు సహాయకులొచ్చేటప్పటికి, బైటికి రానంటూ ఏడుస్తూ కూర్చుంది. కాస్త ఓదార్చి బైటికి తీశాక, భూకంపంవల్ల అందరి యిళ్ళూ కూలిపోయాయని, చాలామంది చచ్చిపోయారనీ, చెప్పినప్పుడు వెంటనే తేరుకొని, స్థైర్యం తెచ్చుకొని, జీవితాశతో, మళ్ళీ యిల్లు కట్టుకొనేందుకు వెంటనే ఉత్సాహంతో తయారయింది.

కాని మా జనానికి భూకంపానికన్నా ప్రకృతి విలయాలకన్నా, పీడాకరంగా,దుస్సహంగా తయారైనది భూకంపం తర్వాత జరిగిన విషయమే.

భూకంపబాధితుల నివారణ ప్రణాళిక ఒకటి ప్రభుత్వం సాగించింది. ఆ వ్యవహారంలో ప్రభుత్వోద్యోగులలో, పరస్పరం లుకలుకలు, తంత్రాలూ, మోసాలూ, వంచనలు పెరిగిపోయి, ఉద్యోగులలో ఎవడికందిన డబ్బు వాడు కొట్టేస్తూ, ఎక్కడికక్కడ గుటకాయస్వాహా చేస్తూ, ఎన్ని విధాల ప్రజలకు సహాయకారి కాకుండా ధనం దుర్వినియోగం కావచ్చో· అన్నివిధాలా దుర్వినియోగమయిపోయి, ప్రజలకు నిరంతర పీడాకరంగా తయారయింది. ఆ ప్రణాళికకు సంబంధించిన ప్రభుత్వ శాఖలో, ఉద్యోగం ఊడిపోయిన, నా పరిచితుడొకాయన, దాంట్లో కుళ్ళంతా బైటపెడ్తూ, ఛీఫ్ ఇంజనీర్లు, ఎక్కడెక్కడ ఏయే దుర్మార్గాలు చేస్తోందీ, ఏయే దగుల్బాజీపనులు చేస్తోందీ, దేని కది వరుసని, విడివిడిగా విశదంగా నాకు చెప్పుకొనివచ్చాడు. నాకు ఆశ్చర్యం వెయ్యలేదు గాని, సంగతులన్నీ ఘాటుగా మనస్సుకు నాటుకున్నాయి. వెంటనే, పెద్ద ఉద్యోగాలలో ఉంటూ, చాలా నిజాయితీ మనుష్యులూ, సత్యవంతులూ, అని నాకు తెలిసిన పెద్దల దగ్గరకు వెళ్ళి, ఈ విషయాలు బైటపెట్టి వంచకులైన ఈ ఛీఫ్ ఇంజనీర్లపై క్రిమినల్ చర్య తీసుకొని విచారణకు తీసుకురావలసిందని నివేదించుకొన్నాను. నే చెప్పిన వేవీ అబద్ధాలని వాళ్లనలేదు. ఇవి నిజమనేందుకు వాళ్లకింకా గట్టి ఋజువులే ఉన్నాయి. కాని "అబ్బాయి నువ్వింకా చిన్నవాడివి. చదువు పూర్తి చేసుకోవాలి, ఉద్యోగం చూసుకోవాలి, నీ బ్రతుకు బాగుచేసుకోవాలి, నీ కక్కరలేని ఇల్లాంటి విషయాలతో జోక్యం పెట్టుకొని పాడవటం మంచిది కాదని" ఆప్యాయంగా నాకు హితబోధ చేశారు.

“నిజమే పదిహేడేళ్ల పిల్లవాడిని నేను జోక్యం కలగచేసుకోటంకంటె, అధికారమున్న పెద్దలు, గౌరవనీయులు, మీరు ఈ దుర్మార్గమంతా బైట పెడ్తేనే, ఎక్కువ ప్రయోజన ముంటుంది. అందుకనే మిమ్మల్ని అడుగుతున్నాను.” అన్నాను.

వాళ్లు అడిలిపోయారు. “మాకేం, పిచ్చెత్తిం దనుకొన్నావా ఏమిటి? మా పనేదో మేం చూసుకోటం తప్ప, ఇతర జోక్యాల్లో మేం కలగచేసుకోం” అన్నారు.

ఊళ్లో పెద్దలతోటి, మా బంధువులలో కొంత ధైర్యసాహసా లున్నాయన్న వారితోటె సంప్రదించి చూశాను. ఈ సిగ్గుమాలిన పనులన్నీ అక్కడ జరుగుతున్నాయని ప్రతివాళ్ళకూ తెలుసని అందరూ ఒప్పుకొన్నారు. కాని నీ చదువూ, ముందుగతీ, జీవితం, ఉద్యోగం, అవి చూసుకోతప్ప ఈ కంఠిరీగల పట్టు కదపవద్దని బ్రతిమాలి చెప్పారు. నా చదువు, ఉద్యోగం చూసుకోటం, నాకూ సంతోషమే. కాని మీలో ఏ ఒక్కరైనా, వాళ్ళని దొంగలని నేరారోపణ చేసి క్రిమినల్ చర్యలు కోర్టులో నడిపించేందుకు సిద్ధంగా లేరా అని అడిగాను. “బాగుంది! మాకేం పిచ్చెత్తిం దనుకొన్నావా! ఇల్లాంటి విషయాలతో మాకు సంబంధం లే”దంటూ ఛీదరించుకొన్నారు.

నాలో నేను ఆలోచించుకోసాగాను. మళ్ళీ మా జట్టు కుఱ్ఱవాళ్ళను పోగుచేసి, ఈ ఇంజనీర్ల ఆఫీసులన్నీ తగులపెట్టి మళ్లీ ఒక ‘విప్లవం’ ఏర్పాటు చేద్దామా అని ఆలోచించాను. కాని నాకీ విషయాలన్నీ చెప్పిన పరిచయస్థుడే, అది మంచిపని కాదనీ, ఆఫీసులు తగలబెడ్తే, వాళ్లు చేసిన తప్పుల రికార్డు కూడా తగులపడిపోయి, నిరూపణలు లేకుండాపోతాయని చెప్పాడు. నాకంటే అతను పెద్ద, కాస్త అనుభవశాలి. అందుకని ఇదంతా విపులంగా వ్రాసి పేపరుకు పంపించటం మంచిదని సలహా ఇచ్చాడు. కాని ఇది ప్రచురించే పత్రిక ఏదీ? “ఈ విషయాలు ప్రచురించటంలో ఉత్సాహ ముండే పత్రిక ఒకటే ఉంది. అది సోషలిస్టుపత్రిక” అంటూ అతను చెప్పాడు.

వెంటనే మా జిల్లాలోని ప్రభుత్వపు ఇంజనీర్ల మోసకృత్యాలను, లంచగొండితనాలను, కుళ్లును, అక్రమచర్యలను ఒక్కొక్కటే విశదంగా వెలువరిస్తూ మూడు వ్యాసాలు వ్రాసి, “అవంతి” (సోషలిస్టు పత్రిక) పత్రికకు పంపాను. అవే నా తొలి రచనలు. మొదటి రెండు వ్యాసాలూ వెంటనే అచ్చయాయి. చదువరులలో కొంత కలకలం కల్గించాయి గాని ఉద్యోగులలో ఏమీ కదలికలు తేలేదు. మూడవ వ్యాసం ప్రచురితం కాలేదు. కారణం నాకు తరువాత తెలిసింది. ఒక ప్రముఖ “సోషలిస్టు” నాయకుడే, సంపాదకులతో కలుగచేసుకొని అది ఆపేయించాడట. దానితో, మనలను కృంగదీస్తూన్న ఈ కుళ్లు, ముందు కనబడినంతకన్నా చాలా విస్తృతంగా, గాఢంగా వ్యాపించి ఉన్నదనీ, దాని అదృశ్యప్రాకారాలు ‘సోషలిజం’లోకి కూడా వ్యాపించే ఉన్నాయనీ, నాకు అవగత మయింది.

ఏమయినా, అంతవరకూ పడ్డ వ్యాసాలలోనే, ఆ యింజనీర్లను జైలుకిడ్చేందుకు, ఎన్నో కేసులు పెట్టేందుకు, కావలసినంత సాక్ష్యం ఉంది. కాని ఈ విషయంమీద అధమం ఒక విచారణసంఘాన్నైనా ప్రభుత్వం ఏర్పరచలేదు. దొంగలూ, దోపిడిగాళ్లూ అంటూ నేను నేరారోపణ చేసిన ప్రభుత్వపు ఇంజనీర్లలో ఒక్కరూ, తమమీద మోపిన నేరాలు, సమర్థించుకోవటంగని, లేదా సర్వ అబద్ధమని ఒక చిన్న స్టేటుమెంటు ఇయ్యటానికిగాని, పూనుకోలేదు.

ఉదార స్వభావులైన పెద్దలు కొద్దిమంది, పేపరులో ఈ సవాలుచేసిన యువకుడు, కొంచెం ఉద్రేకపు పాలున్న తిక్క కుఱ్ఱవాడనుకొని సమాధాన పడ్డారు.

మా దక్షిణాది రాష్ట్రాల దరిద్రస్థితిలో ఏ కేటా స్కూలు చదువు ముగించుకువచ్చిన వేలాది యువకులకు వృత్తి ఉద్యోగాలకు చాలా కొద్ది ఆస్కార ముంటుందని జ్ఞప్తిలో ఉంచుకోవాలి. మా కున్న పెద్ద పరిశ్రమ అల్లా ప్రభుత్వపు గుమాస్తాగిరి ఉద్యోగాలే! వీట్లకు అమితమైన తెలివితేటలు ఏమీ అక్కరలేదు. కేవలం మేదగులైయుండి, ప్రభుత్వపు రాజకీయాలు ఏ దోవను ఉంటే అటు ఒరవడి తప్పకుండా నడుచుకొనేవాళ్లయితే చాలు.

ఇక్కడ సూక్ష్మంగా విశదీకరించిన, మా దక్షిణ రాష్ట్రాల వాతావరణంలో పెరిగిన కుర్రాళ్లు, ఏ

మాత్రం సునిశిత తత్వమున్నవాళ్ళైనా, నిసర్గికంగానే, విప్లవానికీ, అరాచకానికీ మొగ్గేవారు. ఇంకా యౌవనపు పొంగులో ఉన్నవాళ్ళకి ప్రభుత్వపు నౌకరీ చెయ్యటమంటే, ఆత్మల నమ్ముకొని బానిసలై సన్యాసులై పోవటంగా అనిపించేది. అందుకనే "ఇరవయ్యో ఏట అనార్కిస్టు, ముప్ఫయ్యో ఏట కాన్సర్వేటివ్" అని మన మంటూంటాం.

అంతేకాక బడులలో గాని, ఇళ్ళవద్దగాని చెప్పే విద్య, మనిషిని 'స్వధర్మశీలుణ్ణి' చెయ్యటానికి పనికి వచ్చేది కాదు. హైస్కూలు చదువు చాలామటుకు ప్రైవేటు కాథలిక్ సంస్థలలోనే చదువుకొన్నాను. అక్కడ లాటిన్, గ్రీక్, అద్భుతంగా నేర్పేవారు. ఇంటా, బయటా కూడా, మనిషి సభ్యంగా, సాధారణంగా ఉండగల అలవాట్లనే నేర్పి పెట్టేవారు. కాని సాంఘిక విజ్ఞానం- బోధమాత్రం శూన్యం. ఏకోశానా నేర్పేవారు కారు.

మా చరిత్రాధ్యాపకులు అధికారుల గ్రాంధిక దృక్పథాలను తీవ్రంగానే విమర్శిస్తూండేవారు. రిసార్జిమెంటో పురాణం, ఆ పురాణవీరులు (మజ్జినీ, గరిబాల్డీ, విక్టర్ ఎమాన్యూల్ కేవల్) అందరూ, మా పాఠశాలలో పరిహాసానికీ, వక్కిరింతలకు ఆస్పదమయి అనుకరణ యోగ్యులు కాకుండా పోయేవారు. ఆనాటి సాహిత్యాన్ని (కార్డుస్సీ, డిఅన్నుజ్జియో) మా అధ్యాపకులే తూర్పారబట్టి వదిలేవారు. అధ్యాపకుల ఈ మాదిరి బోధనలో, విద్యార్థులలో విమర్శనాశక్తి పెంపొందే ప్రయోజనం చాలా ఉండేది. కాని ఈ అధ్యాపకులే ప్రభుత్వపు పరీక్షలకు మమ్మల్ని తయారు చెయ్యవలసి వచ్చేటప్పటికి, తము తెలిపిన అభిప్రాయాలకు పూర్తిగా విరుద్ధంగా, పరీక్షలలో మార్కులు తెచ్చుకొనేందుకు శిక్షణ యిచ్చేవారు. ఏ స్కూలునుంచి ఎంత ఎక్కువమంది పిల్లలు పాసయేరనేదే ప్రభుత్వపు దృష్టి కాబట్టి; స్కూలుకు మంచి పేరు తెప్పించేందుకు ఎక్కువమంది పిల్లలు ప్యాసయేందుకు, అల్లా కావలసిన పరీక్ష తర్ఫీదే, తీవ్రంగా పిల్లలకు ఇచ్చేవారు.

ప్రభుత్వ విద్యాధికారులు, కాథలిక్ ప్రైవేటు స్కూళ్లనుంచి వచ్చిన మాలాటి విద్యార్థులను అతి వివాదగ్రస్తమయిన విషయా లన్నిటిమీదా ప్రశ్నలు వేసి, మా జవాబులతో కులాసాగా కాస్త కాలక్షేపం చేసేవారు. అంతా విని, చాలా నిష్పాక్షికమూ, ఉదారమూ అయిన దృక్పథం అలవర్చుకొన్న విద్యార్థులంటూ, వ్యంగ్యంగా, మమ్మల్ని వీపు చరిచి పంపించేవారు. ఈ అబద్ధం, ఈ మోసం, ఈ ద్వైధాత్వం, ఇంత బాహాటంగా ప్రబలి ఉండటం, "సంస్కృతి", అంటే ఏమాత్రం సహజగౌరవం ఉన్నవాడికైనా, అలజడి పుట్టించక తప్పదు. కాని మామూలు యువకుడు, పరీక్షలు ప్యాసై, డిగ్రీలు తెచ్చుకొని, ప్రభుత్వపు నౌకరీ సంపాదించుకొని, పొట్ట గడుపుకోవలసిన వాస్తవికాలతో, జీవితం సాగించుకోవలసిన విధాయకత్వమే స్వీకరించక తప్పదు.

"ఈ జిల్లాలో పుట్టిన జనులు నిజంగా దౌర్భాగ్యులు. అటు తిరుగుబాటు చేయటమో, లేక లొంగిపోయి పాపపు కూడులో భాగం పంచుకోటమో తప్ప వీళ్లకు మధ్యగతి అంటూ వేరే లేదు" అని, మా పొరుగూరిలో వైద్య డాక్టరాయన అంటూండేవాడు. ఆయన ఎదురు తిరిగాడు. తనను "అరాచకుని"గా ప్రకటించుకొన్నాడు. బీదవాళ్ళకు టాల్‌స్టాయి సూత్రాలు ఉపన్యసించేవాడు. ఆ చుట్టుపట్ల అందరూ అతన్ని వట్టి వెంగళాయిగా జమకట్టేవారు. భాగ్యవంతులకు అతనంటే ద్వేషం. బీదవాళ్లకు అతనంటే అసహ్యం. ఏ కొద్దిమందో రహస్యంగా అతన్ని చూసి జాలిపడేవారు. అతని డాక్టరు ఉద్యోగం లాగేశారు. అక్షరాలా ఆకలితో మాడి చచ్చిపోయాడు.

(సశేషము)

(హామీష్ హామిల్టన్ కంపెనీ; బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసుల; సౌజన్యంతో)

---

# మహాసముద్రం



శ్రీ అంగర వెంకటకృష్ణారావు

రెండు ఝాములు కలయిక వేళ. జీవితం అనే తెరమీద మృత్యుదేవత ప్రతిబింబం భాగంగా నాట్యం ప్రదర్శిస్తున్న సమయం. అర్ధరాత్రి! నే నీ కథానికలోని వ్యక్తుల్నీ, నిధానకమైన సంఘటనలు క్రోడీకరించడానికి కలం యెత్తిన ఆ క్షణంలో నాకొందొక దృశ్యం గోచరించింది.

దూది పింజల వంటి మబ్బు తునకల వెనకనుండి వచ్చే మసక, మసక వెన్నెలకి మెరిసే యిసుక; చీమ చిటుకునని ఆ రాత్రిలో దెబ్బతిన్న సింహ గర్జన వలె సముద్రపు హోరు, అవధిలేని, అదుపులేని ప్రచండ వాయువు. విశాఖపట్టణ సముద్రతీరం.

ఆ భయంకర వేళ, అస్తి నాస్తి అనిపించే వెలుగులో, కరకర యిసుక త్రొక్కుకుంటూ, నిర్లక్ష్యపు పరుగుతో, నీటివరకూ వచ్చి, వొక స్త్రీ ఆగిపోయి చందమామ వేపు చూసింది. కరిగిన బంగారువంటి వెన్నెలలో ఆ సుందరముఖి గులాబీ బుగ్గలమీద విద్యుద్దీప కాంతికి బేసరిలో వెలిగే వజ్రపు రాయిలా వొక కన్నీటి చుక్క మెరిసింది.

'ఈమెచేత ఆత్మహత్య చేయించబోతున్నావా?' నా కలం నన్ను ప్రశ్నించింది. నేను కలం క్రిందపెట్టి, తల గోక్కున్నాను. ఆ ప్రశ్నకు సమాధానం ఆ స్త్రీయే యివ్వాలి. నేను నా పాత్రలను ఆజ్ఞ పెట్టను. అవే వచ్చి తమ విధి నిర్వహిస్తూంటే, నేను వ్రాస్తూంటా, చూసినది చూసినట్టూ. విన్నది విన్నట్టూ.

చేతి గడియారం టిక్కు టడుగులతో పది నిమిషాల దూరం పరుగెత్తింది. నా కలం లేచి తిరిగి పని చెయ్య జొచ్చింది. అక్కడ లేడి దూసుకు పారిపోయిన సింహగర్జనలా తరంగాలు హోరెత్తుతున్నాయి.

* * * * *

టెలిగ్రాం చదువుకుని అరుణ యెగిరి గంతు వేసింది. మర్నాడు కెప్టెన్ బాలీ వస్తున్నాడు.

మద్రాసు మెయిలుకు వెళ్ళి అతనిని యెదుర్కోవాలి. అందుచేత వెంటనే కారు పంపమని తండ్రికి 'ఫోను' చేసింది. కారు వచ్చింది. ఆమె, యెన్నెన్నో చీరలు, చొక్కాలు మార్చి, చివర కెలాగో డ్రెస్ వేసుకుంది 'కమ్' కటువుగా వుంటుందనీ, 'ఆటో దిల్బహార్' అల్లరి చేస్తుందనీ, 'జాస్మిన్' ఘాటుగా వుంటుందనీ సెంటు సీసాలు పలపల పెట్టె అడుగున కుక్కి, పునుగు తీసి రెండు కనుబొమలకు దిద్ది, శేషం మిలమిల మెరిసే తలమీద వ్రాసి, తన 'గమగమ'కు మైమరచి పోయింది. చివర కెలాగో శీతాకోక చిలుకలా తయారై, కారుమీద హుషారా వెళ్ళింది.

మెయిలు వచ్చింది. జన సముద్రాన్ని త్రోసుకుంటూ ఆతృతగా మొదటి తరగతి పెట్టెల వద్దకు వెళ్ళి చూసింది. ఆమె మనసు చిన్నబోయింది. బాలీ రాలేదు. ఎల్లప్పుడూ వేలకొలదీ జనం వుండే హుషారా స్టేషను నిర్మానుష్యంగా తోచిందామెకు. మెల్లగా వచ్చి కారులో కూచుంది. 'అమ్మగారూ! డాక్టరు బాబు రాలేదా' అని డ్రైవ రడిగేడు. బుంగమూతి పెట్టి లే దంది. కారు గృహోన్ముఖ మయింది.

అరుణ తన గదిలోకి వెళ్ళి నిస్సహాయంగా కూలబడిపోయింది. ఎదురుగుండా నిలువుటద్దంలో తన నిండు రూపం చూసినప్పు డామె కళ్లల్లో నీళ్లు తిరిగేయి. ఆ ఆశాభంగాని కామె చాలా నొచ్చుకుంది.

భోజనం అలా యిలా చేసి, సోఫాలో కూచుని టెలిగ్రాం తిరగవేసింది. తను చూడడంలో పొరపాటు లేదు. బాలీ యెందుకు రాలేదో తెలియ లేదు ఆమె మనసు పరిపరి విధాల పోయింది.

మధ్యాహ్నం మూడు గంటలకు ఆమె తండ్రి

హీరాలాల్ ఘోషాల్ కోర్టునుండి యింటికి వచ్చేరు. ఘోషాల్ గారు కలకత్తా హైకోర్టులో న్యాయాధి కారి. ఆయన జూడిషల్‌లో పంజాబ్, ఉత్తర ప్రదేశం, మధ్య భారతం రాష్ట్రాలలో చాలా సర్వీసు చేసి, అప్పటికి కలకత్తా వచ్చి వొక యేడాది కావస్తూంది. శ్రోత్రియ కుటుంబి, ఒపి. కేవలం శాఖాహారి. ఆయన అరుణముఖం వాడి వుండడం చూసి కుశలం అడిగేరు. అరుణ నిరుత్తరంగా టెలిగ్రాం అందిచ్చింది.

"మరిచి పోయేనమ్మా. బాలీ రాలేదా ?" ఆమె లేదని చెప్పింది.

'అతడు మిలిటరీ మనిషి, హుకుమ్ కీ తాబేదార్ ! మాటు ఎల్లుమని అర్డర్లు వచ్చేయో ! లేక త్రోవలో ఎవరైనా కలిసి బలవంతంగా దింపి వేసేరో ! తెలుస్తుంది గా. సాయంత్రానికి తిరిగి యేదో తెలియవచ్చు !"

మొదటి మాట లాసెను కొంచెం అనునయించినా చివర మాటలు గాభరా పెట్టేయి.

మరొక తరంగం దబ్బతిన్న త్రాచులా లేచి తీరాన్ని పెడిల్లని మోదింది. నేనటు గతుక్కు పడి చూసేను, తెలిమేఘాలలో పరుగెడుతూన్న చంద్రుడి కాంతి విరిగిన కెరటాల నీటి బిందువులలో కరిగిన బంగారంలా మెరిసింది. ఆ స్త్రీ ముఖంమీద శాంతి కాంతులు వెల్లి విరిసేయి. హటాత్తుగా రంగం మారింది.

* * * * *

"బాలీ ! నా కోరిక చెల్లించావే !"

'కోరి కేమిటి ? నీది అజ్ఞ ! నీకెలా తెలిసింది రమా నే వస్తున్నానని ?'

భవాని జవాబిచ్చింది. 'రమకు కలలు కనడంలో మంచి నేర్పు వుంది. రాబోయే కాలం సాధారణంగా రమ స్వప్న ప్రపంచంలో వర్తమానం. బహుశా మీరు వస్తున్నారని నిన్నరాత్రి కలగని వుంటుంది." బాలీ పకపక నవ్వేడు—రమ చిన్నగా నవ్వింది.

భవాని రామరాజ్ తెలా స్టేషను మాస్టరుగారి కూతురు. రమ సహాధ్యాయిని. వీళ్ళిద్దరూ కలకత్తాలో 'మెడిసిన్' చదువుతున్నారు.

'రమ చాలా పెంకెది సుమండీ. మా స్వస్థానం జలంధరులో మేం యిరుగు పొరుగు. ఈమె నాకంటె మూడేళ్లు గానును చిన్న. చిన్నప్పుడు నాకంటె బలంగా వుండేది. నన్ను చావగొట్టేది.'

'భవానీ బాలీ మాటలు నమ్మకు. పెరటి తలుపు గొళ్లెంపెట్టి నన్నక్కడ ఎవరూ రాకుండా కాపు వుండమనే వాడు. ఎవరైనా చూస్తే దెబ్బలు నాకే తగిలేవి. తప్పితే తను కోసిన జామి పండ్లలో నాకొక్కటైనా యిచ్చేవాడు కాడు.'

'అప్పుడేం చేసేదో తెలుసాండి ? పైనబడి కోతిలా రక్కి, ఉమ్మిసి, మూశారూ యీ మండపం మీద గాయం ! ఇది ఆవిడ ప్రసాదమే ఇవిగో రెండు పళ్లూ !' ముగ్గురూ పకపక నవ్వేరు.

రోజూ రామ్‌రాజ్ తెలాలో ఆగని మెయిలు ఆవేళ అనుకోకుండా అరగంట ఆగిపోయింది. బాలీ కూచున్న పెట్టె సరిగా స్టేషను మాస్టరు యింటి ముందు ఆగింది. వరండాలో కూచుని రమ, భవానీలు కబుర్లు చెప్పుకుంటున్నారు. అప్పుడు బాలీ వాళ్ల కంట పడ్డాడు. రమ తన కళ్లని నమ్మలేక పోయింది.

ఆవేళ వాళ్ళకి క్లాసు లేదు. అందుచేత రమ భవానీ యింటికి వచ్చింది. వాళ్లిద్దరికీ ప్రాణస్నేహం. అందుకే తనయిల్లు కాకపోయినా బాలీని బలవంతాన దింపేసింది. అరుణకు టెలిగ్రాం యిచ్చిన సంగతి చెప్పినా, తనపట్టు విడువలేదు. 'రేపు కాలేజీకి శెలవు పెడతాం. ముగ్గురం కలసి అరుణ వద్దకు వెడదాం' అతడు కాదనలేక పోయేడు.

భోజనానంతరం ముగ్గురూ యెదురుగా వున్న మామిడితోటలోకి వెళ్ళేరు. చెప్రాసీ వొక తివాసీ, కూజాతో నీళ్లూ, రెండుగ్లాసులు తెచ్చేడు. ముగ్గురూ కూచున్నారు.

అది ఏప్రిల్ నెల. ఎండ మండిపెడుతూ చండ్రగాడ్పులు పుట్టిస్తూంది. ఆ తోటలో కొంత చల్లగా వుంది. చుట్టుపట్ల యెండిపోగా మిగిలిన చెరువుల నీటి మీంచి అప్పుడప్పుడు శీతల పవనం వచ్చి చెమ్మట బొట్లని ఆర్చి సేద దీరుస్తూంది.

'స్పెషల్ ట్రెయినింగుకు బెంగళూరు వెళ్లేను. ఆది ముగియగానే కొంకొం వారంపడుతుంది. ఈలోగా పఠాన్కోటలో పటాలం హెడ్ క్వార్టర్సు చిట్టగాంగు

నుంచి తంతి వచ్చింది తక్షణం రమ్మని. నన్ను 'ఇంఫాల్' పంపిస్తారని రహస్యంగా తెలిసింది.'

భ :— ఇంఫాల్! ఇంఫాల్ జపానీయులు రహస్యంగా తిరుగుతున్నారని పుకారుగా వుంది మీరు జాగ్రత్తగా వుండాలి.

ర : బాలీకేం భయం. బాలీ కండలు చూశారూ! పదిమంది జపానీయుల్ని ఆపోశనం పట్టగలడు.

భవానీ వళ్లు ఝల్లుమంది. ఆ రెండు గంటల కాలంలో అతడేమో ఆత్మబంధువైన ట్టయిందామెకు.

బా : కబుర్లు చెప్పడంకాదు రమా! నువ్వొస్తావా ?'

శ : భయమనుకున్నావా ? నా చదువింకా పూర్తికాలేదు. పైగా మన దేశంకోసం యుద్ధం చెయ్యవలసి వచ్చినప్పుడు నేను ముందుగా రణరంగంలోకి దూకుతాను.

బా : ఆ సమయం వచ్చినప్పుడు నిన్ను పిలకపట్టుకుని మేమే లాగుతాం రంగంలోకి. కాని అనుకోకుండా అంత అవసరం త్వరలోనే, యీ యుద్ధంలోనే యెందుకు కలగకూడదు ?

ర : అప్పుడు రంగంలోకి రెక్కలు కట్టుకువాలతాను. క్టెపెన్ రమ వచ్చి కర్నల్ బాలీకి షేక్‌హాం డిస్తుంది.

బా : రాకపోతే ?

ర : గుండేసి కొట్టే.

బాలీకి నిలువెల్లా పులకాంకురాలు పుట్టేయి. భవానీ హృదయ మందిరంలో బాలీ పదిటన్నుల బంగారు విగ్రహంవలె ప్రతిష్ఠయేడు.

తిరిగి సింహపు పంజా దెబ్బవంటి ఊర్మికాప్రహారం పొందిందా తీరం. నాహృదయంలోకూడా యేదో కల్లోలం బయల్దేరింది. రంభోయే సీను సాగరమథనం కామోమా ననిపించింది.

* * * * *

ఉదయం సుమారు తొమ్మిది గంటలకు బాలీ, రమ, భవానీలు, అరుణయింటికి వెళ్లేరు. వాళ్లు వచ్చేముందు అరుణ బాలీ పంపిన టెలిగ్రాం వేపు చూస్తూ యీజీ చైరులో కూచుంది. అప్పుడే ఆమె నీళ్లు పోసుకుంది. ఇంకా టీ, ఫలహారం పుచ్చుకోలేదు. టెలిగ్రాం కాగితంమీద ఆమె కళ్లనుండి నాలుగైదు అశ్రుబిందువులు టపటప జారేయి. అక్షరాలు కొంచెం చెదిరేయి.

బంట్రోతువచ్చి క్టెపెన్ బాలీ వచ్చేరని చెప్పేడు. ఆనందంతో అరుణ హృదయం కొట్టుకుంది. అప్రయత్నంగా ఆమె నేత్రాలు చెమ్మగిలించేయి.

గబగబ వెళ్లి అద్దంలో ముఖం చూసుకుంది. ఎప్పుడు చెదరగొట్టుకుందో జుట్టు సరిగా లేదు. నయన గోళాలలో అరుణ రేఖలు ప్రస్ఫుటంగా వున్నాయి. ముఖం వాడినట్టు గ్రహించింది. బాలీని యెదుర్కొన్నప్పుడు ధరించడానికి తను ఎన్నుకున్న చీర స్టాండు నే వుంది. పోనీ బాలీ తనకు క్రొత్తకాదు కదా, తన మూర్తి సాక్షాత్కారానికే చిటచిట వెన్నవలె, కరిగి పోతాడని మనస్సును సమాధాన పరుచుకోలేకపోయింది.

అర్ధ నిమిష కాలంలో ఆమె హృదయం బంగారు పిచ్చుక గూడులా వూగిస లాడింది. బాలీ పెద్దగా కేకలు వేస్తూ వస్తున్నాడు. మరి రెండు ఆడ గొంతికలు, వికావిక నవ్వుతూ, వినిపిస్తున్నాయి.

'క్షమించు అరుణా. నిన్న నా వైరు ప్రకారం రాలేకపోయేను. ఆఁ!-వీరు మన స్నేహితులు. ఈమె రమామణీచావ్లా; యీ వూళ్లో పెద్ద వర్తకులు కుందన్‌లాల్ చావ్లా కూతురు. ఈమె భవానీ చక్రవర్తి; రామ్‌రాజ్ తలా స్టేషన్ మాష్టరు పీయూష కాంతి చక్రవర్తి కూతురు. ఈమె నా బాల్య స్నేహితురాలు, హైకోర్టు జడ్జీగారు హీరాలాల్ ఘోషాల్ కుమార్తె, నా కత్యంత ప్రియమైన అరుణా ఘోషాల్!

పరిచయం ముగిశాక రమ ముందుకు వచ్చి అరుణ చెయ్యిపట్టుకుని 'చెల్లీ అరూ! బాలీ నేమీ అనకు. ఆయనను త్రోవలోనే నే దింపేశాను. క్షమించు' అంది.

'అవును దిగకపోతే నన్ను చావగొడుతుందేమో అని భయం.'

రమ పకపక నవ్వింది. భవాని మృదువుగా నవ్వింది. అరుణ బలవంతంగా పెదవులతోనే నవ్వ ప్రయత్నించింది.

రమను చూస్తూన్న కొద్దీ అరుణ హృదయంలో అవ్యక్తానుభూతి పొందుతూంది. తనకంటె ఆ పంజాబీ స్త్రీ నిర్వివాదంగా పొడగరి. ఆమె యౌవనం నిర్లక్ష్యంగా విజృంభించింది. నవ్వితే గది అంతా వెలుగుతో నిండి పోతూన్నట్టుంది. కంఠాలు తిరిగిన బాలీ బహద్దర్ రూపానికి ఆ పాటి శరీరం లేకపోతే జోడు కుదరదని ఆమె శంకించింది. ఆమె కంటె తను కొంచెమే పొట్టిగా వున్నా, హృదయ దౌర్బల్యంవల్ల మరు గుజ్జువలె వున్నట్టు భావించుకుంది.

భోజనానంతరం బాలీ, భవానీ లొక సోఫాలోనూ, అరుణ, రమలు యెదుటి దానిలోనూ కూచుని బాతాఖానీ అరంభించేరు.

ర :—బాలీ నువ్వు జపానీయుల్ని చూసేవా?

బా :—ఖైదీలను చూసేను నాలుగైదు మార్లు. కాక్సస్ బజారు ప్రాంతంలో రెండు సారులు సైనికులు తారసపడ్డారు.

భ :—కాక్సస్ బజారు! అది మా అక్క అత్తవారి వూరు. ఆమ్మో! వాళ్లు మనదేశంలో కొళ్లు పెట్టే రన్నమాటే,

బా :—కాక్సస్ బజారేమిటి? "రామూ" వరకూ కూడా వచ్చేరు. వాళ్లు సంపులుగా రారు. ఒక్కొక్కరే వస్తారు.

ర :—అదేమిటి భవానీ అలా అంటావు! అడుగు, బాలీ యెంతమంది జపానీయుల్ని పట్టేడో.

ఆ మాటకు అరుణ మనసు మండింది. భవాని వణకిపోయింది. రెండు చేతులూ అప్రయత్నంగా జోడించి, హృదయ భాగాన్ని చేర్చి, గద్గదికతో 'అలా చెయ్యబోకండి' అంది. రమ అన్నది. 'నువ్వు చెప్పక్కరలేదు భవానీ, బాలీ ధైర్యం నాకు తెలీదూ? పలాయన మంత్రం పఠించడంలో ఆయన మొదటి వాడు.'

ఈ సంభాషణ జరుగుతూన్నంతసేపూ కేవలం శ్రోతగావున్న అరుణ హృదయంలో యీ చివరి మాటలు బల్లెంవలె గుచ్చుకున్నాయి. ఆమెపై గల ద్వేషం ప్రజ్వరిల్లింది. రమ తిరిగి అంది 'జపానీయులు చాలా సాహసవంతులు. వాళ్లు యుద్ధరంగంలోకి వచ్చేటప్పుడు తల్లులు వారిని తిరిగి రావద్దంటారట. భార్యలు వెయ్యిమంది కన్యలచేత సూదిపోట్లు పొందిన బెల్టులు భర్తల నడుముకు చుట్టి పంపుతారట. అవి సహస్ర కన్యా కరస్పర్శచేత పవిత్రత కలిగి తుపాకీ గుండు నుంచి వారిని రక్షిస్తాయని వారి నమ్మకం. తల్లుల ఆశీర్వాదం, భార్యల రక్షాబంధం, అన్నిటి కన్న మాతృదేశాన్ని కాపాడాలన్న ముఖ్య లక్ష్యం కలిగిన ధైర్యకేసరులు జపానీయులు.'

బాలీ రమ చేతులు పట్టి వూపి చిరునవ్వుతో, 'నీ కీ విషయాలెలా తెలిశాయి?' అన్నాడు.

అరుణ చివాలున లేచి, వరండాలోకి వెళ్లి వీధిలోకి చూస్తూ నిలబడింది. అది మిగిలిన వారంతా గమనించలేదు. రమ విరగబడి నవ్వుతూ బాలీ వీపుమీద దబదబ మోది 'నాకు దూరశ్రవణ దూరదృష్టి శక్తులున్నాయి తెలుసా?' అంది. ఆ దెబ్బలు తన వీపు మీద పడుతూన్నట్టు భావించింది అరుణ. అలా నవ్వుతూనే రమ యెదురుగా వున్న అద్దంవద్దకు వెళ్లి జుత్తు సరిచేసుకుంటూ 'పదండి. వూళ్ళోకి వెళ్ళి పడదాం.' అంది. బాలీ అరుణను తయారవమని కేక వేసేడు. అరుణ తనను విడిచి పెట్టమని కోరింది.

అలా వీల్లేదని ఆమె మాటలు జొరనీకుండా రమ వరండాలోకి పరుగెత్తి, క్రిందని తోటమాల కారుషెడ్డు ముందు నిల్చున్న డ్రైవరును కారు సిద్ధం చెయ్యమని హెచ్చరించింది. అరుణ బుంగమూతి పెట్టి యింకా వీధిలోకి చూస్తూంది. బాలీ ఆమె పక్క చేరి, 'అరుణ! ఏం అలా వున్నా' వని ప్రశ్నించేడు.

'ఎలా వున్నాను?'

'నే ననుకోనట్టుగా'

'నువ్వుకూడా నే ననుకోనట్టుగానే వున్నావు. అంచేత నే నిలా వుండడం విపరీతం కాదనుకుంటాను.'

బాలీకి ఆమె అంతర్యం పూర్తిగా అర్థం కాలేదు. కాని అతని బలవంతంమీద ఆమె యెలాగో బయలుదేరింది.

వాళ్లు మొదట '*The Great Eastern Hotel*' లోకి వెళ్లేరు. గుండ్రటి బల్లచుట్టూ కూచోగానే హోటలు నౌఖరు మొదట రమవద్దకు వచ్చి సలాముచేసి ఆజ్ఞాపించమన్నాడు. తమ బృందంలో మిక్కిలి

ఆకర్షవంతమైన వ్యక్తి రమ అని తెలిసిపోయినట్టుబాధ పడింది అరుణ. మొదట బాలీ ప్రక్కకూచున్నది దిగ్గనలేచి, భవానిని అక్కడకు రమ్మని తాను ఆమె కుర్చీమీద కూచుంది. అదేమని బాలీ అడుగుతే, ఆ కుర్చీ పొట్టి అని జబాబు చెప్పింది. నిజానికి కుర్చీలన్నీ వొకే సైజువి. భేదం అంతా హృదయాల సైజులో నే.

కబుర్లు చెప్పుకుంటూ నలుగురూ ఐస్‌క్రీమ్ సేవిస్తున్నారు. బాలీ భవానీతో యుద్ధ విశేషాలు అదే పనిగా చెపుతున్నాడు. రమ నాలుగైదు చెంచాలు తింది. అరుణ వొక చెంచా రుచి చూసి ఆపుచేసింది. రమ నిమ్మళంగా తన కప్పులోని ఐస్‌క్రీమ్ కొంచెం కొంచెంగా బాలీ కప్పులోకి బదిలీ చెయ్యజొచ్చింది. మాటల సందడిలో అది గ్రహించక బాలీ తినివేయ జొచ్చేడు. భవాని గ్రహించి ముసిముసి నవ్వు నవ్వుకుంది. అరుణ ఆ పాదమస్తకం మండిపోయింది. ఎంత సేపటికీ తన కప్పు ఖాళీకాకపోగా బాలీకి అనుమానం వేసి రమ వేపు చూసేడు. ఆమె కొంటెగా నవ్వింది.

బైటకు వచ్చి డ్రైవరును 'మైదాన్' మీద వేచి వుండమని, రమ అందర్నీ 'పారడైజ్ హాలు'కు పద మంది. అరుణ తలనొప్పి వచ్చిందని, తను సినీమా చూడలేననీ హీనస్వరంతో చెప్పింది. అయితే అంతా యింటికి పోదామన్నాడు బాలీ. కాని రమ, అరుణను బలవంతపెట్టింది. అరుణ రానని పట్టుపట్టింది. ఆమె నుదుటిమీద చెమటపోసింది. అది తుడుచుకునే నెపంమీద బలవంతంగా పైకుబుకుతూన్న కన్నీళ్లు రుమాలుతో తుడుచుకుంది.

చివరకు అరుణ యింటికి బయలుదేరింది. ఆమెకు సాయంగా తనుకూడా యింటికి మరలుతానని భవాని బయలుదేరింది. బాలీకి గొంతులో వెలక్కాయ పడింది. అతని చెయ్యి పట్టుగుని రమ లాగుతూ అరుణతో తొమ్మిదింటికి కారు పంపమంది. అరుణ హృదయమంతా గొంతులోచేరి గడ్డకట్టగా మాటరాక తలవూపింది అలాగే అన్నట్టు.

హటాత్తుగా అరుణకు శిరోవేదన కలిగినందుకు భవాని చాలావిచారించి తన వడిలో ఆమెను పడుకోబెట్టుకుంది. ఆమె వడిలో కళ్లు మూసిన అరుణ మానస నేత్రంలో యేవో దృశ్యాలు గోచరించేయి.

ఆమె కెక్కడెక్కడివో పకపక నవ్వులు వినిపిస్తున్నాయి.

తిరిగి వొక పెద్ద కెరటం తీరాన్ని ఢీకొంది. మబ్బు తునకలలోంచి చందమామ వడివడిగా పరుగెడుతూ ఆ స్త్రీ ముఖంపై కాంతి తరంగాలు ప్రసారించింది. ఆమె యెత్తిన ముఖం అలాగే వుంచి గగన కుసుమం వంటి చంద్ర గమనం గమనిస్తూంది. రంగం మారింది.

* * * * *

కెప్టెన్ రమ, మేజర్ బాలీ రంగూనులో వొక పెద్ద హోటలులో హటాత్తుగా కలుసుకున్నారు.

రంగూన్ ఆనాడే తిరిగి మిత్రమండలి వశమయింది. వేనకు వేలు సోల్జర్లు, నానా జాతివారూ నగరంలో విచ్చలవిడిగా తిరుగుతున్నారు. పోయిన జపానీయుల కన్న ఘోరంగా అత్యాచారాలు ఆనందం పేరిట చేస్తున్నారు. కడుపు చిచ్చు పశుప్రవృత్తిగా మారి పెదవిపై తెచ్చుకున్న మందహాసంతో 'రాక్షసరతి' అనుభవిస్తూంది.

నగరం దీపకోటితో మెరిసిపోతూంది. తినే వారితో, త్రాగే వారితో, ఆడే వారితో ఆ హోటలు ఒకే వొక సంతోషపు వెల్లువగా వుంది. తరతమతారతమ్యం లేకుండా ఆలివ్ యూనిఫారములు, ఖాకీ చీరలు, గౌనులు భుజాభుజీ ప్రవర్తిస్తున్నాయి. ఈ మానవత్వం మానంలేని, మానవ మన్యులనుండి దూరంగా వొకమూల, బాలీ, రమ కూచున్నారు.

రమను చూడగానే బాలీ ఆశ్చర్యపోయేడు. ఆమె షిల్లాంగు I. M. H నుండి ఆ తొలినాడే విమానంలో వచ్చిందనీ, ఆ ఆస్పత్రియొక్క అడ్వాన్సు విభాగానికి అధికారిణిగా తనే స్వయంగా కోరుకుని వచ్చిందనీ తెలియగానే నిశ్చేష్టుడయేడు.

అక్కడనుండి యిద్దరూ లేచి బజారు వెంట నడవ జొచ్చేరు. త్రాగిన తెల్లసోల్జరొకడు తూలుతూ వాళ్లకెదురుగా వచ్చి, రమను ముద్దుపెట్టుకోబోయి ఆమె భుజద్వయంమీద పువ్వులు చూసి, వెనక్కుతగ్గి సెల్యూటు చేసి తన దారిని పోయేడు.

వాళ్లు బాలీ గది చేరే సరికి రాత్రి సుమారు

పన్నెండు గంటలయింది. అప్పుడు వాళ్ళిద్దరిమధ్యా పెద్ద ఘర్షణ జరిగింది. ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరడానికి వచ్చేనని రమ చెప్పింది. అది బాలీకి నచ్చలేదు. నేతాజీ చేస్తున్నపని తెలివి తక్కువదని అతను వాదించేడు. రమకు కోపంవచ్చి కళ్ళెర్రచేసింది. 'నే నా నాడు రామ్‌రాజ్‌తలామామిడి తోపులో చెప్పలేదా? మాతృభూమికోసం పోరాడవలసిన సమయం వచ్చినప్పుడు రెక్కలు కట్టుకుని రంగంలో వాలతానని. ఇప్పుడా సమయం వచ్చింది. అందుకే అతురాలా నా ప్రయాణం పూర్తిచేసేను.' బాలీ అన్నాడు. 'అంతా బాగానే వుంది. కాని వాళ్ళు నేల విడిచి సాము చేస్తున్నారు. ఎదిరిబలం తెలీకుండా పోరడం నిష్ప్రయోజనం, ప్రమాదకరం.'

'పరవాలేదు. మనం నెత్తురిస్తే నేతాజీ మనకు స్వాతంత్ర్యం యిస్తానన్నాడు. ఇప్పుడు కాకపోతే వొకప్పుడైనా లోకం గ్రహిస్తుంది. ముందుముందెప్పుడైనా భారత దేశానికి స్వాతంత్ర్యం వస్తే ఆజాద్ హింద్‌ఫౌజు సైనికులు బలిపోసిన నెత్తురే కారణం అనుకో. ఇదిసత్యం.'

వాళ్ళు రాత్రి రెండు గంటలవరకూ తీవ్రంగా వాదించుకున్నారు. ఆ అభిప్రాయాలలో యేకీభవించలేకపోయేరు. రమను బాలీ తన స్టేషన్ వాగన్‌లో దిగబెట్టేడు.

మళ్ళీ మరొక కెరటం తీరాన్ని ముద్దుపెట్టుకుంది. చందమామ నిర్మలాకాశ మ్మీద మందగమనంతో ప్రకాశిస్తున్నాడు. సందేహాంధకార నివృత్తి కలిగినట్టు లోకం శాంతి వహించింది.

* * * * *

నేతాజీ పటాలంమీద శాపపరంపరలు కురిపించిన వారే తిరిగి ఆ వీరులకు కలకత్తాలో బహిరంగ సభలలో పూలమాలలు వేసేరు. పాములకు రెండు నాలికలేగాని మానవులకు చాలా నాలికలు. కెప్టెన్ రమపై ప్రభుత్వం అభియోగం తెచ్చింది. ఆమె నిర్దోషిత్వం రుజువై తిరిగి కలకత్తా వచ్చింది. వచ్చిన మరునాడే అరుణ వద్దకు వెళ్ళింది.

'ఏం అరూ, అలా చిక్కిపోయేవు. నీ ముఖం పాలిపోయిందికూడా.' అరుణ వెంటనే జబాబు చెప్పలేకపోయింది. కాని కొంతసేపటికి నీరసంగా 'చిక్కిపోయేనా' అంది. రమ ఔనని చెప్పి యెన్నో ప్రశ్నలు తన మామూలు ధోరణిలో వేసింది. అరుణ క్లుప్తంగా జబాబులు చెప్పింది. కాని ఆమెలో యేదో బెంగ వూగిసలాడుతూంది. రమ యిదివరకు లాగ హుషారుగా పకపక నవ్వుతూ, 'బాలీ గురించి అడగవేం!' అంది. అరుణ హృదయం రైలులా పరుగెత్తింది, కాని నిరుత్సాహమేదో కృంగదీసింది. చివరకు బలిమిని మాట పెకిలించుకుని 'అడిగి యేం ప్రయోజనం' అంది. గద్గదస్వరంతో తిరిగి 'ప్రేమించడం సులువు గాని అవాంతరాలు దాటడం కష్టం అని పాఠం నేర్చుకున్నా' అని గొణిగింది.

'పొరబడ్డావు అరూ. నా పై పై వికారాలు చూసి నన్నొక బండరాయి అనుకున్నావు కామోసు.

పెట్టిదానా — ప్రేమించడమే మహా కష్టం. ప్రేమకు అవాంతరాలు లేవు.'

అరుణ నేత్రాలు కొంచెం జేవురించేయి. హృదయం దహించుకుపోయింది. కాని వుద్రేకాన్ని ఆపుకుందుకి యత్నించింది. అది గమనించి రమ ఆమె అడగకుండానే చెప్పింది. 'బాలీ యీ ప్రపంచంలో వున్నాడో లేడో చెప్పలేను. నేను నేతాజీ ఫౌజులో చేరిన తరువాత వొక జపానీ రెజిమెంటుతో మా పటాలం కలిసింది. అక్కడకు వుభయులూ పట్టిన ఖైదీలు వచ్చి రెండు మూడు రోజులుండి, వేరు వేరు స్థలాలకు తీసుకుపోబడేవారు. ఒక రోజున జపానీయులు తెచ్చిన ఖైదీలలో బాలీ అగుపించేడు. గుండు దెబ్బకు అతని కుడిచెయ్యి పోయింది. నేనాతనిని మా రెజిమెంటులోనికి తీసుకుందుకు నా పలుకుబడి యావత్తూ వినియోగించి ప్రయత్నించేను. కాని లాభంలేకపోయింది. రెండు దినాలు తరువాత జపానీయులతనిని యెక్కడికో తీసుకపోయేరు.'

అరుణ గుండె గుభేలుమంది. తలపై పిడుగు పడ్డట్టయిందామెకు. ఆమెకు రమవొక రాక్షసిలా కనిపించింది. కోపం మరి ఆపుకోలేకపోయింది. 'అందుకేనా నువ్వతనిని ప్రేమించి నన్నవతలికి నెట్టేవు?' 'నేనతనిని ప్రేమించేను. నిజమే. కాని సోదరుడివలె. అతనూ నేను ఆబాల్య స్నేహితులం. ఒక కంచంలో తిన్నాం. కాని నువ్వసలు అతనిని ప్రేమించలేదు.

అతని చుట్టూ గోడలు పెట్టడానికి ప్రయత్నించేవు. ప్రేమ గోడలు పసుల గొడుతుంది గాని పెట్టదు. నేను నా జీవితంలో యెవ్వరినీ సంసార సౌఖ్యం కోసం ప్రేమించలేను. దేశసేవలో మునిగిపోయిన నాకు వీట న్నిటికీ తీరిక లేదు. ఆ రోజున భవానీతో కలిసి మనం వూళ్లోకి వెళ్ళినప్పుడు నువ్వుపడ్డ యాతన గమనించక పోలేదు. నీ నీరసత్వం గ్రహించక పోలేదు !"

అరుణకు దుఃఖం పొంగి వచ్చింది. లేచి వెళ్లి రమ వడిలో తలదూర్చి వలోరని యేడ్చింది. 'అక్కా' నే నేం చేసేది' అని విలపించింది. అరూ బేలపడకు, అతనిని నువ్వు ప్రేమించు. నీ హృదయాన్ని అతని ప్రేమతో వెలిగించు. ఆ కాంతి జీవించినంత కాలం బాలీ ప్రాణానికి హాని వుండదని నీ హృదయాన్ని నమ్మించు. ఈ నమ్మకంతో జీవితం సాగిపోయినా ఫరవాలేదు. ప్రేమకి కన్నీళ్లే, నిట్టూర్పులే పరమా వధులు.'

ఆ మాటలు అరుణ హృదయంలో వుప్పెన లేవ దీసేయి. కాని ఆ ధాటిని మించి, ఆ యింటిలో పది రోజుల తరవాత మ్రోగబోయే సాన్నాయి భైరవిరాగం హోరెత్తింది. బాలీని గురించి నిరాశ చేసుకుని, తన మేనత్తకొడుకును వివాహం చేసుకుందుకు ఆ వేళ వుద యాన్నే అంగీకృతి తెలిపింది. ప్రధానం కూడా జరిగింది.

ఆమె రమ వొడిలో తలదూర్చి వుంచిన నిము షాన్నే అక్కడకు ఘోషాల్ గారు వచ్చేరు. ఆ వృద్ధుడు గడ్డం సవరించుకుంటూ, 'సమయానికి వచ్చేవు రమా...ఒహొహో...ఇప్పుడే కాదు. పది రోజులలో అరుణ పెళ్లి కూతురై వస్తుంది. అప్పుడు దీవించు.' అన్నాడు. రమ పైకి నవ్వింది!

ఇక సముద్రం, ఆ నిల్చున్న వనితా నాకు అసు పిస్తున్నారు. వాళ్లకు అవినాభావం. తరంగాలు లేవు. ఒకటే ప్రశాంతి! ఒకటే చంద్రికా కాంతి.

* * * *

కాలరథగమనంలో దాని చక్రాల క్రింద పడి దేశం మొదట రెండు ముక్కలై, తరవాత కరకరనలిగి, వెచ్చ వెచ్చటి నెత్తుటి ప్రవాహం పొంగి పొర్లింది. మానవుడిలోని పశువు విజృంభించింది. దాని పాదాల రాపిడికి మానవత్వపు విలువలు పింపిపెం డయి పోయేయి.

ఉద్యోగం విరమించి స్వస్థానమైన చిట్టగాంగు చేరుకున్న పియూష కాంతి చక్రవర్తి కుటుంబం యీ తిరగలిలో పడి చూర్ణమయింది. నరపశువుమీద నరపశు వుకు వుట్టిన ద్వేషాగ్నికి భవాని తలిదండ్రులు, కొంద రన్నదమ్ములు ఆహుతి అయిపోయేరు. ఆమె స్వంత ఆస్పత్రిపై అగ్నిదేవుడు తాండవించేడు. కాందిశీక ప్రవాహంలో ఆమె వొక నీటిబిందువుగా, పది హే నేండ్ల తమ్ముడూ, వృద్ధురాలైన మేనత్తతో విశాఖ పట్టణం చేరుకుంది.

భవాని విశాఖ పట్టణంలో వైద్యవృత్తి ప్రారం భించింది. సముద్రాని కెదురుగానే వున్న ఆమె బంగళాలోంచి, వెన్నెల రాత్రులు వచ్చి, వొక్కొ క్కప్పుడు తెల్లవార్లూ జ్యోత్స్న చేసే గారడీ గమని స్తూంటుంది. మేఘసందేశాలు పంపుతూంటుంది జవాబు అపేక్షించకుండా. అంతేగాని నేను ఆమె చేలి ఆత్మహత్య చేయించేపాటి శక్తి కలవాడిని కాను. ఆమె ప్రేమలో అంత బలహీన కాదు.

కథవిని నా కలం కన్నీటితో సంతోషించింది.

---

నాటిక:

# అనంతర యాత్ర



శ్రీ. శ్రీ.

ప్రకటన: కాలం అంతా ఒకటేగాని అందరికీ ఒకటి కాదు. జీవిస్తున్నవారి కాలం వేరు. మరణించిన వారి కాలం వేరు. గర్భంలో ఉన్న శిశువు దొక కాలం. ఇంకా గర్భస్థం కాని జీవి దింకో కాలం. స్టీమరులోనో, విమానంలోనో ప్రయాణం చేస్తున్న వాడికీ, నిద్రపోయి కలగంటున్నవాడికీ, మతిపోయిన వాడికీ, వైరాగ్య వైరాశ్యాలవల్ల కాషాయం ధరించిన వాడికీ, కాలం ఒకే విధంగా గడవదు.

(రైలుబండి నడుస్తున్న చప్పుడు ప్రారంభం)

తత్వశాస్త్రాధ్యాపకుడు శ్రీ రంగారావు రైలు బండిలో ప్రయాణం చేస్తున్నాడు. నిద్రపోతున్నాడు. అతడు కాక ఇంకా ఆ మొదటి తరగతి పెట్టెలో ఇద్దరు మాత్రం ఉన్నారు. కాంతం, సరళ.

కాంతం: టైమెంతయింది సరళా?

సరళ: సారీ. నా వాచీ ఆగిపోయింది.

కాంతం: ముసిలాడు చేతిని వాచీతోనే నిద్రపోతున్నాడు. చూడెంత టైమయిందో!

సరళ: మర్యాదగా మాట్లాడు కాంతం. ఆయనెవరో తెలుసా?

కాంతం: ఎవరైతే మనకేం? అయినా ఎవరు?

సరళ: ఆ సూట్ కేస్ మీద పేరు చూడు.

కాంతం: ఏ. యస్. రంగారావు. ఇంకో ఎస్ తక్కువ!

సరళ: షటప్. ఈయన చాలా గొప్పవాడు. మా వారెప్పుడూ ఈయన్ని గురించే చెబుతూంటారు.

కాంతం: సరే. ఒప్పుకున్నాం. టైమెంతయిందో చూడమంటే—

సరళ: ఆరు.

కాంతం: ఎప్పుడో ఆగిపోయిన నీ వాచీలో కాదు. అడుగో ఆ వాచీలో. ఎంతయిందో చూడవే?

సరళ: నీ వాచీ యేం చేశావ్? పెట్లో పెట్టేశావు కాదూ? ఏం జాగ్రత్త!

కాంతం: నీ వాచీకి కీ ఇవ్వడం మరిచిపోయుంటావు. ఏం అజాగ్రత్త!

సరళ: అక్కయ్యోయ్!

కాంతం: ఏమిటే అది? నిర్ఘాంతపోయావ్?

సరళ: ఈయన వాచీ కూడా ఆగిపోయింది.

కాంతం: మంచి పని చేసింది.

సరళ: కాదే. సరిగ్గా ఆరుదగ్గరే ఆగిపోయింది.

కాంతం: అయితే ఏమంటావు?

సరళ: ఏమీ లేదు. ఎందుకేనా మంచిది. నీ వాచీ కూడా చూడు. నా కేమిటో భయం వేస్తోంది.

కాంతం: సూపర్‌స్టిషన్! భయమెందుకే! అన్ని వాచీలూ సాయంత్రం ఆరుగంటల కాగిపోయాయనే; ఈ రాత్రి ఏదో ప్రళయం వచ్చేస్తుందనే; ఫరవాలేదు నా వాచీ సరిగానే ఉంటుందిలే!

సరళ: అయినా ఓమారు పెట్టె తెరిచి చూద్దూ!

కాంతం : చాదస్తం! చాలా రాత్రి అయింది: ఇక నిద్రపోదాం.

సరళ: అలాగంటే పనికిరాదు. నా గుండెల్లో పెద్ద బెంగపడింది. ఏదీ నీ తాళం ఇలా ఇయ్యి.

కాంతం: ఇవ్వకపోతే?

సరళ: పోనీ నువ్వే తియ్.

కాంతం: చిన్న పందెం వేద్దాం. నా వాచీ తిరుగుతూనే ఉంటుందని నేను, ఆగిపోయుంటుందని నువ్వు!

సరళ: అబ్బ, తాళం ఇవ్వకపోతే నన్ను చంపుకు తిన్నట్టే.

కాంతం: ఏమిటా ఒట్టూ నవ్వూనూ? కావలిస్తే ఇంద.

రంగా: అమ్మాయిలూ! ఇంకా నిద్రపోలేదూ? అర్థ రాత్రయినట్టుందే...అరే నా వాచీ ఆగిపోయింది!

సరళ: నా వాచీ కూడా సరిగ్గా ఆరుదగ్గిరే ఆగిపోయిందండీ!

కాంతం: ఊఁ. నా వాచీ కూడా తీసి చూడు! ఇవాళ కాలమే ఆగిపోతుందని సరళభయం.

రంగా: కాలం ఎప్పుడూ ఆగిపోదమ్మా. ఇక గడియారాల మాటా? మూడు గడియారాలొక్కసారి ఒకేచోట ఆగిపోతాయా అంటే అటువంటి సంఘటన అసంభవం అనను గాని—అతి అతి అతి, అత్యంత--

సరళ: (గట్టిగా) అక్కయ్యా! (రైలుప్రమాదం. పెద్ద చప్పుడు. చాలా గల్లంతు. రకరకాల గోల.)

ఆకాశవాణి రేడియోవార్తలు. గతరాత్రి రైలు ప్రమాదంలో గాయపడినవారి సంఖ్య ఆరు. మరణించినవారి సంఖ్య ఒకటి. మరణించిన వ్యక్తి ప్రొఫెసర్ ఏ. యస్.........

ఒక గొంతు: చాలు! ఈ వార్తలు, రైలు ప్రమాదం. గాయపడ్డవారు, మరణించినవారు! విమాన ప్రమాదం—గాయపడ్డవారు, మరణించినవారు! యుద్ధ ప్రమాదం – గాయపడినవారు మరణించినవారు! ఏదీ ఇవన్నీ మరిపించే మంచి సంగీతం! (మ్యూజిక్)

రంగా: గణితశాస్త్రరీత్యా కాలం ఆగిపోవడం సంభవమా? అసంభవమా? ఆ అమ్మాయి వాచీ నడుస్తోందో ఆగిపోయిందో తెలియలేదే? అక్కయ్యా అని అరిచి కిటికీలోంచి గెంతేసింది. నేను నిద్రపోతున్నానా? మేలుకున్నానా? ఇప్పుడు టైమెంతయిందో?

రైలు ఆగిపోయినట్టుందే! స్టేషన్ గానీ వచ్చిందా? అంతా చీకటిగా వుందే. అరే నా వాచీ యేదీ? చెయ్యేదీ? శరీరం ఏదీ?

ఒక గొంతు: ఆ ఒక్కడైనా చచ్చిపోయుండకపోనట. షాక్ వల్ల గుండె ఆగిపోయిందట. ఇదుగో పేపర్లో ఉంది.

రంగా: నా గురించే మాటాడుకుంటున్నారు.

ఒక గొంతు: ఆ పెట్టెలోనే ప్రయాణం చేస్తూన్న అమ్మాయొకతె పది గజాల దూరంలో బురదలో పడిపోయి చెక్కు చెదర లేదు.

రంగా: చేతులో రిస్టువాచీ కూడా ఉందా?

ఒక గొంతు: చేతిని రిస్టువాచీ మాత్రం ఆగిపోయింది. అయితే అది ప్రమాదానికి పూర్వం ఆరు గంటలకి!

ఇంకొకడు: ఈ పేపర్లవాళ్లు ఏ సంగతి వదిలిపెట్టరురా!

ఒక గొంతు: ఈ చిత్రం చూశావా? ఆ పిల్ల చేతిలో ఇంకో రిస్టువాచీ ఉందట. దాని ముల్లు—

ఇంకొక: చాల్లెద్దూ!

రంగా: చంపేశాడు! ఈసారి నేను నిజంగా చచ్చిపోయాను! ముల్లు తిరుగుతున్నట్టా? తిరగనట్టా? ఏయ్ పేపరు చదువుతున్న మనిషీ! నిన్ను నిన్ను బతిమాలుకుంటాను. చెప్పవూ? దాని ముల్లు—

ఒక గొంతు: మూడు ముల్లూ పడ్డాక ఏలుకోక ఏం చేస్తాడంటూ?

రంగా: వీళ్లు మరేదో ధోరణిలో పడ్డారు. లాభం లేదనుకుంటాను. 'అయినా అరిస్తే?—అరుస్తాడు—ఏయ్ అబ్బీ!

ఒక గొంతు: ఛీ! దోమలు! ఒకటే సంగీతం. మీ యింటినిండా ఇన్ని దోమ లేమిటి?

రంగా: నేను దోమకన్నా హీనం! దోమకు ప్రాణం ఉంది. నాకు లేదు. లేదని బెంగకూడా లేదు గాని టైమెంతయిందో తెలిస్తేనా?

ఒక గొంతు: అబ్బో! చాలా టైమయింది. ఇక నేనింటికి వెళ్ళాలి.

ఇంకొక: ఏం ఇప్పుడేమంత మించిపోయింది. కాఫీ తాగి పోవచ్చు. ఒసే!

రంగా: కాఫీ తాగాలన్న తాపత్రయం ఒకటి వొదిలిపోయింది, చచ్చి పోవడంలో చాలా హాయుంది. కాఫీ ఒకటే అన్నమాటేమిటి? తిండీ తిప్పలూ అక్కర్లేదు. ఇల్లూ వాకిలీ అనవసరం! బట్టలు వేసుకోవాలన్న బెడదలేదు. నా టైంఎప్పుడూ సమయానికి కనబ

పేదికాదుకదా! సమయం! సమయం! ఏమిటో జ్ఞాపకం వస్తోంది! ఏమిటి చెప్మా! ఆఁ అదే! ఇదేమిటి నేనెక్కడికో తేలిపోతున్నాను? ఏమిటి జ్ఞాపకం వచ్చిందీ? ఏమో! మరిచిపోయాను.

(సానుభూతి సభలో)

ఉపన్యాసకుడు : సోదర సోదరీ మణులారా! మన మిత్రుడు ప్రొఫెసర్ రంగారావుగారి మరణానికి సానుభూతి ప్రకటించే నిమిత్తం ఇక్కడ సమావేశమైనాం. రంగారావు నా ప్రాణస్నేహితుడు.

రంగా : పచ్చిఅబద్ధం! వీడే కాలేజీలో నా ఉద్యోగం పోవడానికి కారణం. అందుకనే నేను కడుపు చేత్తో పట్టుకుని ఉత్తరహిందూ స్థానానికి పోయాను.

ఉపన్యా: రంగారావు మన ఊరివాడైనందుకు నేను గర్విస్తున్నాను. ఆయనసిలాసఫీలో నిధి! ఖండ ఖండాంతరాల కాయన పేరు వ్యాపించింది. అతని పుస్తకాలు అర్థంకావడమే కష్టం! నిజం చెప్పాలంటే నా కవి అసలే అర్థంకాలేదు! అసలు నేను రాజకీయవాదిని, జీవితమంతా దేశసేవలో వెళ్లబుచ్చాను. నా ప్రియమైన పార్టీ నా సేవని గుర్తించి—

రంగా : నీనోట పవసికొక్కాలిరా నా కోసం జరుపుతున్న సభలో నా గురించి మాట్లాడవు? నా పుస్తకాలు మహామహా వాళ్లకే అర్థంకావు. నీకు బోధపడలేదని ఏకు పెందుకు! ఛీ! ఇహ నేనిక్కడ ఉండలేను. అంతా నటన! అంతా మోసం. జీవించినంతకాలం నేను మానవుల్ని ద్వేషించాను. మరణించిన తర్వాత ఆ ద్వేషం మరింత దృఢపడింది. మరణం ఎంత మధురంగా ఉంది! ఏ కోరికా లేకుండా చచ్చిపోవడం ఎంత హాయి! ఏకోరికా లేదూ? లేకేం? ఒక్క కోరిక మాత్రం మిగిలిపోయింది. ఆ అమ్మాయి పెట్టెలోంచి తీసిన రిస్టువాచీ తిరుగుతోందా? ఆగిపోయిందా? అగిపోతే ఆరు దగ్గరే ఆగిపోయిందా? మూడువాచీలు ఒక్కసాటు, ఒక్కచోట ఆగిపోతాయా? ఎందుకాగి పోకూడదు? ఎలా తీరుతుందీ సందేహం! ఆ అమ్మాయెక్కడుందో తెలిస్తే బాగుండును!

మగగొంతు : కంగ్రాట్యులేషన్స్ మిసెస్ సరళా! చాలా మిరేక్యులస్‌గా ఏస్కేప్ అయేరు!

సరళ : థాంక్ యూ శర్మగారూ, మీ ఆవిడ నింపాదిగా ఉన్నారా?

రంగా: ఈ ఆడవాళ్ల కిదో జబ్బు! ఎదటివాడి పెళ్లాం యోగక్షేమాలు భోగట్టాచేస్తారు! వాచీ సంగతి రానే రాదేమిటి చెప్మా?

శర్మ : మీ అక్కచెల్లెళ్ల రిస్టువాచీలు పేపర్లో కెక్కాయే!

రంగా : థాంక్ యూ శర్మగారూ !

కాంతం : సరిగ్గా నా వాచి పెట్లోంచి పైకి తీసిందో లేదో ఢాం! పెద్ద ఏక్సిడెంట్. రెక్కలొచ్చినట్టు నా కళ్లముందే ఎగిరిపోయింది. నేను కూర్చున్నదాన్ని కూలబడ్డాను. చిన్న గాయాలు తగిలాయి.

సరళ : పాపం! రంగారావుగారిది వీక్‌హార్ట్. లేకపోతే ఆయనా బతికుండేవాడే.

శర్మ : కేజువలిటీస్ లేకపోతే ఏక్సిడెంట్ ఏమిటి ?

సరళ : వెళ్లాకోళ్లాలొద్దు శర్మగారూ! రంగారావుగా రంటే నా కెంతో గౌరవం! ఆయన దురదృష్టానికి నేను చాలా విచారిస్తున్నాను.

రంగారావు : ఏమీ విచారం అక్కర్లేదు. నేను నిక్షేపంలా గున్నాను. నాసంగతి కేం? ఆ వాచీ మాట చెప్పు.

కాంతం : వాచీ మాడ్డానికి ముందు మా ముఖ్య ఎంత రభస పెరిగిం దనుకున్నారు! ప్రొఫెసరు వాచీ ఆరు దగ్గ రాగిపోయింది! దీని వాచీకూడా. బై ఎ స్ట్రైక్ ఆఫ్ కోఇన్సిడెన్స్. ఆరు దగ్గరే ఆగిపోయింది. పెట్లో ఉన్న నా వాచీ చూస్తానని—

సరళ : హల్లో. ఫాదర్ : శర్మగారూ : ఈయన మా నాన్న. నాన్నా : ఈయన బి. యే. లో నా క్లాస్‌మేట్ శర్మ. నన్ను కంగ్రాట్యులేట్ చెయ్యడాని కొచ్చారు.

రంగా : ఈ నాన్న ఇప్పుడే రావాలీ? ఇక మళ్లీ వీళ్లు వాచీ సంగతి మాట్లాడరు? ఎలా తెలుస్తుంది? ఏం సాధనం ?

శర్మ : క్షమించాలి! ఫోంచేసే వొచ్చాను.

రంగా : అక్కయ్యా అని అరిచిందికదా

అందులో కూడా ఆరే అయిందేమో? లేక రైలు పెట్టె బోల్తా పడుతున్నందువల్ల అరిచుండకూడదూ?

శర్మ: ఔనండీ. అమెరికా అంటే నా కేమిటో అసహ్యాం. బ్రిటన్‌లోనే చదవాలనుంది.

సరళ: శర్మగారో చిన్న పింక్ సోషలిస్ట్ నాన్నా!

ప్రకటన: చచ్చిపోయిన ప్రొఫెసర్ రంగారావు చాలాసేపు అక్కడే తచ్చాడాడు. కాని మళ్లీ వాచీ మాట ఎవరూ ఎత్తలేదు. కాలం ఇందాకా నేను చెప్పినట్టు, అంతా ఒకటే కాని, అందరికీ ఒకటి కాదు. మరణించిన రంగారావు జన్మించబోయే శిసువుల కాలంలో ప్రవేశించాడు.

(చల్లని నేపథ్య సంగీతం)

పిల్లల గొంతు తాతయ్యా, తాతయ్యా!

రంగా: మీ రంతా ఎవరర్రా!

ఒక పిల్లడు: మేం పుట్టబోయే పిల్లలం తాతయ్యా! భూమ్మీద బతకబోతున్నాం. బతకడం ఎంతో బాగుంటుంది కదూ?

రంగా: బతకడం బాగుంటుందని ఎవరు చెప్పారు. నన్నడగండి! అరవయ్యేళ్లు బతికిన వాణ్ణి. బతకడంలో ఉన్న బాధలన్నీ చెబుతాను.

ఇంకొక పిల్లడు: ఊపిరి తియ్యటమే ఎంతో సుఖమనీ, సులభమనీ అంటారు నిజమేనా తాతయ్యా?

రంగా: క్షయరోగం అన్న పేరెప్పుడైనా విన్నారూ? ఊపిరి తియ్యడం ఎంత సుఖమో ఎంత సులభమో క్షయరోగుల్ని అడగండి. భయంకరమైన క్షయవ్యాధికి భూలోకంలో ఏటేటా కోటానుకోట్ల మంది బలి అవుతారు. సరేనా? ఇంకో ప్రశ్న అడగండి!

ఒక పిల్లడు: బతికుంటే మంచి-మంచి వస్తువులు తినొచ్చు కాదూ? రకరకాల పళ్ళూ, వేడి వేడి అన్నం, లడ్డూ జిలేబీ, హల్వా, ఇడ్లీ, ఉప్మా, దోసె.

రంగా: ఆ గబ్బాయ్ ఆగు. అజీర్ణం అన్న మా టెప్పుడైనా విన్నావ్? అబ్బ. అన్ని రోగాలకీ అదే మూలం. భూలోకంలో తిన్నది జీర్ణించుకోలేక బాధపడుతున్న వాళ్లున్నారు. తినడానికి తిండి లేక దేవురిస్తున్న వాళ్లున్నారు. తినడమూ బాధే. తినకపోవడమూ బాధే!

ఇంకొక పిల్లడు: జీవించడం అంటే ప్రేమించడం అన్నమాట: నిజమైన ప్రేమని అనుభవిస్తే అంతకు మించిన స్వర్గం లేదంటారు నిజమేనా?

రంగా: అబ్బో: చాలా పెద్ద మాట లాడుతున్నావ్. నేనోటి చెబుతాను వినూ? ప్రేమే కాదు, ఏ అనుభవమైనా, అనుభవించినంతసేపే ఆకర్షణ. కాని ఆ తర్వాత యాతనే అనుకోండి! అన్ని అనుభవాలూ చవి చూసిన నేను చెబుతున్నాను వినుకోండి.

ఒక పిల్లాడు: మీ రెంత తెలిసిన వాళ్లయినా మేము స్వయంగా అనుభవించకుండా మీ వ్యాఖ్యానాలతో ఎలా తృప్తిపడగలం తాతగారూ:

ఇంకొకడు: ఇతడు చచ్చిపోయాడురా: చచ్చిపోయిన వాడు బతకడం మీద మాట్లాడితే ఇలాగే ఉంటుంది.

రంగా: అయితే వెళ్లండి: పుట్టండి: ఆ భూలోకంలో పడండి: మీ అంతట మీరే తెలుసుకోండి: నేను చెబితే నమ్మతారా? అన్ని అనుభవాలూ అయిన తర్వాత అప్పుడే తెలుస్తుంది వెళ్ళండి. శరీరాలు ధరించండి. ఎవరి శరీరాలలో వాళ్లు ఎవరి కాలం పొడుగున వాళ్ళు జీవించండి. కాలం కాలం! మరచిపోయిం దేదో మళ్ళీ జ్ఞాపకం వస్తోంది వాచీ. వాచీ! మూడో వాచీ! అందులో కాలం సాయంకాలం ఆగిపోయిందా లేదా? ఎలా తీరుతుందీ సందేహం?

ప్రకటన: ఈ సందేహం తీరదు. రంగారావు అనంతర యాత్ర అనంతంగా సాగిపోవలసిందే.

# గ్రంథ విమర్శనము

## సాతవాహన సంచిక

సంపాదకుడు : మారేమండ రామారావు, ఎమ్.ఏ., పి. హెచ్.డి.

ఆంధ్రేతిహాస పరిశోధక మండలి. గుంటూరు జిల : పది రూపాయలు.

౧౯౭౪ ఏప్రిల్‌లో అమరావతిలో జరిగిన ఆంధ్ర సామ్రాజ్యోత్సవం సందర్భంలో వచ్చిన వ్యాసాలతోను, తదితర సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుల వ్యాసాలతోను, ఆంధ్రేతిహాసపరిశోధక మండలివారీ సాతవాహన సంచిక ప్రకటించారు.

దీనిలో డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య, డాక్టరు మారేమండ రామారావు, డాక్టర్ దినేశ చంద్ర సర్కార్, డాక్టరు నీలకంఠశాస్త్రి, డాక్టర్ ఏ. ఎస్. ఉపాధ్యే, శ్రీ శివశంకర శాస్త్రి, వావిలాల సోమయాజులు, గట్టి లక్ష్మీనృసింహశాస్త్రి మొదలైన ప్రముఖులు, సాతవాహన యుగానికి సంబంధించిన ఆ యా విషయాలపై వ్రాసిన వ్యాసాలున్నాయి.

'ఆంధ్రుల చరిత్రలో ప్రాచీనాంధ్ర సాతవాహన యుగం ఒక ప్రధాన ఘట్టము. ఈ ప్రాచీనాంధ్రులు మహారాష్ట్రులని కొందరు, విదర్భ ప్రాంతంవారని మరికొందరు, బళ్లారి ప్రాంతంవారని కొందరు ఇప్పటికీ వాదవివాదాలు సాగిస్తూనే ఉన్నారు. సాతవాహనసంచికలోని ఆ యా చారిత్రికాంశాలు పరిశీలిస్తే ఆ ఆంధ్రమహారాష్ట్రాది ప్రాంతాలకు చెందిన ఆ యా చరిత్రకారులు అభినివేశం కొద్దీ చారిత్రికమైన ఈ సువర్ణయుగం తమతమ రాష్ట్రాలకు సంబంధింపజేసుకోడానికి ఎక్కువగా తాపత్రయం పడుతున్నారని కనిపిస్తుంది.

కాని, శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు, శ్రీ డాక్టరు మారేమండ రామారావుగారు మొదలైన సంచికలోని వ్యాసకర్తలు సాతవాహనులు ఆంధ్రులే అయిఉంటారని సయుక్తికంగా నిరూపించారు. డాక్టరు మారేమండరామారావుగారు తామీ సంచికలో ప్రకటించిన 1 సాతవాహన సామ్రాజ్య చరిత్రము 2 సాతవాహనసామ్రాజ్యము, సామ్రాజ్య పరిస్థితులు 3 సాతవాహన కళావైభవము అనే మూడు వ్యాసాలలోను, సాతవాహన సమస్యకు సంబంధించిన విషయాలన్నీ కూలంకషంగా చర్చించి, ప్రతిపక్షుల వాదాలన్నింటినీ సంగ్రహరూపంలో వివరించి, సయుక్తికంగా తమవాదం స్థిరీకరించుకొన్నారు. సాతవాహన యుగ సమస్య నిర్ణయానికి మనకు దొరికిన చారిత్రకాంశాలు చాలా తక్కువ. ఈ యుగసమస్యల విషయంలో ఇంకా నిశితంగా పరిశోధన జరగవలసిఉన్నది. అంతవరకు అభినివేశం విడిచి, ఏదో ఒక వాదం ఆలంబనంగా పట్టుకుని, సత్యాన్వేషణచెయ్యడం ఒక్కటే శరణ్యంలా కనిపిస్తుంది. ఈ సంచికలో వాత్స్యాయన కామసూత్రాలపై వావిలాల సోమయాజులుగారు రచించిన వ్యాసము సమగ్రంగా ఉన్నది.

గాథాసప్తశతి, సాతవాహనుల కవితా దర్పణము. అందుచేత ఈ విషయంలో ఇంకా సువిస్తృతము, సమగ్రము అయిన వ్యాసం ప్రకటించిఉంటే బాగుండేది. కుతూహలుని లీలావతీ కావ్యంకూడా సాతవాహన యుగానికి చెందిన ప్రముఖ కావ్యమే. దీనిని గురించి డాక్టరు ఉపాధ్యేగారు వ్రాసిన వ్యాసము చాలా సంక్షిప్తంగాను, పాఠకులలో ఔత్సుక్యం రేకెత్తించేదిగాను ఉన్నది. ఈ వ్యాసంలో డాక్టరు ఉపాధ్యే లీలావతీ కావ్యంలోని కథ మాత్రమే వ్రాశారు. అందుచేత లీలావతీ కావ్యాన్ని గురించి విశేషంగా తెలుసుకోగోరే పాఠకులకు ఇదికూడా అసంపూర్ణంగానే కనిపిస్తుంది. మొత్తంమీద సాతవాహన చరిత్రపైన రచించిన వ్యాసాలకంటె సాతవాహన వాఙ్మయంపై ప్రకటింపబడిన వ్యాసాలు అసమగ్రంగా ఉన్నాయి.

అజంతా గుహలలో సాతవాహనయుగంలోని చిత్రాలు కొన్ని ఉన్నాయి. వాటిని గురించి ఒక ప్రత్యేకవ్యాసం లేకపోవడము ఈ సంచికకు ఒక

లోపమే. అలాగే బుద్ధుని తరవాత మహా ప్రఖ్యాతి పొందిన నాగార్జునాచార్యుని మాధ్యమిక తత్త్వంపై కూడా ఈ సంచిక వ్యాసాలలో చాలా సంక్షిప్తంగా సూచించారు. నాగార్జునుని మాధ్యమిక వాదంకూడా ఒక ప్రత్యేకవ్యాసంలో వివరించి ఉంటే ఈ సంచిక ఇంకా సర్వాంగసుందరంగా ఉండేది.

సంపాదకులు సంచికచివర అనుబంధంలో సాతవాహనుల శాసనాలపాఠాలు, ఆ యా పురాణాలలో ఆ యా చక్రవర్తులను గురించిన ఘట్టాలు, కథాసరిత్సాగరంలోని గుణాఢ్య కథాదులు, గాథా సప్తశతిలోని గాథలు, అమరావతీ చైత్యము మొదలయిన బౌద్ధ శిల్పాల ఫోటోలు ప్రకటించారు. ఇవి పాఠకులకు చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. మొత్తంమీద ఈపుస్తకం సాతవాహన చారిత్రిక సమస్యలు, విషయాలు తెలిసికొనగోరే తెనుగుపాఠకులకు చాలా ఉపయోగకారిగా ఉన్నది. ముద్రణాదికాలలో ప్రత్యేక శ్రద్ధవహించి, సాతవాహనసంచిక ప్రకటించిన సంపాదకుల నీ విషయంలో అభినందిస్తున్నాము.

## తేనెతెట్టె

నాటిక. రచన, నోరి నరసింహశాస్త్రి సాహితీ సమితి : రేపల్లె వెల : ఒకరూపాయి.

ఇది శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు రచించిన నాటికల సంపుటి. దీనిలో తేనెతెట్టె ౨ పతంగయాత్ర, ౩ స్వయంవరము, ౪ వరాగమనము అనే నాలుగు నాటిక లున్నాయి .

తేనెతెట్టెకు సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత మారిస్ మేతర్‌లింక్ రచించిన తేనెటీగ జీవితము అనే గ్రంథం ఆధారము. ఆగ్రంథంలో మేతర్‌లింక్ తేనెటీగల జీవన విధానం అంతా సవిస్తరంగా నిరూపించాడు. తేనెటీగ జీవితం చాలా విచిత్ర మయినది. తేనెతెట్టెలో 'రాణి' ఒక్కతే ఉంటుంది. ఇక మగతేనెటీగలు తెట్టెలో ఉన్నా, వాటికి వేరే పని ఏమీ లేదు. ఇవి కేవలం రాణికి గర్భధారణార్థమే ఉపయోగిస్తాయి. ఇక మిగిలినవి స్త్రీ పుం జాతులకు రెండింటికీ సంబంధించని తృతీయప్రకృతులు. కాని తేనెతెట్టెపై అధికారం అంతా వీటిదే. 'రాణి గర్భధారణకాలంలో మేఘమండలందాకా ఎగిరి పోతుంది. ఈ రాణిని పోతు టీగలు అనుసరించి మేఘమండలంలోకి వెళ్ళిపోతాయి. కాని ఈ వెళ్ళే ప్రయత్నంలోనే చాలా తేనెటీగలు చచ్చిపోతాయి. మేఘమండలం వరకు ఎగరగలిగిన పోతుటీగ వల్లనే రాణికి గర్భోత్పత్తి అవుతుంది. కాని వెంటనే ఈ పోతుటీగ చనిపోతుంది. అంతట రాణి పోతుటీగ మృత శరీరంతో సహా మేఘమండలాన్నుంచి కిందికి దిగివచ్చి సంతానాభివృద్ధి చేసుకుంటుంది.

ఈ విచిత్రమైన తేనెటీగల జీవితం తీసుకుని రచించిన ఈ నాటికలో శ్రీ శాస్త్రిగారు రాణికి ప్రపంచ సృష్టికర్త్రియైన జగజ్జననీత్వం సూచించారు. ఈ భావమే ఈనాటికలో అంతటా అనుస్యూతంగా నడుస్తుంది.

'స్వయంవరం'లో స్వయంవరపద్ధతి మంచిది కాదని సూచితమైనది. వరాగమనంలో తొందరలో కుమార్తెను అత్తవారింటికి పంపడానికి ఇష్టపడని తల్లి అభిప్రాయానికి వ్యతిరేకంగా, వసువును వరునితో కూడా వెంటనే అత్తవారింటికి పంపడం జరుగుతుంది. ఇందులో వసువు మనోభావసూచన చాలా మనోజ్ఞంగా జరిగింది.

పతంగయానంలో సంపాతి జటాయువులు పందెం వేసుకుని సూర్యుని సమీపించడము, రెక్కలు కాలి తిరిగి నేలమీద కూలిపోవడము కథావస్తువు. మొత్తం నాటికలన్నింటిలోను పతంగయానం ఉత్తమంగా ఉన్నది. వీటిలో, ఒక్క వరాగమనంలో తప్ప మిగిలిన నాటికలలో నాటికాశిల్పం అంతగా కనబడదు. మిగిలిన నాటికలన్నీ ఎక్కువగా వర్ణనాత్మకంగానే కనిపిస్తున్నాయి. పతంగయానంలో నాటికాశిల్పం అంతగా కనిపించకపోయినా భావనాగాంభీర్యాన్ని బట్టి ఇది ప్రథమస్థానం అలంకరించవలసిన నాటిక.

———

## మల్లేశ్వర స్వామి

గ్రంథ కర్తలు

హరి రామలింగ శాస్త్రి, కొంపల్లి గోపాల రావు.

ఈ కవు లిద్దరు హైదరాబాదు రజాకార్ల అలజడిలో కాందిశీకులై ఒకరు కలువపాముల గ్రామములో ఉన్న దుర్గామల్లేశ్వరస్వామి సన్నిధిని, మరి ఒకరు విజయవాడలోని దుర్గామల్లేశ్వరుని సన్నిధిని, తలదాచుకొన్నారట. ఆసమయంలోనే, వీ రిద్దరు ఈ శతకం రచించారట.

ఇటీవల అధునాతనకవులలో, శతకాలు రచించే సంప్రదాయం సన్నగిల్లింది. దీనికి నేటి విద్యార్థులలోను, కవులలోను సహజమైన భక్తిభావం లేకపోవడం ఒక కారణం కావచ్చును. నేటి వారిలో అక్కడక్కడ కొందరు శతకరచయితలు కనిపిస్తున్నారు, కాని వీరిలో సాంప్రదాయికమైన సామాన్యమైన పలుకుబడిమాత్రమే కనిపిస్తున్నదిగాని ఉదాత్తమయిన సహజకవితావిర్భావం లేదని చెప్పవచ్చును.

కాని ప్రస్తుతకవులు ఈ సామాన్యసూత్రం అతిక్రమించి తమ మల్లేశ్వరస్వామిశతకంలో అనేకమైన పట్టులలో ఉదాత్తమైన కవిత్వపు పలుకుబడి అందుకొనగలిగారు.

వీరు వివిధభావాలతో వివిధమైన ఉక్తివైచిత్రిలో మల్లేశ్వరుని ఉద్బోధిస్తూ వ్రాసిన ఈ క్రింది పద్యాలు చాలా హృద్యంగా ఉన్నాయి.

"అల్లుండౌదువు కొండరాయనికి స్వ
    ర్ణాహార్య మన్ పేర బల్
విల్లుం గల్గిన వాడవౌదు ; రజతో
    ర్వీభృచ్ఛిఖాస్థాన మం
దిల్లుం గల్గినవాడ వౌదు ; విటు లెం
    తే జాతిసంబంధముల్
చెల్లన్ నిన్నరగింప నేర్చెదను నీ
    చిత్తంబు మల్లేశ్వరా !"

"వేదంబుల్ తలక్రిందుగా జదివి ష
    డ్వేదాంగముల్ నేర్చియున్
వేదాంతార్థ ముపన్యసించి కడుఁ గ
    ర్వింపంగ బ్రాప్తించునే
వాదంబుల్ పొనరింపగాగలుగునే
    ప్రాక్కర్మ లభ్యంబు నీ
పాదాంభోజ మరందపానము కృపా
    పాథోధి మల్లేశ్వరా !"

శివభక్తి శూన్యమైన జీవితం వ్యర్థమని వక్కాణించే ఈ క్రిందిపద్యం ప్రత్యేకంగా పరిశీలింపదగినది.

"సౌరభ్యమ్ము కొరంత యైన సుమనో
    జాతమ్ము చందంబునన్
శ్రీరాజార్ధ కిరీట మంజు పద రా
    జీవ ద్వయీ సేవనా
సారంబున్ గననట్టి వారిభవముల్
    చర్చింపగా వ్యర్థముల్ !
వేరింకేటికి నూరుమాటలు శివా !
    విశ్వేశ మల్లేశ్వరా !

ఈకవులు తమ రచనలలో ధూర్జటికవి కాళహస్తీశ్వరశతక రచనానైదగ్ధి చక్కగా అలవర్చుకున్నారు. అంతమాత్రంచేత వీరు ధూర్జటికవిని అనుకరించారని మాత్రమే అనుకోవడం భావ్యం కాదు. పీఠికవిత ధూర్జటికవితా గాంభీర్యం తలపింపజేస్తున్నదని మాత్రమే పై విమర్శనాభిప్రాయము.

వీరు మత్తేభ శార్దూలాలు గుఱ్ఱాలను కదం తొక్కించినట్లు నడిపించగలిగిన దిట్టలు. ఈవిషయమే ఈ క్రిందిపద్యంలోకూడా ఛలోక్తిగా వాడారు.

" ఈ యూషత్కృతికర్త చేయునది,
యేమీ యంచు లోలోన నీ
వే యాలోచన లైన సేయకుము మ
త్తేభమ్ము, శార్దూలముల్
స్వాయత్తమ్ములు నాకు వానినిక నీ
పై సంప్రయోగించి నీ
యీ యశ్రద్ధను మాన్పెదన్ వలదు సు
మ్మీ, పట్టు మల్లేశ్వరా !"

సమర్థులైన ఈ కవిజంట కవిత సహృదయ సమాదర యోగ్యము. ఉదాత్త కవితాగౌరవం అందుకో గలిగిన పద్యాలు వీరి రచనలలో ఎన్నైనా ఉదాహరించవచ్చును. కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారీ శతకానికి తలస్పర్శిఅయిన పీఠిక రచించారు.

---

## రామాయణ సుధా లహరి
## అయోధ్యాకాండము

గా. శ్రీ. చంద్రమౌళి. ప్రకాశకులు : సందేశమాల, తెనాలి. వెల: రెండు రూపాయలు.

ఇది సంస్కృత రామాయణ వివరణాత్మకమైన గ్రంథము. దీనిలో శ్రీచంద్రమౌళిగారు సంస్కృత రామాయణంలోని కథాఘట్టాలు వివరిస్తూ, ఆయా రామాయణ కాల సాంఘికాచారవిశేషాలుకూడా తెలుగుపాఠకులకు తెలియబరిచారు.

వాల్మీకి రామాయణంలో ఘట్టాలనేకాలు ప్రక్షిప్తాలని విద్యాధికులు కొందరు తలుస్తున్నారు. ఉదాహరణకు రామాయణంలోని ఈ క్రిందిశ్లోకం తీసుకుందాము.

యథాహిచోరః స తథాహి బుద్ధః
తథాగతం నాస్తికమత్ర విద్ధి
తస్మాద్ధి యః శంక్యతమః ప్రజానాం
న నాస్తికే నాభిముఖో బుధః స్యాత్.

ఈ శ్లోకంలోని బుద్ధ తథాగత పదాలు చూచి కొందరు రామాయణ విమర్శకులు రామాయణము బుద్ధునికి తరవాత రచింపబడినదని భావించారు. ఈ వాదం అంగీకరించని పండితులు కొందరు రామాయణంలోని ఈ శ్లోకం ప్రక్షిప్తమై ఉంటుందని దీన్ని తోసివేస్తున్నారు.

అయితే శ్రీ చంద్రమౌళిగారీశ్లోకంలోని బుద్ధ తథాగత పదాలు గౌతమబుద్ధునికి సంబంధించినవి కావనీ రామాయణకాలానికి పూర్వం ఉన్న లోకాయతికులను గూర్చి మాత్రమే ఈపదాలు సూచిస్తున్నాయని సోపపత్తికంగా నిరూపించారు.



ప్రప్రథమంగా సంస్కృతరామాయణము చదవదలిచినవారికీ, తెలుగురామాయణం చదవదలిచినవారికీ రామాయణసుధాలహరి చక్కని ప్రవేశికగా ఉపయోగిస్తుంది.

గ్రాంథికాంధ్రం వాడడం అంతగా అలవాటు లేని ఈరోజులలో స్వాదువు, హృద్యము అయిన గ్రాంథికాంధ్రంలో గ్రంథం రచించిన ఈగ్రంథకర్త ప్రత్యేకంగా అభినందనీయులు.

ఈరామాయణసుధాలహరి ఆయాకాండల మూలానువాదాలతో కలిపి ప్రచురిస్తే పాఠకులకు ఇంకా ఉపయోగకారిగా ఉండేది. ప్రకాశకులు ప్రస్తుతం ప్రకటించిన అయోధ్యాకాండలాగే క్రమంగా మిగిలిన కాండలు కూడా ప్రకటించగలరనీ, అయోధ్యాకాండలాగే మిగిలినవి కూడా అందరికీ అందుబాటులో ఉండేటట్లు చూస్తూ ఆకర్షకంగా ప్రకటించగలరనీ ఆశిస్తున్నాను.

---

## కట్టా వరదరాజు రామాయణము
## బాలాయోధ్యాకాండలు

కట్టా వరదరాజు. సంపాదకులు : శ్రీ నిడుదవోలు వెంకటరావు. ఎమ్. ఏ. మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రోపన్యాసకులు.

ప్రకాశకులు : శ్రీ యస్. గోపాలన్. బి. ఏ. బి. యల్ కార్యదర్శి, టి. యమ్. యస్. యస్. మహల్ లైబ్రరీ, తంజావూరు.

వెల : పదిరూపాయలు.

ఈమధ్యన చెన్నపురిప్రభుత్వం ఆయాభాషలలోని సుప్రసిద్ధ తాళపత్రగ్రంథాలు కొన్ని ప్రకటించవలెనని నిశ్చయించింది. ఇది తంజావూరుసరస్వతి మహల్ గ్రంథాలయప్రతి ఆధారంగా చేసుకొని ప్రకటించిన గ్రంథము. దీనిలో బాలాయోధ్యాకాండలు మాత్రమే ప్రచురించారు.

ఆంధ్ర ద్విపద వాఙ్మయదృష్ట్యా ఈగ్రంథప్రకటనము చాలా ముఖ్యమైనది. కట్టా వరదరాజు, ఆర్వీటి వంశీయుడైన రామదేవరాయలు పెత్తల్లి పినతల్లులమనమలు. రామదేవరాయలు ౧౭ వ శతాబ్దము పూర్వభాగములో రాజ్యపరిపాలన చేసినవాడే. అందుచేత కట్టా వరదరాజు కూడా ఆ కాలపువాడే అయిఉండాలని శ్రీవెంకటరావుగారు పీఠికలో సహేతుకంగా నిశ్చయించారు.

శ్రీవెంకటరావుగారు పీఠికలో సూచించినట్లు యథావాల్మీకంగా రచించిన ద్విపదరామాయణాలలో కట్టా వరదరాజుకృతి ప్రప్రథమంగా పరిగణింపదగినది. ఈవిషయంతోబాటు శ్రీవెంకటరావుగారు మరి ఒక ముఖ్యవిషయం కూడా తమ పీఠికలో సూచించారు. రంగనాథరామాయణంలో అధికపాఠాలుగా కనిపించిన కొన్ని కొన్ని భాగాలు కట్టావరదరాజు రామాయణ గ్రంథంలో కనిపిస్తున్నాయి. తాళపత్రలేఖకులలో ఇలాగ ఒక పుస్తకంలో భాగాలు మరి ఒక గ్రంథంలో వ్రాస్తూండడము ఆచారంలో ఉన్నదట. అందుచేత వరదరాజురామాయణం రంగనాథరామాయణపాఠపరిష్కరణదృష్ట్యా చాలా ముఖ్యమైనది. ఇట్లాగే కట్టావరదరాజు రామాయణపరిష్కారానికి కూడా రంగనాథరామాయణం తోడ్పడగలదు.

రంగనాథరామాయణరచన అంతగా యథామూలంగా సాగలేదు. అందుచేత ప్రస్తుత రామాయణమే యథామూలమైన ప్రప్రథమాంధ్రరామాయణమని అనాలి.

వ్యాకరణదృష్ట్యా కూడా కట్టావరదరాజరామాయణప్రకటనము చాలా ముఖ్యమైనది. ఈ గ్రంథంలో అంతటా వ్యాకరణవిరుద్ధాలని చెప్పబడే చేతురు, కోతురు, పట్టుక, చేసుక వంటి ప్రయోగాలు చాలావిరివిగా కనిపిస్తున్నాయి.

ఈకవి శైలినిబట్టి చూస్తే ఇతడు ఆంధ్రభాషలోని ఉత్తమకవి వర్గంలో చేర్పదగినవాడుగా కనబడడు. అలాగని ఈకవిని మరీ సామాన్యకవివర్గంలో చేర్పడానికి వీలు లేదు.

ఈక్రింది ఉత్తమోదాహరణలను బట్టి ఈకవి కవితాపరిపాకం గ్రహింపవచ్చును. ఈక్రిందివి ఈతని సంస్కృతప్రాయమైన శైలికి ఉదాహరణంగా ఇవ్వవచ్చును.

"కాంచనదళరత్న కందళ కర్ణి
కాంచిత కమల వనాభిశోభితము.

మకరంద రసలోల మద చంచరీక
నికరగాయన గాన నిబిడీకృతంబు
శౌనకాదిమ మహా సంయమిశ్రేష్ఠ
మానితాశ్రమ లసమాన కూలంబు
మానిత సురత సంభ్రమ రణ దివిజ
మానినీ క్షణా మణీమేఖలారవము.
కలిత లతా డోలికా లోల మాని
కుల కన్యకౌతుకాకోటిస్వనంబు"

ఇతడు ద్విపదరచనలో గల వైవిధ్యాలన్నీ గమనించి ఆయాఘట్టాలకు అనువైనట్లుగా ద్విపదలు రకరకాలుగా నడిపించాడు. ఈక్రిందిదానిలో ద్విపద రచనలోని పోకడ గమనింపవచ్చును.

"రవిలేని దినము, సారథిలేని రథము,
కవి లేని కీర్తి, యంకములేని పోటు,
ప్రతిలేని వాదు, తీర్పరి లేని సేన,
ధృతిలేని తెగువ, కూరిమి లేని చెలిమి,
దొరలేని సీమ, చంద్రుడు లేని రాత్రి,
తరిలేని సంధ్య, మంత్రము లేని జపము,
సతిలేని గృహము, వాసన లేని పూవు,
భృతిలేని కొలువు, కోయిల లేని వనము,
శ్రుతి లేని పాట, శూరులు లేని కోట,
కతలేని రచన, నిల్కడ లేని మాట"

ఇలాగే ద్విపదరచనలో అనేక విధాలయిన రచనా వైవిధ్యం ఈరామాయణంలో అంతటా కనిపిస్తున్నది.

ప్రస్తుత రామాయణం ప్రకటనకై తంజావూరు గ్రంథాలయంలో ఒకే ప్రతి లభించడం వల్ల అనేకచోట్ల గ్రంథపాతాదికాలు అలాగే వదిలి వెయ్యవలసి వచ్చిందని సంపాదకులు వ్రాస్తున్నారు. అన్నివిధాలా సామర్థ్యంతో ప్రకటింపబడిన ఈగ్రంథానికి తప్పొప్పులపట్టిక ఒక్కటే లోపంగా కనిపిస్తునది. త్వరలో ఈరామాయణంలోని మిగిలిన కాండలుగూడా ప్రకటింపబడగలవని ఆశిస్తున్నాము. ఇలాంటి ఉత్తమగ్రంథం ప్రకటింపజేసిన చెన్న రాష్ట్రప్రభుత్వం ఆంధ్రభాషాభిమానుల అభిమానాదరాలకు పాత్రమయింది.

---

## గ్రంథ స్వీకారము:

### భక్తితత్త్వము

శ్రీ నిర్వికల్పానందస్వామి, ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల: ౦-౧౨-౦

---

### కొండవీడు
### [నాటకము]

రాయప్రోలు సుబ్రహ్మణ్యము, సాహితీ సమితి: ఏలూరు వెల ౧-౮-౦

### ప్రాచీన ఖగోళము

వేలూరి శివరామశాస్త్రి చిరివాడ, కృష్ణాజిల్లా, వెల మూడు రూపాయలు.

---

### అంబికావిజయము

డాక్టర్ పురాణపండ రామమూర్తి, శ్రీభారతీ ముద్రణాలయము, ఆలమూరు వెల ౦-౧౨-౦

---

### కాణ్వీయప్రముఖుల ప్రశంస
### ప్రథమభాగము

వంగిపురపు చలపతిరావు ఆంధ్ర యాజ్ఞవల్క్యసంఘము కేంద్రం : గుంటూరు వెల ౦-౮-౦

---

***Journal of the Andhra Historical Research Society* Editor : R. Subba Rao M.A; L.T. M.E.S.**
***The Andhra Historical Research Society, Rajahmundry.***

---

### క్షేత్రయ్యపదములు, శృంగారరస మంజరి

సంపాదకుడు, శ్రీ విస్సా అప్పారావు, ఆంధ్రగాన కళాపరిషత్తు, రాజమహేంద్రవరము, వెల: ౪-౦-౦.

### ఆంధ్రులు-చరిత్ర

డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్య. ఎమ్. ఎ. పి. హెచ్. డి. ఆంధ్రసాహిత్య పరిషత్తు హైదరాబాదు. వెల ఒకరూపాయి.

### చేతిపనులు : వడ్రంగము

మామిడన్న వెంకటేశ్వరరావు. బాలన కితాబ్స్, గుడివాడ వెల ౧-౮-౦

### సమాజ సామ్రాజ్యము
### లేక
### ఆదర్శప్రభుత్వము

ఉభయభాషాప్రవీణ పంచాంగం వెంకటాచార్యులు, మునిసిపల్ హైస్కూలు, హొస్పేట, బళ్లారిజిల్లా, వెల రెండురూపాయలు.

### త్యాగి

భాట్టం సూర్యప్రకాశశర్మ, వాణీగ్రంథమండలి రాజమహేంద్రవరము. వెల ౧-౮-౦

### నన్నయ్యభట్టు

చిలుకూరు రామభద్రశాస్త్రి. పండితుడు, వీరేశలింగాస్తికోన్నతపాఠశాల, రాజమహేంద్రవరము వెల ౧-౪-౦

### మాఘకవి

చిలుకూరి రామభద్రశాస్త్రి. ప్రకాశకులు : వేంకటరామా అండ్ కో! విజయవాడ. వెల ౧-౦-౦

### దుర్భిక్షము

శ్రీ వి. సుబ్బన్న శతావధాని, ప్రకాశముద్రణాలయము, ప్రొద్దుటూరు. వెల ఎనిమిది అణాలు

### గౌతమబుద్ధ

చెరుకూరివీరయ్య ఎం. ఏ. ఎల్. ఎల్. బి. పి. ఆర్. అండ్ సన్సు, విజయవాడ వెల ౧-౮-౦

### సంఘర్షణ

రెంటాల గోపాలకృష్ణ, సాహితీప్రవాసి, గాంధీనగర్, విజయవాడ. వెల పన్నెండు అణాలు

### ఆదర్శం

అంతటి నరసింహం. ఎం. ఏ, వాణీగ్రంథమండలి. రాజమహేంద్రవరం. వెల రెండురూపాయలు.

### రాఘవయాదవీయమ్

వింజమూరి సోమేశకవి. ప్రకాశకులు వింజమూరి వెంకన్న పంతులు రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్ సూర్యారావు పేట, కాకినాడ. వెల ౧-౦-౦

### పాశ్చాత్య విద్యావేత్తలు

మద్దూరి సత్యనారాయణమూర్తి బి. ఏ. డిప్. ఇడి. హెడ్మాస్టర్, గవర్నమెంటు హైస్కూల్, చెన్నూర్ హైదరాబాద్ (దక్కన్). వెల రెండు రూపాయలు.

### ఆంధ్రగీతగోవిందకావ్యము

శతావధాని చల్లా పిచ్చయ్య, సంస్కృత కళాశాల, పొన్నూరు. గుంటూరుజిల్లా. వెల రెండు రూపాయలు

### ప్రేమసీమ

వెల్దంట ప్రభాకరరావు. సాహిత్యనికేతనము. మల్లేపల్లి, హైదరాబాదు (దక్కను). వెల రెండు రూపాయలు.

### రమణస్మరణ

రామచంద్రకౌండిన్య. కాపీలకు : కాళహస్తి రామనాథముగారు ట్రంకురోడ్, నెల్లూరు. వెల ౮ అ.

### అభిరామ సంకీర్తనలు

శ్రీమతి, యస్, నీలాంబ ఛత్రపురం, గంజాం జిల్లా.

### బాపు : నాతల్లి

కుమారి మనూగాంధి. అనువాదకుడు : నండూరి వెంకటకృష్ణమాచార్యులు సర్వోదయ సాహిత్య మందిర్ హుసేని అలంరోడ్, హైదరబాద్ (దక్కన్) వెల పన్నెండుఅణాలు.



Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras. Editor : S. Sambhu Prasad